# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్ మద్రాసు

| | | |
|---|---|---|
| మహిళా విద్యాలయము | : | హిందీ, కాశీవిశ్వవిద్యాలయపు ఎడ్మిషన్, ఇంటర్మీడియెట్, ఇ.యస్.ఎల్.సి., ఆంధ్ర మెట్రిక్ పరీక్షలకు శిక్షణ. |
| పారిశ్రామిక విద్యాలయము (గవర్నమెంటువారిచే రికగ్నైజ్ చేయబడినది) | : | కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలుఅల్లికలు, నూలు వడకుట, చేనేత, అచ్చుకూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ. బీద విద్యార్థినులకు ఉచితము. |
| పారిశ్రామిక శిక్షణ కేంద్రము | : | భారత ప్రభుత్వ పునరావాసశాఖవారిచే, 7-ఎ రోజరీ చర్చి రోడ్డులో ఆంధ్రమహిళా సభ పారిశ్రామిక భవనములలో వస్త్రములపై అద్దకపుపని, మిషనుకుట్టు, మిషను అల్లిక, చేనేత, బుక్ బైండింగు, ఎంబ్రాయిడరీ మొదలగు పరిశ్రమల్లో శిక్షణ ఇవ్వబడుచున్నది. |
| టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్ | : | స్త్రీలకు టైపు,—గవర్నమెంట్ పరీక్షలకు శిక్షణ. |
| మహిళా మందిరము | : | స్త్రీవిద్యార్థినులకు వసతిగృహము. |
| ఆంధ్ర మహిళ | : | స్త్రీలలో విద్యావ్యాప్తికై, స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాసపత్రిక. |
| నిర్మలాదేవి గ్రంథాలయము | : | సభ్యురాండ్ర, విద్యార్థినుల ఉపయోగార్థము సేకరించిన తెలుగు, హిందీ, ఆంగ్ల గ్రంధ సముదాయము. |
| నర్సింగ్ హోమ్ | : | స్త్రీశిశువులసంరక్షణశాల, ప్రసూతిశాల, ఉచిత వైద్యశాల— అడయారులో నిర్మించబడినవి. భారత ప్రభుత్వ ఆరోగ్యశాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త నర్స్‌ఎయిడ్— మంత్రసాని పనులలో శిక్షణ యివ్వబడుచున్నది. |
| ముద్రణశాఖ | : | ఆంధ్ర మహిళా సభవారిచే స్వంతంగా స్థాపించబడిన. విద్యార్థినులకు అచ్చుకూర్పు, బైండింగు, ప్రూఫ్ రీడింగు, మొదలైనవి ఉచితంగా నేర్పబడును. |
| సంక్షేమ విస్తరణ కార్యక్రమం | : | నెల్లూరు జిల్లా సూళ్ళూరుపేట తాలూకాలో మెటర్నిటీ, శిశు సంక్షేమ కేంద్రములు నిర్వహింపబడుచున్నవి. |

క్రీడలు క్లబ్బు శాఖలలో

**సభ్యురాండ్రుగా జేరి, యీ జాతీయ సంస్థను పోషించండి.**

# ఆంధ్ర మహిళ

వ్యవస్థాపకురాలు :

శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్

ఎం.ఎ., బి.ఎల్.,

సంపాదకురాలు :

శ్రీమతి ఆదుర్తి భాస్కరమ్మ.

నెలనెలకు నాంధ్రులింటింట వెలసినీవు
వివిధ సందేశముల దెల్పివేడ్కగొల్పి
సిద్ధసంకల్ప దుర్గాంబచేతిచలువ
నలరుచుండుము కలకాలమాంధ్ర మహిళ !

— రావూరి వేంకటసుబ్బమ్మ.

ఆంధ్ర మహిళా సభవారిచే స్థాపించబడిన ముద్రణాలయములో
ముద్రితము

# ఆంధ్రమహిళ

సంపుటి 12 :: ఆగస్టు '55 :: సంచిక 4



సంవత్సరచందా :: :: ఆరు రూపాయలు

వ్యవస్థాపకురాలు : శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్

సంపాదకురాలు : శ్రీమతి ఆదుర్తి భాస్కరమ్మ

ముద్రణ : ఆంధ్ర మహిళా ప్రెస్.




సంపుటి 12 :: ఆగస్టు '55 :: సంచిక 4

# భారతరత్న శ్రీ జవాహర్ లాల్ నెహ్రూ

భారత ప్రభుత్వాన్ని పడగొట్టుటకు సర్వప్రయత్నములు చేసిన యీదేశములోని కమ్యూనిష్టుపార్టీకి అండ, ఆదర్శము అయిన సోవియటురష్యాలో అఖండ గౌరవాదరణలను పొంది తిరిగి స్వదేశమునకు వచ్చిన భారత ప్రధానికి రాష్ట్రపతి రాజేంద్రప్రసాదు "భారతరత్న" అను బిరుదమునిచ్చి సత్కరించారు. ఇది చాలా సంతోషకరమైన విషయము. అసలు మన ప్రధానికి పేరు పెట్టేటప్పుడే తలిదండ్రులు జవాహర్ అనగా రత్నము అని పేరు పెట్టారు. అది వారికి పిల్లవానియందు గల ప్రేమచేతముద్దుచేత పెట్టినా వాని విషయములోనది సార్థకనామధేయమే అయినది. జవాహరు అన్ని విషయములలోను నిజంగా రత్నమే. మనకు స్వాతంత్ర్యము వచ్చిన ప్రారంభ దినములతో. తటస్థించిన ఒడిదుడుకులకు, కష్టములకు పరిపాలనా బాధ్యత, రాజనీతి విశారదుఁడగు ఈ రత్నము చేతులలో నుండబట్టికాని లేకపోయినట్లయితే యేమయేదో ?

ఈయన సాధించుకొనివచ్చిన విషయము సామాన్యమైనదికాదు. రెండు గొప్పదేశములు ఒకదానితో నొకటి డీకొనుటకు ఒకరినిమించి మరియొకరు తమకు గల శాస్త్రజ్ఞానమంతా ఉపయోగించి మానవ వినాశకరములగు ఆటంబాంబులు, హైడ్రోజను బాంబులు మొదలగు వానిని తయారుచేస్తోన్నారు. ఈ ప్రయత్నములుచూసి మూడవ ప్రపంచయద్ధము తప్పదుకాబోలు భగవంతుడాయని ప్రపంచమంతా భయపడిపోతోంది. ఆదేశాలలో వారు మారణాస్త్రాలను తయారుచేస్తోంటే భారతదేశంలో మన ప్రధాని శాంతి సందేశమును రేడియోల ద్వారా, పత్రికల ద్వారా లోకాని కందజేస్తోన్నాడు. నిష్కల్మషమైన, ప్రేమపూనితమైన ఆయన వాక్యామృతమును చవిగొని ముగ్ధులై యిదివరలో బ్రిటను, అమెరికా యీయనను తమదేశముల కాహ్వానించి, అఖండ గౌరవమునుచూపి వారి సందేశమును శిరసావహించారు.

ఈసారి భారతదేశంలో శత్రువు అనుకొంటోన్న కమ్యూనిష్టుల కండగానిలిచిన కమ్యూనిష్టుదేశం రష్యా ఆహ్వానించింది. మన ప్రధాని శత్రుమధ్యమునకు వెళుతోన్నాడే ఎలా అనిపించింది. ఆలా శత్రువేమో అనుకొన్న రష్యాచేత యెన్నఁడూ కనీవినీ యెరుగని బ్రహ్మాండమైన సన్మానమునుపొంది, వారినికూడా తనవాగ్ధోరణికి ముగ్ధులగునట్లుచేసి, శాంతిస్థాపనకు వొప్పించి, తిరిగి ప్రపంచయుద్ధము రాకుండా ఆపి అఖండ విజయమును సాధించుకు వచ్చాడంటే సామాన్యవిషయమా ? ఈయన భారతదేశానికి రత్నంకాదూ ? భారతరత్నమేకాదు ప్రపంచరత్న మను బిరుదమునకుకూడ నర్హుడే.

---



# స్వయంసిద్ధ

స్వీయ పరిశ్రమవల్ల అభివృద్ధిలోనికి వచ్చినవారే స్వయంసిద్ధులు. స్వయంసిద్ధకి మారుపేరే దుర్గాబాయి: ఇందులో అతిశయోక్తి లేదు. దానికి నిదర్శన ఆమె గడపిన నలుబదిఆరుసంవత్సరాల జీవితం. యౌవన దశలో అక్షరాలురాని దుర్గాబాయి, కొన్ని సంవత్సరాల తపఃఫలితంగా, చూపరుల కనుకుట్టేలా పట్టభద్రురాలైంది; లాయరైంది. అలా చూస్తూ వుండగానే ఆంధ్రలో ఒక మూలలో పుట్టి పెరిగిన దుర్గాబాయి యావద్భారత దృష్టినీ ఆకర్షించుకొంది. లాయరుగా అద్భుతంగా రాణిస్తున్నదల్లా అదివదలి రాజకీయాలు చేపట్టింది; రాజ్యాంగాన్ని విరచించడానికి నెలకొల్పబడ్డ సభా సభ్యురాలైంది; పార్లమెంటు సభ్యురాలైంది; ప్లానింగు కమిషన్ సభ్యురాలైంది; తరువాత సాంఘిక సంక్షేమ సంస్థాధిపతి అయింది. ఓ ప్రక్కనుంచి యిలా జరుగుతూంటేనే, వేరొక ప్రక్కనుంచి, తనదృష్టిని స్త్రీజనోద్ధరణ వైపు త్రిప్పింది. అదే ఆశయం దృష్టిలో పెట్టుకుని ఆంధ్ర మహిళా సంస్థను స్థాపించింది. యీ సంస్థ యీనాడు మహిళాభ్యుదయ కార్యక్రమాలకి ఆటపట్టు. ఈసంస్థ పునాది, ఒకే ఒక వ్యక్తి కృషిఫలితం అని జ్ఞాపకం తెచ్చుకుంటే ఎవరికేనా ఆశ్చర్యం కలుగకమానదు. ఆవ్యక్తిపై అవ్యాజమైన అభిమానం కలుగకమానదు.

ఇటువంటి దుర్గాబాయి, పదికాలాలపాటు మన మధ్య మసలాలనీ, దైవం ఆమెను ఆయురారోగ్యాలు ప్రసాదించాలనీ, - ఆమె జన్మదిన (13-7-1955) సందర్భంలో - కోరుతున్నాం.

—కె. రామలక్ష్మి.



# రాజకీయాలు

శ్రీ గోళ్ళమూడి రామచంద్రరావు

1955 జూన్ నెల నాలుగోవారం మొదలు జులై మూడోవారం వరకూ ఇండియాలోనూ వివిధదేశాల్లోనూ జరిగిన ముఖ్యసంఘటనలు ఇవి — జెనివాలో అగ్రరాజ్య నాయక సమావేశం, వియత్నాంలో యుద్ధ విరమణ సంఘంమీద అమెరికా అనుచరుల దాడి, సింగపూర్‌లో రాజ్యాంగ ప్రతిష్టంభన, ఇండియాలో నవీన సోషలిజం స్థాపనపై యుగోస్లావియా అభిప్రాయ ప్రకటన, పాకిస్థాన్‌లో మరొకరాష్ట్ర ప్రభుత్వం బర్తరఫ్, గోవాసమస్యపై నెహ్రూ హెచ్చరిక, నందికొండ ప్రాజక్టు పనిప్రారంభం, ఆంధ్రశాసనసభలో విశాలాంధ్ర ప్రస్తావన.

• • •

జులై 18 నుంచి 23 తేదీ వరకూ అమెరికా అధ్యక్షుడు ఐసెన్‌హోవర్, సోవియట్ ప్రధాని బుల్గానిన్, బ్రిటీషు ప్రధాని ఈడెన్, ఫ్రెంచి ప్రధాని ఫోర్ తమ విదేశాంగ మంత్రులను, సలహాదార్లను వెంట ఉంచుకుని ప్రస్తుతం ఉభయవర్గాల మధ్యనూ జరుగుతున్న ప్రచ్ఛన్న యుద్ధాన్ని ముగించే విషయమైచర్చించారు. వాళ్ళు జర్మనీ ఏకీకరణ, యూరప్ భద్రత, కమ్యూనిస్టు. కమ్యూనిస్టేతర రాజ్యాలమధ్య సంబంధాల అభివృద్ధి, ఆయుధాల తగ్గింపు అనే సమస్యపై చర్చించారు. ఈ అంశాలమీద లోగడ భావించినట్లే దేనిమీదనూ నికరమయిన ఒప్పందమేమీ జరగలేదు. అయితే మొత్తంమీద ఈ సంప్రదింపులు పరస్పర భయ సందేహాలను కొంతవరకూ తగ్గించ గలిగినవని మాత్రం చెప్పవచ్చు.

ఇందులో మొదట అంతర్జాతీయ కమ్యూనిజం, తూర్పు యూరప్ దేశాల్లో కమ్యూనిస్టు ప్రభుత్వాల స్థాపనను చర్చించాలని ఐసెన్‌హోవర్ మొదట ప్రతిపాదించారు కాని, తరవాత ఉపసంహరించుకున్నారు. వాళ్ళు చర్చించిన నాలుగు అంశాలమీదనూ చర్చల ధోరణి ఈవిధంగా ఉన్నది.

జర్మనీ ఏకీకరణ — ఐక్య జర్మనీ ఏవర్గంలోనూ జేరకుండా తటస్థంగా ఉండాలనీ, అట్లాంటిక్ మండలితో పశ్చిమ జర్మనీ చేసుకున్న ఒప్పందాలు ఐక్య జర్మనీకి సంక్రమించరాదనీ రష్యావాదించింది. ఐక్యజర్మనీ అట్లాంటిక్ కూటమిలో ఉంటే జర్మన్ సైనికబలం విజృంభించకుండా ఉంటుందనీ, జర్మనీ తటస్థంగా ఉంటే, అస్థిమిత పరిస్థితు లేర్పడి,తిరిగీ హిట్లర్ తత్వం తల ఎత్తుతుందని పశ్చిమ రాజ్యాలు వాదించినవి. ఈ విభేదాలు ప్రస్తుతం గడవరానివికనుక ఇంకా సంప్రదింపులు జరపటానికే నిశ్చయించబడ్డది, పశ్చిమ జర్మనులు సన్నిహితం కావటమే ప్రస్తుతం అవసరమని రష్యా ఉద్ఘాటించింది.

యూరప్‌భద్రత—యూరప్‌లో తిరిగీ జర్మనీవల్ల ప్రమాదం రాకుండా ఉండటానికీ ఇతరత్రాకూడా ఎవ్వరికీ ప్రమాదం ఉండకుండా చేయటానికీ జాగ్రత్త తీసుకోవాలని ప్రయత్నం జరిగింది. అంట్లాంటిక్ మండలినీ, తాము దానికి ప్రతిగా ఏర్పాటుచేసిన తూర్పు యూరప్ మండలినీ రద్దుచేసి, అన్ని యూరప్‌రాజ్యాలూ కలిసిరక్షణ ఒప్పదం చేసుకోవాలని రష్యా ప్రతిపాదించింది. దానికి పశ్చిమరాజ్యాలు ఒప్పుకోలేదు. అట్లాంటిక్‌మండలి శాంతి రక్షణ కోసమే ఏర్పడ్డదనీ రష్యా మీద కత్తి కట్టటానికి కాదనీఐసెన్‌హోవర్ అన్నారు. రష్యామీదకత్తికట్టేది కాకపోతే అందులో రష్యా నెందుకు చేర్చుకోరు అని బుల్గానిన్ ప్రశ్నించారు. దానికి సమాధానంలేదు. (రష్యాభయం నుంచి 'రక్షణ' కోసమే ఏర్పడ్డ ఈ మండలిలో రష్యాకు స్థానం ఉండదని అట్లాంటిక్‌దేశాలు అనేకం ఎన్నోసార్లు ప్రకటించి ఉన్నవి.) లేకపోతే రెండుకూటాలు ఒకరిపై ఒకరు దాడిచేసేదిలేదని ఒప్పందాలు చేసుకోవాలని బుల్గానిన్ సూచించారు. ఈ విషయమై ఏమీతేలలేదు. ముందు యూరప్ భద్రత, ఆ తరవాత జర్మనీ ఏకీకరణ అని రష్యా వాదించగా, పశ్చిమరాజ్యాలు ముందు జర్మనీ ఏకీ

కరణ అన్నారు. రెండింటినీ కలిపి చర్చించటానికి నిర్ణయ మయింది.

ఇంకా ఆయుధాల తగ్గింపు — తాము ఆస్ట్రియానుంచి ఉపసంహరించే సైనికదళాలను సైన్యంలోనుంచి విడుదల చేస్తున్నామనీ పశ్చిమ రాజ్యాలుకూడా అట్లాగే చేయాలనీ రష్యా ప్రకటించింది. ఆటం ఆయుధాలను పూర్తిగా నిషేధించాలనీ, ముందు వాటి పరీక్షలను నిలిపి వేయాలనీ. ప్రస్తుతానికి అట్లాంటిక్ మండలిని, తూర్పు యూరప్. మండలి సైనిక బలాలను ప్రస్తుత స్థాయినుంచి పెంచకుండా ఉండే తరువాత యూరప్ దేశాల్లో ఉన్న విదేశీ బలాలను ఉపసంహరించాలనీ బుల్గానిన్ ప్రతిపాదించారు. ప్రస్తుత భయాలకు కారణం అకస్మిక దాడి జరుగుతుందన్న భయమేననీ, పరస్పర సైనిక బలాల వివరాలను ఒకరికొకరు ఇచ్చుకుని, విమానాల నుంచి ఫొటోలు తీసుకునేందుకు మొదట అవకాశం ఇచ్చుకుంటే, ఈ సమస్య కొంతదారిన పడుతుందనీ ఐసెన్‌హోవర్ సూచించారు. ఈ సూచనలపై సమితి ఆయుధాల తగ్గింపు సంఘం చర్చజరపాలని నిర్ణయించ బడ్డది. తూర్పు, పశ్చిమరాజ్య సంబంధాలు—వీటిని అభివృద్ధి చేసే విషయమై విదేశాంగ మంత్రులు అక్టోబరులో సమావేశమై చర్చించాలని నిర్ణయించ బడ్డది.

♦ ♦ ♦

ఈ చర్చల సందర్భంలో గమనించతగ్గ 2 వ సూచనను బ్రిటీష్ ప్రధాని చేశారు. తూర్పు పశ్చిరాజ్యాలు అనుకుని ఉండేప్రాంతాల్లో మధ్య ఒక నిస్సైనిక మండలాన్ని ఏర్పాటుచేస్తే, శాంతికిఉపయోగిస్తుందని ఆయనఅన్నారు. ఇది ఇంచు మించుగా రష్యా వాదాన్ని బలపరచటమే ఆస్ట్రియా. యుగోస్లావియాలను తటస్థంగా చేసిన రష్యా. మొత్తం జర్మనీని తటస్థంగా, ఉంచాలని ప్రతిపాదించింది కాని అమెరికా పలుకుబడివల్ల పశ్చిమ రాజ్యాలు దానికి ఒప్పుకోలేక పోయినవి.

♦ ♦ ♦

ఇండోచైనా యుదవిరమణ ఒప్పదం వార్షికోత్సవం నాడు, జులై 20 వ తేదీన, అమెరికన్ అభిమాని అయిన దక్షిణవియత్నాం ప్రధాని న్గోదిన్‌దియాం అనుచరులు సైగాన్‌లో యుద్ధవిరమణ పర్యవేక్షణ సంఘకార్యాలయం మీద దాడిచేసి ఒక ఉద్యోగిని గాయపరిచారు. సంఘ సభ్యుల వస్తువులన్నీ నాశనంచేశారు. పర్యవేక్షణసంఘాన్ని వియత్నాంనుంచి తరిమివేయాలని దక్షిణ వియత్నాం ప్రభుత్వం తీర్మానించుకున్నట్లు భారతప్రభుత్వానికి తెలియవచ్చింది. ఇది కావాలని జరిపిన దౌర్జన్య చర్యలని భారత ప్రతినిధి (సంఘఅధ్యక్షుడు) జెనివా సమావేశానికి తెలియపరిచారు.

ఈ సంఘటనలన్నీ, వియత్నాం అధికారులు ఉత్తర వియత్నాం అధికారులతో సంప్రదింపులు ప్రారంభించవలసిన సమయంలో జరిగినవి. జెనివా ఒప్పదం ప్రకారం 1956 జులైలో ఏకీకరణకు ఎన్నికలు జరగాలి. 55 జులైలో సంప్రదింపులు ప్రారంభం కావాలి. దానిని దక్షిణ వియత్నాం నిరాకరిస్తూ, జెనివా ఒప్పదంమీద తాము సంతకం చేయలేదని వాదిస్తున్నది.

భారత ప్రధాని నెహ్రూ జులై 19 న ఢిల్లీలో విలేఖరులతో మాట్లాడుతూ, ఒప్పందంమీద సంతకం చేయలేక పోయినా, ఫ్రాన్స్ సంతకం చేసిందిగనుక, దానివారసునని చెప్పుకునే దక్షిణ వియత్నాం దానిని పాటించి తీరవలసిందేనని అన్నారు. ఆమర్నాడే ఈ దాడి జరిగింది.

కొరియాలో అమెరికా అభిమాని సింగ్మన్‌రీ చేయటానికి సాహసించలేని పనిని దియాం జరిపించారు. అగ్రనాయక సమావేశం జరుగుతున్న సమయంలో ఇది జరిగిన ఫలితమో, ఏమో, మూడు పశ్చిమ రాజ్యాలూ కలిసి, జెనీవా ఒప్పందాన్ని అమలు జరప వలసిందిగా దక్షిణ వియత్నాంను ఆదేశించినవని తెలుస్తున్నది. కొరియాయుద్ధ ఖైదీ ఒప్పదంవలె వియత్నాం ఏకీకరణ ఒప్పదం భగ్నమవుతుందా లేదా అన్న విషయంలో అమెరికా శాంతి ప్రియత్వం తేలి పోతుంది.

అమెరికా మరొకఇండోచైనా రాజ్యమయిన కాంబోడియాలో కూడా పరిస్థితులను నాశనం చేస్తున్నట్లు సాంఘిక విప్లవం తెచ్చేందుకు రాజపదవి వదలిపెట్టిన నరోత్తంసహనూల్ వర్మన్ జూలై 12 వ తేదీన ఆరోపించారు. అమెరికా చేయదలుస్తున్న సైనిక సహాయం దేశాన్ని చీల్చివేసేదిగానూ, ఇరుగుపొరుగు దేశాలతో వైరం తెచ్చేదిగానూ ఉన్నదని ఆయన ఆరోపించారు.

♦ ♦ ♦

సింగపూర్‌లో ఏర్పడ్డ మొట్టమొదటి ప్రజాప్రతినిధి ప్రభుత్వం ఆరునెలలుకూడా కాకమునుపే రాజీనామా

ఇవ్వటానికి సిద్ధంగా ఉన్నది. నలుగురు జూనియర్ మంత్రులను నియమిస్తానని ముఖ్యమంత్రి మార్షల్ అనగా గవర్నర్ నిరాకరించాడు. మామూలు పాలన వ్యవహారాల్లోకూడా గవర్నర్ అడ్డుతగిలితే, బ్రిటన్ ఏర్పాటుచేసిన రాజ్యాంగం బూటకం అవుతుందనీ, శీఘ్ర స్వపరిపాలనకు అవకాశం కలిగించదనీ అంటూ ఆయన రాజీనామా చేయనిశ్చయించారు. సింగపూరు ప్రజలు వలసవాదాన్ని నిర్మూలించి స్వపరిపాలన సాధించదలుచు కున్నారనిశాసనసభలో ఒకతీర్మానంకూడా ప్రతిపాదించారు.

శాసనసభ్యులుకొందరు ఈచర్చలో బ్రిటనుకు తీవ్ర హెచ్చరికచేశారు. మలయా బ్రిటిష్‌గయానా వంటిది కాదనీ, బ్రిటన్ అక్రమంగా ప్రవర్తిస్తే, కమ్యూనిస్టు మలయా అవతరించక తప్పదనీ వారు అన్నారు.

♦ ♦ ♦

ఇండోనీషియా ప్రధాని అలీ శస్త్రోవామిజయో మంత్రి వర్గం రాజీనామా చేయనిశ్చయించింది. సైన్యం ప్రభుత్వం మాట వినకపోవటమే దీనికి కారణం. శస్త్రోవామిజయో తన దేశాన్ని అమెరికా రక్షణ ఒప్పందాల వలలో పడకుండా కాపాడారు. కొలంబో సమావేశంలోనూకూడా బర్మాప్రధాని నూ తో కలిసి భారత ప్రధాని నెహ్రూ ప్రతిపాదించిన పంచశీలా సూత్రాలను బలపరిచారు. శస్త్రోవామిజయో, నూ కనుక అప్పుడు గట్టిగా నిలవకపోతే ఈనాడు ప్రపంచంలో ఇంత శాంతి ఉండేదికాదని చెప్పటంలో అతిశయోక్తిలేదు.

♦ ♦ ♦

ఇండియాలో నవీన పద్ధతిలో సోషలిజం ఏర్పడవచ్చునన్న అభిప్రాయాన్ని యుగోస్లావ్ కమ్యూనిస్టు పార్టీ పత్రిక బోర్బా జులై 4-వ తేదీన సంపాదకీయంలో వెల్లడించింది. మార్క్సిస్టు సిద్ధాంతాల్లో చెప్పినట్లు విప్లవం వల్ల అధికారంలోకి రాకపోయినా, కాంగ్రెస్ ఆ పద్ధతి సాధిస్తుందేమోనన్న నమ్మకం ఇండియా ఆర్థికాభివృద్ధివల్ల కలుగుతున్నదని ఆ పత్రిక సూచించింది. ఇండియాలో సోషలిజం ఏ రూపం ధరించేది, ఎంత కాలానికి వచ్చేది మాత్రం చెప్పలేనని అన్నది.

అయితే భారతదేశంలో ప్రజాసోషలిస్టులు, కమ్యూనిస్టులవంటి మార్క్సిస్టులు మాత్రం ఈవిధంగా అభిప్రాయపడటంలేదు. కాంగ్రెస్ సోషలిజాన్ని తీసుకుని వస్తుందనే ఆధారం కనిపించటం లేదంటున్నారు. మొదటి ప్రణాళిక నడిచిన పద్ధతి, దేశంలో సమస్యల పట్ల ప్రభుత్వ వైఖరిని పట్టి వీరీవిధంగా చెపుతున్నామంటున్నారు.

♦ ♦ ♦

ఈనెలలో పాకిస్థాన్‌లో మరొక రాష్ట్ర ప్రభుత్వం-సరిహద్దు రాష్ట్ర మంత్రివర్గం రద్దుచేయబడది. పశ్చిమ పాకిస్థాన్‌నంతా ఒకేరాష్ట్రంగా చేయాలన్న ప్రతిపాదనను సరిహద్దు మంత్రివర్గం ప్రతిఘటించటమే దీనికికారణం. ఈ ప్రతిపాదనకు అనుకూలుడు ఒకాయనచేత మంత్రివర్గాన్ని కేంద్ర ప్రభుత్వం ఏర్పాటు చేస్తున్నది. ఈ విషయంమీద అబ్దుల్‌గఫార్‌ఖాన్ ఖాన్‌సాహెబ్‌లకుకూడా అభిప్రాయభేదాలు ఏర్పడ్డవి.

♦ ♦ ♦

భారత ప్రధాని నెహ్రూ జూలై 19 వ తేదీన ఢిల్లీలో గోష్ఠి జరుపుతూ గోవా విషయంలో ఎవరు తలబిరుసుగా ప్రవర్తించినా సహించేది లేదని అన్నారు. బలప్రయోగం ఎంతో సులభమయినా ఇండియా నిగ్రహించుకుని ఉంటున్నదంటే అది శాంతి అభిలాషవల్లనేననీ దానిని ఎవరు అపార్థం చేసుకోరాదనీ హెచ్చరించారు. అది మత సమస్య అనే పోర్చుగల్ వాదాన్ని కాథలిక్ జగద్గురువు పోపే నిరాధారమని నెహ్రూ రోం వెళ్ళిన సందర్భంలో అంగీకరించారు.

కాంగ్రెస్ కార్యవర్గం జూలై 23 న ఒక తీర్మానం చేస్తూ బయటివాళ్ళు భారీఎత్తున గోవాలో ప్రవేశించి సత్యాగ్రహం చేయప్రయత్నించరాదనీ, అదిదౌర్జన్యాలకు దారి తీయవచ్చుననీ హెచ్చరించింది.

♦ ♦ ♦

ఫిబ్రవరిలో ఎన్నుకోబడ్డ ఆంధ్ర శాసనసభ 1959-60 వరకూ రద్దుకాదని ఎన్నికలకమిషనర్ సుకుమార్ సేన్ జూలై 11 న స్పష్టపరిచారు. ఆంధ్ర ప్రభుత్వపు కొత్త బడ్జట్‌లో 366 లక్షలులోటు చూపబడ్డది (2198 లక్షలు ఆదాయం, 2564 లక్షలు ఖర్చు). కొత్తపన్నులు 135 లక్షలు. (ఇనాములపై రైత్వారీశిస్తు నౌకరి ఇనాములు మినహా, నీటితీరువ హెచ్చింపు, 1947 తరవాత లాభపడ్డ భూములపై గాభివృద్ధిపన్ను, బట్టలపై రూపాయికి అణన్నరపన్ను హెచ్చింపు.)

సెప్టెంబర్‌లో ఇనాములన్నిటినీ రద్దుచేసే బిల్లు ప్రతి పాదిస్తారని రెవెన్యూ మంత్రి ప్రకటించారు.

కృష్ణాలోయ ప్రజలు ఎంతకాలంనుంచో ఎదురు చూస్తున్న నందికొండ ప్రాజక్టు పని జూలై 2 న ప్రారంభమయింది. దక్షిణకాలవకు సొరంగాలు తవ్వే పనికి గవర్నర్ త్రివేదీ ప్రారంభోత్సవం చేశారు. నాగార్జున కొండశిధిలాల త్రవ్వడం చురుగ్గా సాగి పోతున్నది.

• • •

విశాలాంధ్ర స్థాపనను గురించి జులై 11 న ఆంధ్ర శాసన సభలో ప్రస్తావనవచ్చింది. దానికి నిజాం రాజ ప్రముఖ్‌గా ఉండకూడదని హెచ్చరించటం అవసరమని సభలో సూచనరాగా, ఆపదవి త్వరలో రద్దయేదికనుక, రాజప్రముఖ్ ఉన్నా ఫరవాలేదని ముఖ్యమంత్రి అన్నారు.

ఫజుల్‌అలీ కమిషన్ ప్రత్యేక తెలంగాణా రాష్ట్రాన్ని ఏర్పాటు చేయవలసిందిగా సిఫార్సు చేస్తుందని తెలుస్తున్నది. 1957 జనవరి ప్రాంతంలో తెలంగాణా శాసనసభకు ఎన్నికలు జరుగుతవనీ, అయితే ఆసభకు విశాలాంధ్రలో చేరాలనుకుంటే చేరే అధికారంకూడా ఇవ్వబడుతుందనీ తెలుస్తున్నది. ప్రస్తుతం తెలంగాణా కాంగ్రెస్‌లో ప్రత్యేక రాష్ట్రవాదులకే బలం ఉన్నది.

విశాలాంధ్ర తేలేవరకూ కర్నూల్ ఆంధ్ర రాజధానిగా ఉండవచ్చునని రంగాగారు ఒక ప్రకటనచేశారు.

★

---




మీ బిడ్డ మామూలుగా
భుజించనిచో

మందంగా వుండి, పొట్ట ఉబ్బివున్నచో, బహుశా కడుపులో బల్ల (లివర్) పెరుగుతుండవచ్చు. యీ లివర్ వ్యాధి సాధారణముగా 3 సంవత్సరాలలోపు పిల్లలకు వచ్చుట సహజము.



జమ్మి వారి

లివర్‌క్యూర్

లివర్ & స్ప్లీన్ వ్యాధుల
చికిత్సకు, నివారణకు.




ఇప్పుడు మాత్రల
రూపంలో లభిస్తున్నది.

జమ్మి వెంకటరమణయ్యా అండ్ సన్స్,
'జమ్మి బిల్డింగ్స్', మైలాపూర్, మద్రాసు.
శాఖ: వోరుగంటివారి వీధి, విజయనగరం సిటీ,
మరియు ఇతర స్థలములలో.





# లోకపు తీరు

శ్రీమతి కె. లక్ష్మీ రఘురామ్

అరెరె! లోకంలో పిచ్చి ఎక్కువౌతోంది ఉన్మాదులసంఖ్య ఆనాటికానాటికి హెచ్చి పోతున్నదట. Statistres చెప్పిన ఉదంతమిది. కారణము నేటి ప్రపంచము లోని హడా విడి తీరేనట !

నేటి లోకపు తీరెట్లా వుంది ? కొంచెము పర్యావలోకనము చేస్తే అంతా హడావుడిగా అయోమయంగా వున్నట్లే వున్నది. పిచ్చివాని మనస్సు, మంచివానిమనస్సు సరిహద్దులు సూది మొనమీద నిలబడ గలదు. కాబట్టి ప్రపంచ ములో ఉన్మాదము పెరిగి పోయినదంటే ఆశ్చ ర్యపడనక్కర లేదు.

ఏమి హడావుడి! ఏం హడావుడి ప్రపంచ మంతటా! కొన్నివారాలనుండి ప్రపంచ వ్యవ హారాలు సమీక్షిస్తే ఈ సంగతి బాగా బోధ పడగలదు.

సమిష్టి ప్రకటనలు ఆరంభమై కొద్దివారా లైనా ఎన్ని సమిష్టి ప్రకటనలు, ఎన్ని సమిష్టి ప్రకటనలు - ఎటువంటివి! బ్రహ్మాస్త్రములవలె పనిచేసినవి! ఏమి కోలాహలము !- స్వరాష్ట్ర విషయాల దగ్గిరనుంచి అంతర్జాతీయ విషయా లన్నీ ఈ కొద్ది వారము రోజులలో సమిష్టి ప్రక టనల ద్వారానే జరిగాయి - సమిష్టి ప్రకటనల మీదనే బాగా ఆధార పడ్డాయి కూడాను. ముందు ఈ సమిష్టి ప్రకటనల వ్యవస్థకు మంచి భవిష్యత్తున్నట్లు తోచు చున్నది.

సమిష్టి ప్రకటనలు చేసినవారుగాని, మరివ్య క్తిగతంగా ప్రత్యేక ప్రకటనలు చేసిన వారు గాని సామాన్య వ్యక్తులు గారు. అందుచేతనే వారి ప్రకటనలకు ఇంత ఆర్భాటము చెయ్య వలసి వస్తూంది. భాషావిషయమై జరుగుచున్న తర్జనభర్జనలు అనవసరము. గవర్నరుజీ చెప్పినట్లు ఆంగ్లము ప్రేమ కలాపములకు నేర్చు కొనవల సియున్నది ఆ భాష లోనే ఆ ఘనకార్యము సున్నితముగా జరుపుకొనే అవకాశములుండి, యుండవచ్చు. తెలుగు అమ్మతో నాన్నతో పిల్లలతో మాట్లాడటానికి నేర్చుకొనవలయును కదా! పోతే మిత్రులతో, ఆఫీసులో 'క్యాజీ' అనటానికి ఇతరరాచకార్యాలకు హిందీ తప్పదు. మరి తద్దినాలు పెట్టటానికి, భారతీయ సంస్కృతి నిలబెట్టటానికిసంస్కృతమూతప్పదని మనమంత్రి సత్తద్వయములు నుడువుచున్నారట. ప్రేమ కలాపములు, తల్లిదండ్రులతో సంభాషణ, రాచ

కార్యములు, భారతీయ సంస్కృతీసంరక్షణ అన్నీ సమానమైన ముఖ్యవిషయములు కాబట్టి కష్టమైనా "దేవుడో"అని నాలుగుభాషలునిర్బంధముగా నేర్చుకొనుట తప్పదు.

గవర్నర్‌జీలు ఈ మధ్య చాలా ముఖ్య విషయాలను గురించి చిత్ర విచిత్రములుగా సెలవిస్తూ వున్నారు. కొన్ని మంచి సరససల్లాప ఫక్కీలో జరిగినవి కూడాను! కేవలము రాష్ట్ర పరిపాలన, భాషా విషయములేగాక వారు వన్య మృగసంరక్షణయందు చాలా శ్రద్ధతీసుకొంటూ వున్నారు. వనమహోత్సవాల తరువాత వన్య మృగ సంరక్షణోత్సవాలు జరగడము సమంజసమే. కాని ఈ కారణముగా వన్య మృగము లైన వానరులపై మనకు సహజముగా, మన సంస్కృతి అనుగుణ్యంగా కలిగే వాత్సల్యము వల్ల వానరదండు ఎక్కువగా పెంపొందే లక్షణా లున్నట్లు గోచరమగుచున్నవి

కాని దీని కొరకై మనము భయపడవలసిన పనిలేదు. అంతగా వానరదండు వృద్ధి చెందితే



అంగారక గ్రహములో మానవ ప్రవేశమునకు నాందిగా వానర ప్రవేశము చేయించవచ్చు- మొన్ననే అంగారక గ్రహములో కూడా మన భూమిమీద వలెనే వృక్షజాతి వున్నదని శాస్త్రవేత్తలు తెలిపినది పాఠకులు గమనించే వుంటారు.

అణ్వస్త్రములవల్ల, అణువుల రేడియేషనుకూ అవిటి సంతానము కలుగగలదని ప్రపంచ వల్లచాలా ఖంగారుపడుతోంది. అందుకే తల్లులు ముందుకలిసి అంతర్జాతీయ తల్లులసభ మొన్న ఐరోపాలో లూసేన్ నగరములో ఏర్పాటు చేసుకొని "ఈ అణువు లొద్దో" అని మొరబెట్టుకొన్నారట. దీనజన రక్షకులు మరి మొరలాల. కించి అభయమిస్తారో లేదో?

అయినా ఫరవాలేదు. సంతానము కలిగితే కదా అవిటి సంతానము విషయమై బాధపడవలసినది. అందుకే భారత ప్రభుత్వము వారు శ్రద్ధ తీసుకొని సంతాన నిరోధ విషయము చాలా ప్రచారము చేయుచున్నారు. ప్రభుత్వ వైద్యశాలలో నున్న శ్రీమతు లందరు పరిపాలనా ఉద్యోగము లందు నియమితులై యుండగా "కుమారీ" లనందరిని సంతాన నిరోధ క్లినిక్కులకు నియమించుట హర్షణీయము. మన ప్రభుత్వములవారు "కుమారీ"ల నియామకములో ఎంత దూరదృష్టి ప్రదర్శించారో గమనార్హము.

ఇదంతా చదివిన తర్వాత, చదివిన మీరు వ్రాసిన నేను మనము ఉన్మత్తులము కాదుకదా! అను అనుమానము తోచక మానదు!

భయపడకండి. ఇదంతా మనలోమనమాటే!

## రచయితలకు మనవి

* మాకు కథలు, గేయాలు పంపేవారు ఈ క్రింది అంశాలను గమనించ ప్రార్థన.

* ప్రచురించని రచనలను త్రిప్పి పంపగోరే వారు బుక్ పోస్టుకు అవసరమైనస్టాంపు, అణాస్టాంపుకు తక్కువ కాకుండా పంపాలి.

* రచనలు కాగితానికి ఒకే వైపు సిరాతో వ్రాసి పంపాలి.

* రచనలు మాకుచేరిన విషయాన్ని తెలియపర్చలేము.

* సమీక్షకు గ్రంథాలు పంపేవారు రెండు ప్రతులు పంప వలసినదని మనవి.



అతని ఆనందానికై ఒక సీసాను అందుబాటుగా ఉంచండి!

కడుపులో బాధలేవీ లేనందు వల్లనే బిడ్డ ఆనందిస్తున్నాడు. బిడ్డ ఆనందమే తల్లికి కూడా ఆనందం.






గ్రైప్ సిరప్

ఉత్పత్తిదారులు :

దిమైసూర్ ఇండస్ట్రియల్ & టెస్టింగ్ లాబరేటరీ లిమిటెడ్; మల్లేశ్వరం, బెంగుళూరు.

సేల్సు డిపార్టుమెంటు :

35/37 తంబుచెట్టిస్ట్రీటు మద్రాసు 1.

BZ—37.

# లీలావతి

శ్రీమతి యం. ఆదిలక్ష్మి

గణితశాస్త్రజ్ఞుఁడనెడి ప్రఖ్యాతిఁగాంచి
జ్యౌతిషమునందు మిగులప్రజ్ఞనుగడించి
యలరె నుజ్జేని బదియునొండవ శతాబ్ది
భాస్కరాచార్యవర్యుండు భవ్యయశుఁడు.

లీలావతి యనుపేరిటి
బాలామణి యతని తనయ; భాస్కరసుధియున్
నాలేమ కన్నివిద్యల
మేలిమి తెలుఁగెల్లఁజెప్పి మించఁగఁజేసెన్.

ముకుళితమై సహస్రదళముల్ గల పద్మము, భాస్కరుండు ము
ద్వికసనఁసేయుచుండు తన వేయికరంబుల; నట్టిలెక్కలన్
బ్రకృతిని జూపి భాస్కరుఁడు పాఠమునేర్పెను ప్రత్యుషస్సునన్
బ్రకటితలీల లీలకు, నవంబుగ బుద్ధివికాసమందగన్.

చదువునందెకాదు చక్కఁదనంబున
సద్గుణములయందు సకలకళల
నారితేరి యామె యామోదమునుగూర్చె
జనకునకును నాప్తజనములకును

ఎన్నియున్నను నామెకదేమొకాని
యైదువతనంబు గొఱఁతయౌ నంచుఁదెలిసె
తండ్రి జ్యౌతిష్కుఁడైనను తన్వినొసట
ధాత వ్రాసినవ్రాతలు తప్పఁదరమె.

తనయ జాతకఫలము వృధాయొనర్ప
బహుదినంబులు యోజించి భాస్కరుండు
పూర్ణమగు నాయువునుఁగల పురుషవరుని
మంచి సుముహూర్తమును నిశ్చయించె నంత.

# లీలావతి

గడియారయంత్రంబుఁ గల్పించిరొకచోట సుముహూర్తకాలంబు చొప్పుఁదెలుప
కళ్యాణకూటంబుఁగైసేసి రొకవంక రంగవల్లీముక్త రాజితముగ
వాకిళ్ళతోరణవ్రాతంబు, గుమ్మాల బసుపును గుంకుమం బసలుకొలుప
బ్రధితరంభాస్తంభ బహుదీపికారాజి గృహమునంతయు వెలిగింపుచుండ

బ్రాహ్మణానేకములతోడ బంధుమిత్ర
స్నేహబృందంబుతోడ, వర్షీయులైన
నమలపుణ్యాంగనా నివహంబుతోడఁ
బెండ్లికళదాల్చె భాస్కరుపేదగృహము.

మెఱుఁగుం బంగరుమేని కాంతికనువౌ మేల్చీరయున్, చంద్రున
క్కుఱవారింపగలట్టి నెమ్మొగమునన్ కళ్యాణపుంబొట్టు చ
క్కఁరహింపన్ పసపుంహొరంగు మధుపర్కం బొప్పగాపెండ్లికూ
తురులీలావతి యొప్పె బంధువులు సంతోషాబ్ధి నుప్పొంగఁగన్.

తెరనుఘటియించిరా వధూవరులనడుమ
నపుడ వైవాహికక్రమం బాచరింప
వారలిరువురనా తెరవైపులందు
కూరుచుండంగఁజేసిరి కూర్మిమీఱ.

తనభావిజీవితంబును
మునునెఱిఁగినకతన వరునిమోమును జూడన్
గనునుత్సుకతో నామెయు
ననువుగతెరవైపు జరిగి యాతనిజూచెన్.

అందఱును బెండ్లిసందడియందునుండ
కానలేరైరి యెవ్వరీఘటనయపుడు
వరుఁడుచూచెనొ లేదొ యావధువునామె
కన్నులారంగ నాతని గాంచితనిసె

అట్టిసమయాన నామె సీమంతమునను
జాలుగానున్న ముత్యాల చాలులోని
ముత్యమొక్కటి విడివడి ముందుప్రక్క
ఘటికలోఁబడి కుడుకమార్గమునుమూసె

లీ లా వ తి

కుడుకరంధ్రానికడ్డు లేకుండెనేని
నీటను మునింగి కాలంబు నియతిఁదెలుపు
దానికేమైన యడ్డంబుఁదగిలెనేని
నీటమునుఁగదు; కాలంబు పాటిదప్పు.

సమయజ్ఞుండగు పెండ్లిబ్రహ్మయు మహాసంకల్పముం జెప్పగా
సుముహూర్తం బెపుడౌనొయంచు తనదృష్టుల్ నిల్పి, నిల్చుండెయం
త్రముప్రక్కన్ జనకుండు; నెంతకు ముహూర్తప్రాప్త కాలావధిం
క్రమమున్ దప్పుటచేతఁదెల్పకయ యుండన్ భాస్కరుండంతటన్.

ఏది యెట్లైనగానిమ్ము దెద్దియేని
యొకముహూర్తాన బెండ్లి సేయుటకునిశ్చ
యించి బ్రహ్మకుఁదెల్పనట్లే యతండుఁ
బెండ్లితంతును బూర్తిగావించెనంత.

పెండ్లిజరిగిన యట్టిమూఁడేండ్ల తటిని
ధవుఁడు గతియించుకతన వైధవ్యమబ్బె
జ్యోతిషజ్ఞత, జాతకచక్రపటిమ
యొక్క సుముహూర్త బలిమికి నొగ్గెతలలు.

"ముకుపచ్చలాఱని ముద్దియకా యిట్టి దుర్భరంబైనట్టి దుఃఖపాటు
యేపాపమెఱుఁగని యిటువంటి యింతికా కడచూడరాని యీకష్టపాటు
అందాలబరిణెకా యెందుఁబొందఁగరాని భావికాలమునాటి భంగపాటు
సుగుణాలరాశియౌ సుదతికా నలువురి నోటిలోబడియెడు నోటిపాటు"

అనుచు గుమిగూడికొనుచు తారాడుచుండ్రు
అమ్మలక్కలు నీవివాహమునుగూర్చి
విద్యవాసన లేనట్టి వెలఁదులకును
నట్టి తలఁపులు గలుగుటకేమి యరిది.

భావిజీవిత మెట్లైనఁబరగుఁగాక
ఎన్నికష్టములేన్ ఘటియించుఁగాక

# లీలావతి

ప్రస్తుతస్థితిఁదలఁచుచు వరటునొంది
యించుకంతయైనను చలియించదామె.

చేతలెల్లను జనకుని సేవయందె
పలుకులెల్లను విజ్ఞానకలనయందె
మనస దెల్లను జ్ఞాన సన్మార్గమందె
దృష్టి కేంద్రీకరించె నాధీరవనిత.

జనకునొద్దనె గణితశాస్త్రంబుమొదట
నేర్చెగావున దానియందే నిమగ్న
యౌచు స్వయముగ గనిపెట్టినట్టివెల్ల
చర్చసేయును విజ్ఞానసరణి మెఱయ.

తనశాస్త్ర జ్ఞానంబును
తనయనుభవమెల్ల భువనతలమున వెలుఁగన్
ఘనగణిత శాస్త్రవారిధి
కిని సేతువునాగ నొక్కకృతి నిర్మింపన్

పూనియున్నట్టి జనకునే ప్రొద్దువిడక
రేవగలునొక్కరీతి లీలావతియును
నతనిచేదోడు వాదోడునగుచు కృతియు
సొంతమగునట్లుగాఁజేసి సాయపడియె.

తన తనయయు కృతితనయయు
ననువుగ నొకరూపమగుట నాతండు ముదం
బెనయఁగఁగూఁతును కృతిమూ
ర్తిని "లీలావతి"గఁజేసె ధిషణులు మెచ్చన్

గణిత శాస్త్రమనెడు గగనతలంబున
నాఁడు నేఁడుగూడ నవకమగుచు
రిక్కవూలె వెలుగు లీలావతీకన్య
సకల సుగుణధన్య సర్వమాన్య.

---

సుప్రసిద్ధ ధర్మపత్నులు :

# ఎలెనార్ రూజ్‌వెల్టు

శ్రీమతి కె. రామలక్ష్మి

అమెరికా ప్రెసిడెంటంతటి ప్రాముఖ్యాన్ని సంపాదింపకల్గిన "అమెరికా తొలిమహిళ"లలో ఎలినార్ రూజ్‌వెల్టు అని ముందు చెప్పుకోవాలి. గంభీరంగా వుంటూ, సూటిగా ఆమె చేసుకుపోయిన పనులలో అమెరికా అంతరాత్మ ప్రతిబింబిస్తుందంటే అతిశయోక్తి కాదు. ఆమె ఘనత ప్రతిబింబితమైన ఘనతకాదు. నిజానికి చూస్తే ప్రస్ఫుటంగా కన్పించేది ఆమె శీలం, సౌశీల్యం- భార్యాభర్తల టీము-చక్కనిది; సుహృద్భావంతో కలిసి పని చేయ కల్గినటు వంటిది. అమెరికాలో ఏ ప్రక్కనైతే ప్రపంచ భవిష్యత్తుని గురించి ఆశా, ఉత్సాహం వుంటాయో ఆ ప్రక్కనుంచే వస్తుంది ఎలినార్. ఆరోజులలో అమెరికా తొలిఘట్టాలలోనే వుందనవచ్చు. అభ్యుదయం సాధించాలనేఅమితోత్సాహం, ప్రాచీనం అంటే ఏమిటో తెలియకుండానే అద్భుత ఆరాధనాదృష్టి, ఏం చేద్దామన్నదీ పూర్తిగా దృక్పథానికి ఆనని పరిస్థితులూ-ఆనాటి అమెరికా. ప్రాచీనసాంప్రదాయాలు, చరిత్ర పారాలు", అభ్యుదయ పనిథాకి అడ్డుకాకుండా వున్నా, అవిలేక పోవడం కొన్ని సమయాలలో లోటుగానే వుంటాయి అందుకే పాతను గ్రహించి క్రొత్తను సృష్టించి రెండిటిలోని లోపాలనూ తగ్గించిముందుకుపోవలసిన పరిస్థితులు ఏర్పడుతాయి యువకలోకంలో వికాసమూ, ఏదో సాధించాలనే ఉత్సాహమూ పెల్లుబుకుతున్నాయి; ఈ కోరికల సఫలతకి అనువైన మార్గంగా తనకు తానై రూపొందింది - అప్పటి ప్రెసిడెంటుభార్య అయిన ఎలెనార్. ఆమె వివిధ పని పాటలను ఒక్కసారి చూచినట్లయితే- తెలిసే విషయం: భర్త చేతలకు సంపూర్ణత నిచ్చేవే ఆమె నిర్వహించింది. ఏ పరిస్థితిలోనూ ఒకరికొకరు అడ్డు తగలక పోయినా, ఎంతో సహాకరించ వలసి వచ్చేది. అదే జరిగేది కూడ. భార్యాభర్తలు పనిచేసిన రంగాలు విభిన్నమైనవి. అయినా యిద్దరిదీ ఒకటే ఆశయం. ఎలెనార్ అనేకవిధాల కష్టపడేది; తన భర్త రాజ్యమేలిన కాలం ఘనతవహించాలని తనభర్త ప్రెసిడెంటుగానున్న కాలంలో వైట్ హౌస్‌వన్నె కెక్కాలని. ఈ విషయంలో కూడ భార్యాభర్తలమధ్యఅద్భుతమైన సహృదయత వుండడంవల్ల వారుచేసిన ప్రతి పనీ రాణించింది. ఒకరు తక్కువ ఒకరు ఎక్కువ అనే ఆలోచన లేకుండ అందరి మంచికోసం ఇద్దరూ పాటు పడటమే పరమావధిగా నమ్మేరు. అందుకే వారి దిగ్విజయం ప్రజానీకపు ఉత్సాహంతోటే, వస్తువైభోగాలతోటి మనం కొలవలేం. అతికష్టపడి సంపాదించినదే. ఈవిషయంలో అద్భుతమైన పార్ట్నరుగా రాణించింది ఎలెనార్ రూజ్‌వెల్టు.



థియొడోర్ రూజ్‌వెల్టు మేనకోడలు కావడంవల్ల ప్రెసిడెంటు జీవితం ఎలీనార్‌కి కొత్త కాదు. కాని "వైట్ హౌస్"కి అధినేతనవుతానని ఎలెనార్ ఎప్పుడూ తలపోయనైనా తలపోయలేదు.

# ఎలెనార్ రూజ్‌వెల్టు

ఐశ్వర్య వంతుల ఆడపిల్లగా పుట్టిన ఎలెనార్ చాలా మటుకు చదువు సంధ్యలు యింగ్లండులో కానిచ్చినది తన యిరవయోఏట 'సొసైటీ'లో ప్రవేశించినప్పుడునూయ్యార్కు సొసైటీ జీవితపు రంగునీ, అలవాట్లనీ ఏమాత్రం తీసి పోలేదు. ఈ సొసైటీ జీవితం ఒక్క ఏడాదిలోనే ముగిసింది ఆమె వివాహంతో. కాని, యీ ఒక్క సంవత్సరపు అనుభవమూ ఆమెలో 'నవనాగరిక' జీవితంపట్ల ఓవిధమైన ఏహ్యాభావాన్ని నాటింది. దీనికి ముఖ్యకారణం. ఎలినార్‌కి జీవితాన్ని సీరియస్‌గా తీసుకోవడం యిష్టంకావడమే. పార్టీలంటే ప్రాణంయిచ్చే యౌవనిలా, ఏరోజు కారోజు వింతకొల్పే సంతోషాలతో గడిపేసే యువతిలా వుండలేక పోయేది. స్వతహాగా అందకత్తె కాదు ఎలెనార్; అందుకే కష్టపడి తన సౌందర్యాన్ని పెంపొంద చేసుకొనే కంటే, ఆ శక్తిని జీవితంలో అసలైన విలువనిచ్చే వాటి సంపాదన కోసం వినియోగించడం మంచిదని నిర్ణయించుకొంది. ఎప్పుడేనా, ఏకాంతంలో తనసౌందర్యలేమినిగూర్చి వాపోయినా త్వరలోనే ఆమె గ్రహించింది. అసలు సౌందర్యం అన్నది అంతర్గతం-శరీరం అందంగా వున్నంత మాత్రాన ఏంలాభం? స్త్రీ పురుషులలో కావలసినది ఆత్మసౌందర్యం అనీ, ప్రతి వ్యక్తి మానవకోటికి ఎంతో ఋణపడి వుంటాడని గ్రహించి ఆ ఋణాన్ని తగ్గించడమే పరమావధిగ తీసుకొని ఆపథాన్నే ఎంచుకొంది.

ప్రతి విషయంలోకూడా సామాన్యమైనది కాక పోవడం వల్ల రూజ్‌వెల్టు ప్రెసిడెంటు కాగానే అన్ని దిశలనుండీ విమర్శలు కురిశాయి - యీమెను గురించి ఆమె ఎందుకు అతిథిసత్కారాలు చేస్తూ వూరుకోలేదు? ఎందుకు ప్రెసిడెంటు పనిపాటలలో జోక్యం కలుగచేసుకోవాలి? అన్నవే ప్రజల ఆలోచనలు. ఎందుకలా ఆమె ప్రవర్తించాలో ప్రజలకి తెలియలేదు. కొంచెంలో చెప్పాలంటే, వారి ఉద్దేశ్యం - స్త్రీ అసలుస్థానం యింట్లోననీ, ప్రతి విషయంలోనూ యిల్లాలు జోక్యం కలుగచేసుకోరాదనీ. సంఘ సంప్రదాయ సిద్ధమైన పనిపాటలు చూసుకుంటూ వూరుకోవడం అంటే యిష్టం లేకపోవడంవల్లా, అతి సున్నితమైన తత్త్వంవల్లా, ఎలెనార్, పనిలో తన మానసిక ఆందోళనలనీ, ఆఘాతాలనీ, మరిచిపో ప్రయత్నాలు సాగించింది. తనదాకా వచ్చిన ప్రతిదాన్నీ ఎంతో ఉత్సాహంతో స్వీకరించి, శక్తివంచన లేకుండా ఆపని విజయవంతంగా కొనసాగించే తాపత్రయం పడేది. ప్రెసిడెంటు భార్యగ తనకు కలిగిన అవకాశాలను ప్రజోపయోగంకోసం వినియోగించేది. అదే నిజమైన ప్రజాస్వామికవాది లక్షణం అని ఆమె నమ్మకం.

అయినాకూడా, ప్రజలు ఏదోవిధంగా ఆమెకి వ్యతిరేకంగా ఏదో ఒకటి చెప్తూనే వుండేవారు. రేడియోలో మాట్లాడితే: తనకున్న ప్రముఖస్థాన బలిమిని పబ్లిసిటీకోసం వినియోగిస్తూందనేవారు కాని ఎవరూ తెలిసికొనీవుండరు, తెలిసినా ఒప్పుకోనూ ఒప్పుకోరు: 1933 లో ప్రప్రథమంగా రేడియో కాంట్రాక్టు అంగీకరిస్తూ విమెన్స ట్రేడ్ యూనియన్ డైరెక్టరుకు, ఆ యూనియను కార్యకలాపాలకు సహాయంగా, 300 డాలర్లు యిస్తానని వాగ్దానం చేసింది - ఎలెనార్ కార్యక్రమాలలో పాల్గొనడం ప్రెసిడెంటు భార్యకి తగదని: యునైటెడ్ స్టేట్సులో ఆమె మొదటి మహిళకదా యింకేం కావాలని వారి ఊహ. కాని ఎలెనార్ చెప్పేది: తాను ఉత్తి మిసెస్ 'రూజ్‌వెల్టు'నే అనీ, మొదటి మహిళగా ఘనతగాంచాలనే కుతూహలం తనకి లేదనీ; తన భర్త అతని స్వీయఘనతవలననే ప్రెసిడెంటు అయాడు; దానికెప్పుడూ ఆమె గర్విస్తుంది; కాని, ఆమె ఎప్పుడూ అతని భార్యగా తనపని తాను నిర్వహిస్తూ పోవాలనే కోరేది. అంతేకాని ఆమె ఎప్పుడూ ఏవిషయంలోనూ భర్త శాసించ వలసిన రంగంలో తాను స్థలం ఆక్రమింప దలచుకోలేదని తెలియ చెప్పింది. తానొక 'ప్రదర్శనవస్తువు'గా వుండననీ, తనడ్యూటీ ప్రజల మధ్యనే వుందనీ ఆమెనమ్మింది.

తానెప్పుడూ విమర్శన కతీతురాలినని ఏలెనార్ తలపోయలేదు. బిడియపడకుండా తన లోపాలని తన స్నేహితులతో చర్చించేది. వాటిని వీలున్నంత వరకు సరిదిద్దుకో ప్రయత్నించేది. ఇలా లోపాలను గెలవాలనే కాంక్ష ఆమెలో చిన్ననాటి నుంచీ పెరిగి పెద్దదయినదే. చిన్నతనంలో ఆమెకి ధైర్యం అనేదే వుండేదికాదు; తరువాత జీవితంలో కష్టపడి అలవరచుకున్నవే ఆమె ధైర్యసాహసాలు; చిన్నతనంలో భయంచేత, మాట్లాడపోతే-కీచుగొంతు వచ్చేది; కాని యీనాడో, కష్టపడి ధైర్యాన్నీ సాహ

సాన్నీ అలవరచుకొన్న ఫలితంగా ... ఆగొంతుక ఛాయ లేశా కన్పించవు. తన ఎనలేని శ్రమా ఫలితంగా అమెరికన్ ప్రజలని తనవైపునకు తిప్పుకోకల్గింది మిసెస్ రూజ్‌వెల్టు. అంతేకాదు అమెరికా ప్రెసిడెంటు భార్య ఎలా వుండాలన్న దానికి రూపంగా నిల్చింది ఎలెనార్ వారి హృదయాలలో.

చిన్నతనంలోనే నిరాశ్రయ కావడంవల్ల ఒక విధమైన మొండి పట్టుదల ఆమె లక్షణం అయింది. తన చిన్న సోదరుణ్ణి పోషించి పెద్దవాడిని చెయ్యడంలో యీ లక్షణం విశదంఅవుతుంది. ధనార్జన బాగా సాగుతూన్న ప్లీడరీవృత్తికి స్వస్తి చెప్పి రూజ్‌వెల్టు రాజకీయాలని చేపట్టడంలో ఆర్థికంగా ఆటంకాలు కలిగాయి. ఏమాత్రం వెనుకంజ వేయకుండా ఎలెనార్, ఆడపిల్లల స్కూలైన టాడ్‌హంటర్ ప్రైవేట్ స్కూల్లో యింగ్లీషు నేర్పడానికి ఒప్పుకుంది. తరువాత కాలంలో యీ స్కూలు యజమానులలో ఒకరయింది ఎలెనార్. ఆస్కూల్లో 1927 మొదలు 1932 వరకు హిస్టరీ, సివిక్సు, గవర్నమెంటు, కరెంటు యీవెంట్సు - క్లాసులు వారానికి మూడురోజులు తీస్తూండేది. రూరల్ పరిశ్రమలు తిరిగీ అభివృద్ధి కాంచడానికీ, పాతకాలపు అమెరికన్ వస్తువులు తిరిగీ తయారుచేసే వుత్సాహం పుట్టించడానికీ మిసెస్ రూజ్‌వెల్టు యింకో యిద్దరు మహిళల సహాయంతో న్యూయార్కులోని హైడ్‌పార్కులో ఒక షాపును ప్రారంభించింది.

మిసెస్ రూజ్‌వెల్టుకి వున్న అనేక సరదాలలో జర్నలిజం ఒకటి. ఈమె 'మైడే' అనే కాలం వ్రాస్తుండేది. యీ కాలం దరిదాపు 48 పేపర్లవారు ప్రచురించేవారు. "Babies Just Babies" అనే పత్రికకు సంపాదకత్వం వహించేది. మిస్టర్ రూజ్‌వెల్టు ప్రెసిడెంటుఅయాక వైట్ హౌస్‌లో తనకి పనిపాటలు ఎక్కువయినా, ఏ యితర వ్యాపకాలకైనా స్వస్తి చెప్పకల్గింది కాని, ఎలెనార్, యీ పత్రిక సంపాదకత్వం మాత్రం మానుకోలేదు.

ఒకపని తలపెడితే, దాని నిజాయితీలో నమ్మకంవుంటే, ప్రతి కక్షుల విమర్శలకి అసలు లెక్కచేసేది కాదు. అంత మాత్రంచేత విమర్శకులను నిర్లక్ష్యం చేసేదని అనుకోనక్కర లేదు. సాధ్యమైనంతవరకూ తన నడవడికతో వారిని సరిదిద్ది చూచేది. ఇటువంటి సందర్భాలలో మరపురానిది నీగ్రో పాటకత్తె మారియన్ ఏండర్‌సన్ గురించినది. ఆమె గాత్రానికి ముగ్ధులై యూరోపంతా ఆమెని ఆహ్వానించి ఆదరించింది. కాని 'రంగు' భేదంవల్ల పుట్టిపెరిగిన అమెరికాలో ఆమెకొక్క అవకాశంకూడా యివ్వలేదు ఎవరూ. చివరికి డాటర్స్ ఆఫ్‌ది అమెరికన్ రిపబ్లిక్ వారి కాన్‌స్టిట్యూషన్ హాల్‌లో పాట పెట్టడానికి కూడా నిరాకరించారు. మిసెస్ రూజ్‌వెల్టు యీ సంస్థ స్థాపకులలో ఒకతె. కాని వీరివైఖరికి అసహ్యించుకొని ఆమె తన సభ్యత్వానికి రాజీనామా యిచ్చింది. అంతేకాదు, కాన్‌స్టిట్యూషన్ హాలు నీడనే బహిరంగంగా పాటకచేరి జరిగే ఏర్పాట్లు గావించింది. అబ్రహాంలింకన్ పాలరాతి విగ్రహపు నీడను నిలచి మారియన్ ఏండర్‌సన్ "My country 'tis of Thee' అని తన అత్యద్భుత గాత్రంతో పాడుతూంటే, నీరు నిండిన కళ్ళతో అమెరికనులూ, నీగ్రోలు మైమరచివింటున్నప్పుడు మిసెస్ రూజ్‌వెల్టు పడ్డకష్టానికి తగిన ప్రతిఫలమే దక్కిందనుకొందుకు అనుమానం ఎందుకు ?

యువతిలోని అవకాశాలలోనూ, శక్తిలోనూ ఎలెనార్ రూజ్‌వెల్టుకి ఎనలేని నమ్మకం, ఏదేశమైనాసరే, ఆదేశపు యువలోకాన్ని అలక్ష్యం చేయకూడదనీ, దేశాల అనేక కష్టనష్టాలకి మూలకారణం వీరిని అలక్ష్యం చేయడమేననీ ఆమె నమ్మకం. నిరుద్యోగులైన యువతుల పట్ల యీమె సానుభూతి అపారం; ప్రపంచపు పోకడే, యువతిమీద ఆధారపడి వుంటుంది: ఈ యువతి అందోళనా, నిస్సహాయతా, నియంతృత్వ శక్తులవైపు మొగ్గుతాయో, లేక నిజమైన పౌరులుగా రూపొంది తమకి తాము సహాయం చేసుకొంటూ నీరసులైన యితరులకి సహాయంచేసే అపురూప శక్తులుగా తయారవుతారో అన్నది. నిరుద్యోగ సమస్య పూర్తిగా ఆర్థిక సమస్యాగాదు, ఆర్థిక సహాయం వల్లనే దీన్ని పూర్తిగా రూపుమాపలేం అని మిసెస్ రూజ్‌వెల్టు నమ్మకం. దాని తల్లివేరు అసలు పెంపకంలోనే వుందంటుంది యీమె. అందుకే వారిపట్ల యీమె ప్రణాళికలన్నీ; నిరుద్యోగులుతమకితామే సహాయం చేసుకునేవిధం గావుంటాయి.

దేశపు సాంఘికజీవితంలో రాజకీయాల ప్రతిపత్తి ఎంత వరకో అంతవరకే రాజకీయాలతో సంబంధం కల్గిన ఎలె

# ఎలెనార్ రూజ్‌వెల్టు

నార్ రూజ్‌వెల్టు ముఖ్యంగా, మానవశాస్త్రమూ సాంఘికశాస్త్రమూ అంటేనే ఎక్కువ ఆసక్తి చూపేది. విభిన్న ప్రకృతుల సమ్మేళనం ఆమెలో వుండేది. కమ్యూనిస్టు, కాదు సరికదా ఓ సోషలిస్టైనా కాకుండా ఆమె కార్మికుల మధ్య తిరిగేది; వారికష్టాలని అర్థంచేసుకో ప్రయత్నిస్తూ ఆందోళనవల్ల ప్రజలలో వారిపట్ల సానుభూతి కల్గిస్తూ వుండేది. తరతమ భేదాలు లేవనుకునే అమెరికాలోనే, 'భాగ్యవంతు'లనబడే వారిలో పుట్టి పెరిగిన ఎలెనార్, వ్యాపార విషయాలలో వ్యక్తి ఆస్థి వుండవచ్చునన్నది. ఆస్థి సృష్టించినవారే, ఆస్థికి వారసులన్న విషయాన్ని ఆమె నమ్మలేకపోయేది అయినాకూడా, తక్కువ జీతం, ఎక్కువపనీ, మొదలైన వాటిని ప్రతిఘటించి పనిపాటలు చేసుకునేవారి జీవన భృతి ప్రమాణాన్ని పెంచాలని పాటుపడేది. ఆర్థిక భేదాలు తొలగిపోవాలంటే, పనివాళ్ళకీ, యజమానులకీ మధ్య సుహృద్భావం వుండాలనీ, అదొక్కటే మార్గం అనీ నమ్మేది.

నిరాడంబరత ఎలెనార్ వ్యక్తిత్వంలో ప్రథమ లక్షణం. దానివల్లనే ఆమె అమెరికనులకి అతి సన్నిహితంగా పోకల్గింది. జర్నలిస్టుల రంగంలో ఆమెకు స్నేహితులకి కొదవ లేదు. వైట్‌హౌస్‌కి వచ్చే అనేక రాయబారులలో, అందరూ అడిగేవారు; ప్రెసిడెంటుకి వీలులేకుంటే, మిసెస్ రూజ్‌వెల్టుకి అవకాశం వుంటుందా? అని. ఒక సందర్భంలో ప్రెసిడెంటు రూజ్‌వెల్టు పాలసీలని తీవ్రంగా ప్రతిఘటించే ఒకామె "ప్రెసిడెంటునీ, ఆయనపాలసీలనీ నేను నమ్మను. కాని మిసెస్ రూజ్‌వెల్టు చెప్పినసంగతి నిజమే." అందిట ఏ వ్యక్తికేనా యింతకంటే ఘనతనిచ్చే మాటలుంటాయా?

హిందూఆదర్శమైన గృహలక్ష్మి లక్షణాలంటామే అటువంటివన్నీ మిసెస్ రూజ్‌వెల్టులో మూర్తీభవించివున్నాయి. ఇంగ్లాండు రాజూ, రాణీ స్టేట్సు చూడవస్తారనే ముందు, వైట్‌హౌస్‌లో కావలసినవన్నీ చూస్తూ, రాబోయే అతిథులకు సరైన ఆహ్వానం యివ్వకలనా లేదా అని చూసుకొంది. తనఐదుగురు పిల్లలూ పెద్దవారయినారు కాబట్టి - యింకో ముగ్గురికి పెంపుడుతల్లి ఐంది: ముగ్గురూ యుద్ధంవల్ల నిరాధాగులయినవారే. వీరి ముగ్గురి ఫోటోలు యీమె దగ్గర వుంటాయి. ఎప్పుడూ వారి కష్టసుఖాలని కనుక్కుంటూనే వుంటుంది ఎలెనార్. ఆదరణ పూరితములయిన అనేక కార్యక్రమాలలో యిది ఒకటి మాత్రమే.

యుద్ధాశ్వాలు దౌడుతీస్తూ క్రొత్తప్రాంతాల నాక్రమించి పనిలో మునిగివుంటే, శక్తిహీనులై ఆడవాళ్లు తమప్రియతములని 'రక్షించుకోలేని నిస్సహాయత ప్రదర్శిస్తూ వుంటే, అమెరికావైపు ఎలెనార్ రూజ్‌వెల్టు వైపు వూహాలు మళ్ళిస్తే మనస్సుకి హాయిగావుంటుంది; ఎటువంటి పరిస్థితులలోను కలతను ప్రదర్శించని ఎలెనార్ రూజ్‌వెల్టు ముఖము ప్రెసిడెంట్ ప్రక్కని కనపడినంతసేపూ, ఆరోజులలో, అమెరికా నూతన ప్రపంచానికి ద్వారాలు తెరుస్తుంది అనిపించేది. కష్టాలలో మగ్గిపోతూన్న ఆడవాళ్ళు ఆమెని సహాయంకోసం అర్థిస్తే అదెప్పుడూ వమ్ముకాలేదు: కారణం ఎలెనార్ రూజ్‌వెల్టులో తరగని అవకాశాలున్నాయి. దేనికోసం? ఆదరణకోసం వ్యధితహృదయాలని అర్థం చేసుకోడం కోసం.



తరిగొండ వేంగమాంబ

# పారిజాతాపహరణము

యస్వీ జోగారావు

తరిగొండ వేంగమాంబ సుప్రసిద్ధాంధ్ర కవయిత్రి. ఉత్తమ విదుషి. కడపమండలము నందలి తరిగొండ గ్రామమీమె నివాసము. ఈమె కాలము క్రీ. శ. 1840 ప్రాంతము. (చూ. శ్రీ కందుకూరివీరేశలింగంగారి కవుల చరిత్ర) తరిగొండ నరసింహస్వామియు, శేషాచల స్వామియు నీమె కిష్టదైవతములు. ఈమె తండ్రి నంద వరీక బ్రాహ్మణుడు. వాసిష్ఠగోత్రుడు నైన కృష్ణార్యుడు, తల్లి మంగమాంబ. ఈమె కానాలవారి యాడపడుచు, ఇంజేటివారింటి కోడలునైనను స్థిరనివాసమైన తరిగొండ పేరనే ప్రసిద్ధికెక్కినది. వెంగమాంబ తన యిష్టదైవ తముల కంకితముగా పలు కృతులు రచించినది. అందతి మాత్రమైన వైవిధ్యమును గలదు. వానిలో యక్షగానము లనేకములుగలవు. అన్నియు కడుచక్కని రచన గలవి. అందు పారిజాతాపహరణం కడు పెద్దది. గ్రంధ సంఖ్య రెండువేల పైచిలుకు.

ఈ గ్రంధ మముద్రితము. మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున సమగ్రమగు నొకచక్కని వ్రాత ప్రతి గలదు. నెం. ఆర్. 1056. ప్రతి విలేఖకుడు వేంగ మాంబ మునిమనుమడు గంగాధరప్ప. లేఖన కాలము క్రీ. శ. 16-7-1896. దీని యసలు మాతృక వ్రాసినవాడు గాదంసెట్టి పుల్లయ్య. ప్రా॥లి॥పు॥భాం॥ త్రైవార్షిక గ్రంధ దీపిక షష్ఠ సంపుటమున విష్ణు పారిజాత మనుపేర నీ గ్రంథ్యాంత భాగముల కవయిత్రిని గురించిన విశేషణ ములు గలవి వివరింపబడినవి. దీనికి కవయిత్రి పెట్టిన పేరు పారిజాతాపహరణ మని మాత్రమే. ఈమెదే యగు శివవిలాసమను యక్షగానమునకు పారిజాతా కథాసందర్భ సాదృశ్యము కారణముగా శివపారిజాత మనువ్యవహారము వచ్చినది. (చూ. ఆంధ్రసాహిత్యపరిషత్ప్రతి నెం. 2175) తద్భిన్నత గుర్తింప బడుట కనువుగా దీనికీ పేరు వచ్చి యుండును.

కథా విషయము : కృష్ణుడు పారిజాత తరువునే తెచ్చి యిచ్చెదనని సత్యభామకు బాస యిచ్చినతరువాతి కథ. కృష్ణ డొకనాడు సత్యను గికురించి కడమ రాణివాసము వారిని గలియుటకై యుపవనమున కరుగును. అక్కడ వనపాలకుడగు వికటభాషణునితో దన చెలులను బిలువు మనును. అట వాని యకటావికటమగు ప్రసంగము కొంత. తదుపరి వనమునకు బయనమై వచ్చిన కృష్ణ సతులు ప్రియునిగానక పొదరిండ్ల వెదకుచుందురు. వన పాలకునకు దగినభార్య వక్రభాషిణి "ఎవ్వరే మాతోటకిటు వచ్చినారు ; పువ్వుల పొదలన్ని పుణుకుచున్నారు" అని వారి నదలింప వచ్చును. వారు తమ చరిత్రలు చెప్పుకొం దురు. కొంతసేపటికి కృష్ణుడు ప్రసన్నుడగును. అంత వారందరి వనవిహారము. అంతలో సత్యభామ ప్రియుని వెదకి కొనుచు నచ్చటికే వచ్చును. అట మరల వక్రభా షిణి వక్రప్రసంగము. "సత్యచే కృష్ణునితో నామెకు గల చుట్టరికమును జెప్పింపవలెనని యామె పట్టుదల, భామ యతడు తన బావకు మరదికి నడిమి వాడన్నను, అత్త మామలకు గొడుకన్నను, సవతులకు మగడన్నను, తాళి గట్టినవాడన్నను కచ్చితముగా మగడని చెప్పదనుక వి చినదికాదు. అంతేకాదు సత్య యతనిని చక్రధరుడన కుమ్మరివాడా యనియు. శంఖధరుడన్న జంగము వా యనియు నెకసెక్కమాడినది. సత్యచే గడచిన పారిజా కథా ఘట్టమునుగూడ చెప్పించినది సత్య యామెకు పా తోషిక మిత్తునని యాన చూపి ప్రియునిదెర బంపును.

అట రుక్మిణ్యాదులతో కృష్ణుని సంభాషణ :

'సత్యభామకు సురపారిజాత తరువు
తెచ్చియిచ్చెద ననిపల్కి వచ్చితివటను
అందుకై నన్ను బిలచి రమ్మనుచుదీని
నంపినది సత్యభామ నెయ్యంబుమీర
నటకు మిముచీడిపోను గాల్వాడ విభుడు

పోదునో యుందునో తెల్పఁడేదియైన'
'ఆపె కడకె మగుడి యరిగెద నంటినీ
కడ్డ మెవ్వరిచ్చట నంబుజాక్షి
ఇంతపనికి మమ్ము నిందజేరమ్మని
యిటుకుఁ బిలువనంపనేల కృష్ణ?

'కొమ్మలార మీరు కోపంబు చేయకుఁ
డచటి కరిగి దాని నాదరించి
చెప్పి దానిమీఁదఁ దప్పు మోపిచటికి
క్షణములోన వత్తు సకియలార'

'ఇచట మమ్ము నుంచి యచటికిఁ జనిదాని
మాయలోన జిక్కి మమ్ము మఱచి
యుండ కెదురు చూచు చుండుదు మటుగాన
పోయిరమ్ము వేగ తోయజాక్ష'

తరువాత కృష్ణుడు సత్యవద్ద కరిగి యనునయింప బోవును. ఆమె ప్రణయకోపము చిత్తగించును. అదే మిషగా వెన్నుడు వెనుదిరిగినాడు. పశ్చాత్తప్తయై సత్య కృష్ణునిపాలికొక చెలికత్తెను జేతి కుత్తరమిచ్చి పుత్తెంచును. దానికి తిరుగుటపాలో సమాధానము మాత్రమే వచ్చినది. కృష్ణుడు రాలేదు. అంత సత్యయే స్వయముగా బయలు దేరినది. అక్కడ సత్యా కృష్ణుల సంవాదము. సవతుల కయ్యము. అప్పటికిని సత్యయెడ ప్రసన్నుడు కాలేదు. సత్య యింటిదారి బట్టినది. తరువాత తత్కృత మలయానిలోపాలంభాదికము.

ఉదా : జంపె — యదుకుల కాంభోజి.

'ఒక్క తలిదండ్రికే నెక్కువై పుట్టినది
నిక్కమైతే నభము నిను మ్రింగు గాక ॥౧॥
వసుధలోనే పతివ్రత నగుట నిజమైన
ముసుకొని పాములు నిన్ను మ్రింగు గాక ॥౨
వాయోగిజనుల కేవల కుంభకములందు
వెలవెలఁగి నిన్ను చెఱ వేయుదురు గాక ॥3॥

ఒకనాడు సత్యకడకు సరస్వతి కొరవంజియై వచ్చి కృష్ణజపము చేసిన నామె కోరికలీడేరు నను యెఱుక చెప్పి సింగని నే పథ్యము స్వీకరించి వచ్చిన బ్రహ్మగారి వెనుక వేంచేసినది. తరువాత సత్య మరియొకపరి ప్రియుని కడకేగి ఆ ప్రయత్నము విఫలముకాగా కృష్ణనామ జపారంభము చేసినది. చేసినదేకాని ఆ జప ఫలితముగా దనకొకవేళ వైరాగ్యము వచ్చినచో సవతులు సంతోషింతురనియపుడును సవతిమత్సరమునే ఎక్కువగా ప్రకటించినది. కృష్ణుడామె తపోనిష్ఠకు మెచ్చి దాని నితర సతుల కెరుకపరచి యామెకు పారిజాత వృక్షము దెచ్చి యిచ్చెదనను. ఆసతులు సవతి యాసున ఇంద్రుడా పారిజాతము నిచ్చునా? బలవంతముగా దెచ్చెదనంటివా యింత మాత్రమున కింద్రునితో జగడమా? ఒకవేళ పారిజాతము దేగల్గినను నది నందనవనమునగాక భూమిపై నిలచునా? నిలచినను పూచునా? పూచినను పూవులు స్వర్గమునకు జేరును అని యావిధముగ తల యొకమాట యాడిరి. రుక్మిణి మాత్రమతనిని సత్యకోరిక దీర్పుమన్నది. అతడందులకు కడమసతుల నొడంబరచు బాధ్యత నామెపైనే పెట్టినాడు అంత రుక్మిణి వారలతో —

'ఇదియేమి సతులార యిమ్మహామహుని
మది నెరుంగక యిట్టి మాట లాడెదరు
పరమాత్ముఁ డిటు భక్త పరతంత్ర కీర్తి
ధరియింపగా స్వతంత్రత గల్గె మనకు
నీమహత్త్వము చేత హెచ్చి గర్వించి
యీ మాధవుని నిల్ప నెంతవారలము
కావున నితని సత్త్వగుణ మాత్రంబె
కావలె మన కంతె గాని యొండేల
దయ చేత మనల నింతగ గొప్పచేసి
నయముగ నడచుచున్నాఁ డంతెగాని
పరవఁ జేయక సత్యభామ చెంగటికి
నరిగెద నంటె మీ రడ్డు వెట్టుదురె'

అని యనగా నప్పటికి సమ్మతించినారు. కృష్ణుడు సత్య కడకు వెళ్ళినాడు, అపుడామె పలుకు పలుకున వైరాగ్యము ప్రదర్శించినది, 'భావభవుడు నను బాధింపఁగనీ కీవైరాగ్యం బెందుకు నిలచునె' అని కృష్ణు డొత్తిడి చేసినాడు. సత్యను సముదాయించి, పారిజాతముదేర స్వర్గమునకు బోవుట కొక నిమిత్తము గలిపించుకొను నెపమున నప్పుడట అదితికుండలము లపహరించిన నరకాసురునిపై సతీద్వితీయుడై దండు వెడలును. అసురను సంహరించి యదితి కుండలములిచ్చి యింద్రునిచే సత్కృతు డగును. తరువాత నందనము కరగి పారిజాతము గొనుట వనపాలు రడ్డగించుట ఇంద్రునితో యుద్ధము, శివుని వలన రాజీపడుట —

కృష్ణుడు పారిజాతమును సత్య శృంగార వనములో ప్రతిష్ఠింపగనే రుక్మిణి తప్ప కడమ రాణులు వచ్చి సత్య

యింటనే అతనిని ముట్టడివైచిరి. అక్కడ సవతుల కొట్లాట. వారి వాదన.

'విను కృష్ణ నీవు బల్వేడుక మీర
ముని తెచ్చినట్టి యాముఖ్య పుష్పమును
సొరిదిగా మేమెల్లఁ జూచుచుండఁగనె
తెరగొప్ప రుక్మిణీ దేవికిచ్చుటకు
రహిసొప్పఁ బట్టంపు రాణి యటంచు
సహజంబుగా మేము సమ్మతించితిమి
తక్కక మాసాటి దానికీ తరువు
నిక్కంబుగాఁ దెచ్చి నీ విచ్చినపుడు
తానెక్కువేమి మాతక్కువ యేమి
యో నీరజాక్ష మా కొక్కరొక్కరికి
నొక్కొక్క భూజంబు నొసఁగినఁ గాని
యెక్కడ బోనీ య మిపుడు నిన్ననిన'

కృష్ణుడు మరల రుక్మిణిని బిలువబంపినాడు. ఆమె వచ్చి సత్యభామ తపముచేసి పారిజాతమును భక్త పారిజాతమును సాధించెననియు, అ భక్తపారిజాతము 'మనసు దెలిసి మాటలాడరే' యనియు దగవు జెప్పినది. సవతులందరు జచ్చినట్లొప్పు కొనిరి. సత్యభామ వారందఱకు జందన తాంబూలములతో పారిజాతపు బూల వాయనము లొసగినది. కృష్ణునిగూర్చి కలకంఠులు పాటలు బాడుటతో కధ ముగియును. తరువాత నొక ద్విపదలో కవయిత్రి విషయము. మరియొక దీర్ఘ ద్విపదలో శేషాద్రి క్షేత్ర పరివార దేవతలనుండి పరదేవత వరకు ఆలయ ప్రాకారమునుండి కల్యాణమండపమువరకు స్వామికి సంభంధించిన సమస్తమునకు వైష్ణవప్రపత్త్యుచితముగా నమస్కార సమర్పణము. అంత గ్రంథాంతము.

ఈ కథలో నీ కవయిత్రి కల్పనయే యెక్కువ. ఇందు పలుపాత్రలు. ప్రతిపాత్రయు జక్కగ చిత్రింప బడినది. వక్రభాషిణీ వికటభాషణుల దనపు బాత్రలు. వారుభామకలాపమునందుమాధవివంటివారు. హాస్యమునకుద్దిష్టమైనవారు. నాయికానాయికుల యెడ వారివెటకారపు ధోరణి విరసముగానున్నది. కాని వారి పాత్రలొకందులకు బనికివచ్చినవి–తదితర పాత్రల పరిచయమునకు. వేగుప్రదేశము సవతి కయ్యము మొదలగు సందర్భములందు భామకలాపము బాణి సాగినది. వెంకమాంబ తనవెంకటాచల మహత్మ్యములో శృంగారము తనకుబొత్తుగా కిట్టదని చెప్పుకొన్నది కానియిందు శృంగారము సమృద్ధిగానున్నది.

ఇందలి రచన కడు చక్కగ నున్నది. వెంగమాంబ యక్షగాన రచనలో నారితేరినది, నడుమసంధివచనములు లేకుండగనే చక్కగా నాటకఫక్కిలో పద్యములలోగూడ పాత్రల సంభాషణల నుక్తివైచిత్రితో హృదయంగమముగానడపించినది. సలక్షణభాషలో ప్రసిద్ధపదములతో సరళముగా నచ్చటచ్చట వ్యావహారికపు చెణుకులతో రచన సాగించినది. ఎరుకఘట్టము సవతికయ్యము యక్షగాన ప్రత్యేకతలు. ఆరెండిటియెడ నామె కతిప్రీతి. పలుగ్రంథములందా ఘట్టములను గడు నేర్పుగా నడపించినది. ఇందును కొరవంజి కులదేవతల నేకరువు పెట్టుట,స్వీయ జాత్యుచితముగా ప్రసంగించుట సాముద్రికము చెప్పుట సింగసింగళ్ల దరువులలో నరవములోగూడ సుదీర్ఘముగా సుందరముగా సంవాదము చేయుటయు గలవు. సవతి మత్సరము చాలచోట్ల ముచ్చటింపబడినది. అటప్రీప్రకృతి చిత్రణము హృదయంగమముగ నున్నది.

ఇందుకొలది తావుల మాత్రము రాగముల పే ళ్ళుదాహరింపబడి బహుళముగా తాళప్రధానములై తరచుతరిగొండ నరసింహ శేషగిరీశుల ముద్రలతోనున్న దరువులు, ద్విపదలు, మంజరి, పద్యములుఎడనెడవచనము, చూర్ణికలు, గొబ్బిళ్ళు, ఏలలు, నలుగుసువ్వాలలు, ధవళశోభనములు, మంగళ గీతములు గలవు. అచ్చపు యక్షగానము యక్షగానమని కవయిత్రి పేర్కొనినది. ఇంతచక్కని గ్రంథము నందును కవయిత్రీ కృతి నేత్రీజనోద్ధరణ బద్ధకంకణమైన సంస్థయైన వెంటనే ప్రచురించిన బాగుగ నుండును, అట్లు జరుగునని యాశింతును.



బిడ్డల లివరు అండు స్ప్లీను వ్యాధులకు

# పాత్రుడుగారి బాలసంజీవిని

డాక్టరు పిల్లా పాపయ్యపాత్రుడుగారి "బాలసంజీవిని" నిజముగ అమోఘమైనది. బిడ్డలకు సంభవించు లివరు అండు స్ప్లీను వ్యాధులలో ప్రథమ దశయందుగాని, కాంప్లికేటెడ్ స్థితియందుగాని తప్పకుండ గుణమిచ్చును. వైద్యవృత్తియందును నా స్నేహితులలోను బంధుకోటిలోను అనేకులు ఉపయోగించుటవల్లను "బాలసంజీవిని" యొక్క గుణాతిశయములు పరీక్షించుట కవకాశమేర్పడినది. బజారులోగల యితర లివరు ఔషధములుగూడ యిదివరలో వాడి చూచితినిగాని "బాలసంజీవిని" వాడిన పిమ్మట పైవాటినెల్ల విసర్జించి దీనినే హెచ్చుగ వాడుచున్నాను. అమోఘముగ నిట్టి మహౌషధమును ప్రజోపయోగమునకు వినియోగించుచున్నందుకు పిల్లావారి వంశము స్తుతిపాత్రమైనది.

డాక్టర్. ఎస్. రామనాథన్‌గారు L. M. P. కావేరిపాకం.

వివరములకు:

డాక్టరు పిల్లా పాపయ్య పాత్రుడు & బ్రదర్సు,

నెం. 19, దక్షిణమాడావీధి, మైలాపూరు, మద్రాసు 4.

| కుంభకోణం బ్రాంచి: | తిరుచినాపల్లి బ్రాంచి: |
| --- | --- |
| నెం. 7 సారంగపాణి కోవిల్ తూర్పు వీధి. | నెం. 15 పుగళై పిళ్లై వీధి తెప్పకొలం. |

అన్ని మందుల షాపులలోను దొరకును.

# రీటా హెయిర్ టానిక్
## తల వెంట్రుకలను పెంచును



రీటా కుదుళ్లకు బలమునిచ్చి, నిగనిగలాడు నికుపాటి వెంట్రుకలను పెంచుటకు అద్భుతమైన హెయిర్ టానిక్.

తల వెంట్రుకలు రాలుట, నెరయుట, చుండ్రు, బట్టతల, పేను కొరకు, ఇంకను తల వెంట్రుకలకు సంబంధించిన సమస్త వ్యాధులకు రీటా అమోఘముగ పనిచేయును. వేలకువేలువాడి గుణమును పొంది యున్నారు. మీరుకూడా నేటినుండియే రీటా వాడుడు. రీటా హిందూదేశ మంతటా దొరకును.

వెల: సీసా 15 అణాలు.




**RITA**
**HAIR TONIC**

# ★ స్వతంత్ర దినోత్సవం ★

శ్రీ పి. ఎస్. గోపాల్.

స్వాతంత్ర్య దినోత్సవ విభవం
తిలకింపగ రండోయ్ రండోయ్
పరపీడన విముక్తి దివసం
నేడేనోయ్ రండోయ్ రండోయ్॥

ఉదయారుణ కిరణకాంతిలో
దరహాసితసుమావళి జడిలో
ధ్వజాగ్రమున రెపరెపలాడే
దశదిశలను కీర్తినినింపే
అశోకచక్రాంకిత కేతన
మదియేమన జాతిసమస్తం॥
భారత పిత ప్రియబాపూజీ
మనకిచ్చిన అమూల్యరత్నం॥

యుగయుగాల పరపీడన సమసెను
అహరహాల మన తపసు ఫలించెను॥
భారత భువి దివియై వరలును
భారతప్రజ భావిరహించును॥
రారండోయ్ రండోయ్ రండోయ్
స్వాతంత్ర్య దినోత్సవ విభవం
తిలకింపగ రండోయ్ రండోయ్॥

# కచేరీ చావడి!

శ్రీమతి కె. లక్ష్మీరఘురామ్

"ఈవేళ ఇంకా కాఫీ తయారుకాలేదు? ఎనిమిది గంటలైనది."

"ఇప్పుడెట్లా కాఫీ త్రాగుతారు? గ్రహణం విడిచిన తరువాత స్నానముచేసి పులగము తిని కాఫీ త్రాగుదురు లెండి!"

"అయితే సరే! ఈవేళ మనకడుపు కాలినట్లే. నీవు గ్రహణం తరువాత కాఫీతయారు చేసేటప్పటికి మధ్యాహ్నము ఒంటిగంట కాదూ!"

♦ ♦ ♦

ఆడవాళ్ళునిత్యము దేనికో ఒకదానికి సణుగుతారని మగవాళ్ళెప్పుడు నిందిస్తూవుంటారు అదే విదేశాలలో "Nagging Woman" అని చెప్పుతుంటారు. అరవలేక సణగటముగాని, సణగటమెట్లావున్నా మగవారుఅరవటము సర్వసాధారణంగా అందరి ఇండ్లలోనూ ముఖ్యంగా ఆఫీసుకుపోయే పనిగంటలప్పుడు, ఆకలై క్లబ్బునుంచి రాత్రిఎనిమిది గంటలకు వచ్చినప్పుడు ప్రక్కింటివరకు ప్రతిధ్వనిస్తూ వుంటుంది. కాని ఉన్నది ఉన్నట్లు చెప్పితే ఎవరూరుకుంటారు?.

♦ ♦ ♦

ఏమిటీ హడావిడంతాను! ఈ రోళ్లు రోకళ్లు చేటలు తట్టలు దేనికి!

"అది కాదండీ సూర్య గ్రహణము గనుక రోకలిని తాంబాళములో నిలిపితే పిల్లలు తమాషా చూచి సంతోషిస్తారు ఈసారి గ్రహణము చాలా సేపుంటుంది. రోకలీ ఎక్కువసేపు నిలవవచ్చు. మీకు చూడటము కష్టంగావుంటే గదిలోకి వెళ్లి కూర్చోండి. కాఫీ త్రాగేదాక మీకు చిందులుత్రొక్కటం మామూలేగా!"

"అవునవును, రోకలిని నిలువబెట్ట గలవు, బ్రహ్మను నిలువబెట్ట గలవు నీ మాటలతో! ఆముసలమ్మ మాటలనమ్మేనా ఈ హడావిడంతాను? రోకలితో పాటు నీవుకూడా తల క్రిందకు పెట్టి నుంచుంటేనే ఆరోకలి నిలిచేది"

నేనేమి నుంచోనక్కర లేదులెండి! మరిరోకలి నుంచుంటే... మీరు..."

"ఆహా! మళ్ళీఅనుమానమెందుకు అనటానికి! రోకలిదానంతటది నిలుచుంటే నేనూ దానితో పాటు తలక్రిందపెట్టి నిలుచుంటాను"

చప్పట్లు...

"పట్టింది! పట్టింది గ్రహణము ... అదిగో! అదిగో నిల్చున్నది రోకలి! మరి మీరో?"

"ఊ ఇదిగో నేనూ"



(హిందూ పత్రిక దయతో)

[చదువరులు క్షమించాలి రోకలిఫోటో మాత్రమే ముద్రించినందులకు రోకలి నిల్చున్నంత నిలకడగా అయ్యగారి కాళ్ళు నిలువకపోవుటచే ఫోటో సరిగారాలేదు.

గ్రహణ కాలమందు సూర్య చంద్ర భూమి ఆకర్షణ శక్తులన్నీ ఒకేనిలువు గీతలో యుండు ప్రభావముచే రోకలి నిలుచుండును]

సణగటము అరవటములో ఏది వాంఛనీయమో!





శ్రీమతి కె. లక్ష్మి రఘురామ్.

మోహన్: —

| | | |
|---|---|---|
| గోధుమపిండి | : — | $\frac{1}{4}$ వీశె |
| పంచదార(చక్కెర) | : — | $\frac{1}{2}$ వీశె |
| మైదాపిండి | : — | $\frac{1}{4}$ వీశె |
| నెయ్యి | : — | $\frac{1}{2}$ వీశె |
| యాలక్కాలు | : — | 10 కాయలపొడి |

గోధుమపిండి, మైదాపిండి రెంటిని బాగా కలిపి కొద్దిగా ఉప్పు, నెయ్యి, నీళ్లు వేసి ముద్దగా కలపవలయును. ఉసిరికాయంత ముద్ద చేతిలోకి తీసుకొని సన్నగాతట్టి నేతిలో వేయించవలెను. [పంచదార పాకముపట్టి దానిలో యాలక్కాల పొడి వేసి యుంచుకొన వలయును] ఈ పాకములో వేడివేడిగా యుండగనే వేసి ఒక్క నిముషము మాత్రముంచి తీసి నెయ్యిరాసిన పళ్లెములో పెట్టుకొన వలయును. వేడి ఆరిన తరువాత పళ్లెములో నుండి తీసివేయవచ్చును

దిలూషా: —

| | | |
|---|---|---|
| గోధుమపిండి | : — | $\frac{1}{2}$ శేరు |
| పంచదార | : — | $\frac{1}{2}$ శేరు |
| నెయ్యి | : — | $\frac{1}{4}$ శేరు |

జీడిపప్పు, బాదముపప్పు : కావలసినన్ని తీసికొని సన్నగా కోసియుంచుకొనవలయును.

గోధుమపిండి పై పంచదారలో సగము, కొద్దిగా నెయ్యి నీళ్లు వేసికలిపి పిండిని పూరీపిండి వలె ముద్దగా కలుపవలయును. నిమ్మకాయలంతముద్దలుగా చేసి యుంచుకొన వలయును. మిగిలిన సగము పంచదారను చిక్కని పాకము చేసి యుంచు కొనవలయును. రొట్టెల పీట మీద కొద్దిగా గోధుమ పిండినిఅద్దు కొనుచూ ఈ నిమ్మకాయంత ముద్దలను రొట్టెల కర్రతో వత్త వలయును. వాటిని నేతిలో తేలికగా వేయించి ఒక్కొక్క దానిని పంచదార పాకములో ముంచి తీయవలయును. దానికి రెండువ్రకలా జీడిపప్పు బాదముపప్పుముక్కలను అద్దవలయును.



# తెలుగు సామెతలు

సేకరణ:

గు. వెంకుబాయమ్మ.

1. మోసే వాడికి తెలుసు కావడి బరువు.
2. యదార్థమునకు ఏడు చుట్లక్కర లేదు.
3. రత్నాలన్నీ ఒక చోట, నత్తగుల్లలన్నీ యొక చోట.
4. రోట్లో బుర్ర పెట్టి రోకటి పోటుకు వెఱచినట్లు.
5. వండ లేనమ్మకు నొప్పులు మెండు, తే లేనయ్యకు తిండి మెండు.
6. వచ్చిన వాడుక, చచ్చినా పోదు.
7. మంగలి పాత, చాకలి క్రొత్త
8. మంచివానికి ఒకమాట, మంచియెద్దుకు ఒక దెబ్బ.
9. మణిని మణి తోటే కొయ్యాలి.
10. మాటలు కోటలు దాటుతాయి,కాలు గడప దాట లేదు.
11. మాదిగ వాడు అల్లుడైనా,మాడే కాలుకు చెప్పు లేదు.
12. పెదిమి దాటిన,పెన్న దాటుతుంది.
13. పోయిన కంటికి మందు వేస్తే ఉన్న కన్నుకూడా ఊడ్చుకు పోయింది.
14. పేరు గంగా నమ్మ త్రాగబోతే నీళ్లు లేవు.
15. పొరుగింట చూడరా,నా పెద్ద చెయ్యి.



# ★ రాగోదయం ★

శ్రీమతి వి. ప్రభావతీదేవి.

వేసంగి సెలవుల్లో రాధాగోపాల్‌ల వివాహ తతంగం పూర్తి అయింది. రాధ తండ్రికీ గోపీ తండ్రికీ— అన్న దమ్ములకీ బావమరదులకీ ఉండే అనుబంధంకంటే అతి సన్నిహితమైన అనుబంధం ఉంది మొదటినుంచీ. ఆ రెండు కుటుంబాలమధ్యా ఉన్న అనుబంధమే ఒక విధంగా రాధా గోపాల్‌ల వివాహానికి కారణ మయిందని చెప్పాలి. రాధ చదువు పూర్తయి డిగ్రీ తీసుకోవటానికి ఇంకా ఒక సంవత్సరం వ్యవధి ఉందని, గోపీ ఒక్కడే ఉద్యోగరీత్యా పట్నం వెళ్ళిపోయాడు. అతను వెళ్ళికూడా కొన్ని నెలలు గడిచాయి ... అతను ప్రయాణ మయ్యే టప్పుడు రాధ అనుకుంది— వెళ్ళగానే క్షేమం తెలియ జేస్తూ తనకి ఉత్తరం రాస్తాడని— అలా అనుకుంటూండ గానే నెలలు గడిచిపోయాయి. కాని తన పేర ఉత్తరం మాత్రం రాలేదు.

రోజులు గడిచినకొద్దీ రాధలో చిత్రమైన మార్పేదో వస్తోంది.... తనకి తెలియకుండానే తన కాలంలో ఎక్కువభాగం గోపీని గురించిన ఆలోచనలకి వినియో గిస్తోంది. అతను పట్నంలో ఎలా ఉన్నాడో!.. ఏం చేస్తూఉంటాడో. అనుక్షణం గోపీని గురించే ఎడతెగని ఆలోచన. ఇదివరకు ఎన్నడూ అతన్ని గురించి ఇంతగా ఆలోచించలేదు. పైగా అతని పట్ల తను నిర్లక్ష్యం చూపిందికూడా. కాలేజీలో అతను తనకి ఒక సంవత్సరం సీనియర్. తోటి లేడీ స్టూడెంట్స్ అంతా అతన్ని మెచ్చుకుంటున్నా తను అతని విషయంలో ఏమాత్రమూ ఆసక్తి చూపలేదు. అతని అభివృద్ధిపట్ల ఎప్పుడూ తనకి ఉదాసీనతే. క్లాసులో అన్ని సబ్జక్ట్సులోను అతనే ఫస్టుమార్కు కొట్టేసినా స్పోర్ట్సులో కాలేజీ మొత్తంమీద ఛాంపియన్‌షిప్ అతనికే లభించినా, మంచి క్రికెట్ ప్లేయర్ అని సర్టిఫికెట్లు సంపాదించినా తనకి అవేవీ మెచ్చుకోతగ్గవిగా కనిపించలేదు ఆరోజుల్లో. అవును— తనెందుకు మెచ్చుకోవాలి— తను మాత్రం ఏవిషయంలో అతనికి తీసిపోయింది— తన క్లాసులో తనూ బ్రిలియంట్‌గా ఉండేది. బాట్‌మింటన్‌లో తనూ లీడరుగాఉండి తన జట్టుని గెలిపించింది. ఆ ఊళ్ళో కాలేజీలన్నిటికి జరిగిన సంగీతపు పోటీలో తనకే ఫస్టు ప్రైజు వచ్చింది— ఒక్కనాడయినా అతను తనని మెచ్చు కున్నాడా— లెక్చరర్లు స్టూడెంట్స్ అందరూ తనని పొగిడేవారు. మరీ ఆ సంగీతపు పోటీలో గెలిచినందుకు కాలేజీ పరువు నిలబెట్టావని ప్రిన్సిపాలుకూడా ఎంతో అభినందించాడు. అప్పుడుకూడా గోపీ చలించలేదు. అందువల్ల తనూ అతనిపట్ల నిర్లక్ష్యం చూపింది. అతను తన యింటికి వచ్చినా తను వాళ్ళ యింటికి వెళ్ళినా అతనితో ముక్తసరిగా మూడు మాటలు మాట్లాడేది. ఇప్పుడు అతన్ని గురించి తను ఎందుకు ఇంతగా ఆలోచిస్తోంది. పట్నంలో అతను ఎలా ఉంటే తనకేం. తనకి చదువు ముఖ్యం. తల్లిదండ్రుల కోరిక ప్రకారం పెళ్ళి మాత్రం అయిపోయింది. అంతే. అంతమాత్రంచేత ఇక్కడ కాలేజీలో తన చదువు తన యాక్టివిటీస్ అన్నీ అశ్రద్ధచేస్తే ఎలాగ.... కాని ఎందుకో మనస్సు దేనిమీదా లగ్నం చెయ్యలేకుండా ఉంది. ఇదివరకు చదువుమీద ఉన్న ఉత్సాహంకూడా ఇప్పుడు లేదు. ఏపోటీలోనూ పాల్గొనటానికి ప్రక్కనప్రోత్సాహమేదీలేదు ఇదివరకంటే గోపీమీద కసికొద్దీ గర్వంకొద్దీ ప్రతిరంగంలోనూ దూకి పట్టుదలతో తనూ విజయం సాధించేది. ఇప్పుడు అన్ని ట్లోనూ తను వెనకపడుతోంది తనకే తెలియని లోటేదో క్రమంగా తన విద్యార్థి జీవితాన్ని ఆక్రమించేసింది... ఇంట్లో ఉన్నప్పుడూ అలాగే ఉంది. కాలేజీలో ఉన్న న్నాళ్ళూ సరే— పంతంకొద్దీ ఇద్దరూ సన్నిహితులు కాలేకపోయారు. ఇప్పుడు పెళ్ళిచేసుకుని వెంటనే తను దూరానికి వెళ్ళిపోయాడుకదా— ఉత్తరమయినా వ్రాయటం అతని విధ్యుక్తధర్మంకాదా!— పోనీ అతనికి లేని

ఆవేదన తనకెందుకు ? —అలా అనిపించటంలేదే తనకి. తన ఆలోచనలన్నీ అతని చుట్టూరా తిరుగుతున్నాయి. ఎందువల్ల ? పెళ్ళి అయిందే చాలునని అతని మీద తను అధికారం చలాయించటానికి ప్రయత్నిస్తోందా ? అవును. నిజమే. ఇప్పుడు ఆ అదికారం తనకి వచ్చింది. తను ఆ అధికారాన్ని ఎందుకు ఉపయోగించుకోకూడదూ ... పోనీ తనే ముందు ఉత్తరంవ్రాసి చూస్తే !.... సమాధానం రాకపోతే అప్పుడు ఆలోచిద్దాం .. ఉత్తరం వ్రాసింది రాధ. సమాధానంకూడా త్వరలోనే వచ్చేసింది. రాధ సంతోషానికి అంతులేదు. ఇంతకూ అతను ఉత్తరం రాసినందుకుకాదు అ సంతోషం— తను గోపీని ఓడిం చానని. అతనిలో కదలిక కలిగించానని.

కొన్ని నెలలపాటు ఇద్దరిమధ్యా ఉత్తర ప్రత్యుత్తరాలు సవ్యంగానే నడిచాయి. తరవాత ఒకసారి గోపీ ఉత్తరం మామూలుకంటె ఆలస్యంగా వచ్చింది. ఆలస్యానికి సంజాయిషి అడుగుతూ వెంటనే ఉత్తరం ఉరికించింది రాధ. అతను సమాధానం వ్రాశాడు- "తనమిత్రులు కొందరూ, తన ఆఫీసులో సత్యవతిగారూ, తనూ-అంతా కలిసి ఎక్స్‌కర్షన్‌కి వెళ్ళామనీ. తిరిగి వచ్చేసరికి ఆరోగ్యం కొద్దిగా దెబ్బతిందనీ, పాపం ! సత్యవతిగారే చాలా సహాయం చేశారనీ- ఇప్పుడు మళ్ళీ అంతా కుదుట పడిం దనీ— ఆ ఉత్తర సారాంశం. అది చూసి రాధ మనస్సు అవమానంతో, దుఃఖంతో కుంగిపోయింది. గుండె దహించుకుపోయింది— తన తూణీరంలోంచి ఒక బాణం తీసి వెంటనే విసిరింది—

మిస్టర్ గోపాల్

నమస్తే.

నేను నీకు ఇంతవరకు రాసిన ఉత్తరాలన్నీ వెంటనే తిరుగు టపాలో నాకు పంపించు. నాకు అవి వెంటనే కావాలి. తప్పకుండా పంపించు.

ఇట్లు
రాధ.

అని వెంటనే గోపీకి ఒక 'కార్డు' రాసింది. ఆ 'కార్డు' చూసి నిర్విణ్ణుడయిపోయాడు గోపీ.... రాధ తనకి 'కార్డు' రాయటం ఏమిటి ! ఆదీకాక ఉత్తరంలో ఎప్పుడూ 'ప్రియ గోపీ !' అని గోముగా పిలిచేరాధ 'మిస్టర్ గోపాల్ !' అని హుంకరించింది. పైగా నమస్తేట నమస్తే— రాధ దగ్గరనుంచి తనకి నమస్కారాలాకావాలి! ఈమధ్యనే మనిషి కొంచెం దారినపడిందని సంతోషిం చాడు ... మళ్ళీ ఎందుకో ఈ కోపం ! కారణమయినా రాయదు మహారాణీ... ఎప్పుడూ ఎనిమిది పేజీలకి తక్కువకాకుండా ఉత్తరం రాసే రాధకి మూడు కాన్ల కార్డు కూడా ఎక్కువయింది. ఆవిడ కోపకారణమేమిటో అర్థంకాలేదు తనకి— అంత మాత్రాన తను ఉత్తరాలూ పంపించలేడు. తను మాత్రం తీసిపోయాడా ? లేకపోతే ఎప్పుడూ ఒకటే పద్ధతా ? ఎల్లప్పుడూ తనదే పైచెయ్యి అంటుంది. కాలేజీలో ఉండగానూ ఇలాగే ఏడిపించింది. ఆరోజుల్లో రాధ వల్ల తను పడిన క్షోభ ఆభగవంతుడికి తెలియాలి ! కానరాకుండా తనని ఎంత హింసించింది. తనని గురించి ఆమె మనస్సులో ఉద్దేశమేమిటోకూడా పైకి తెలియనిచ్చేదికాదు. ఎప్పుడూ ఒకటే మౌనం. ఉడుకుమోతు తనం, పెంకెతనం. కాలేజీలో అందరినీ తను మెప్పించగలిగాడుగాని ఈ ఒక్క స్త్రీహృదయాన్ని కదిలించలేకపోయాడు. తనని గురించి ఆవిడ తనతో చెప్పలేకపోవచ్చు- పోనీ- ఇతరుల దగ్గరయినా తనపేరు ఉచ్చరించటం ఆవిడకి నామోషీ. —అది సిగ్గో, భయమో, ఔదాసీన్యమో తెలియదు....ఇవన్నీ ఎవరికి చెప్పుకోవటం ! ఎలా చెప్పుకోవటం !.... రాధని గురించి తనకి తనే చెప్పుకోవలసింది ఎంతో ఉంది... ఏనాటి నుంచో ఈ 'రాధ' తన గుండెల్లో మెసులుతోంది ! అవన్నీ చెప్పటానికి సరి అయిన మాటలే లేవు... రాధకి తనమీద ఇప్పటికైనా జాలి కలగలేదు. ఇంకా దూర దూరంగా ఉండి బాధ పెడుతోంది. ఏడిపిస్తోంది. అంతే.

ఈవిధంగా ఉత్తరాలద్వారా ఇద్దరి మధ్యా చిన్న ప్రణయకలహం ప్రారంభమయింది. అదే చివరికి మహా ప్రళయకలహంగా మారింది. రోజులు గడిచినకొద్దీ గోపీకి పరిస్థితి అంతా అయోమయంగా ఉంది. ఏం చెయ్యా టానికీ తోచదు. ఈ ఎడబాటు భరించటం ఇద్దరికీ చేత కావటంలేదు బహుశా ఈ ఆందోళన కంతటికీ అదే కారణం కావచ్చు— అందుకే ఇద్దరి మధ్యా ఇంత గాలి దుమారం రేగుతోంది... దీనికి ఏదైనా మార్గాంతరం ఆలోచిస్తేగాని వీలులేదు. పోనీ తను వెళ్ళి ఒక్కసారి రాధని చూసి రాకూడదూ ; అప్పటికి సరిగ్గా పరీక్షలు కూడా అయిపోతాయి... ఇంతలో రాధ దగ్గరనుంచి మళ్ళీ ఉత్తరం వచ్చింది— ఇకనైనా తన ఉత్తరాలు

పంపకపోతే భోజనం చెయ్యటం మానేస్తానని రాసింది. గోపీ ఇంక ఏమీ ఆలోచించలేకపోయాడు. ఇంకా ఆలస్యంచేసి ఆఆబలని బాధపెట్టటం అధర్మమనుకున్నాడు. ఆరాత్రి మెయిలుకే బయలుదేరాడు. ఊళ్ళో దిగి సరాసరి రాధగారింటికే వెళ్ళాడు... అత్త మామల కుశల ప్రశ్నలు తల్లిదండ్రుల యోగక్షేమ విచారణ క్రమం తప్పకుండా ఒకటి తరవాత ఒకటి అన్నీ సవ్యంగానే గడిచిపోయాయి. కాని రాధా దేవి సందర్శన భాగ్యమే తనకి కరువయింది. ...వచ్చింది అత్తవారింట్లో పనిమీద కనక ఆ రోజంతా అక్కడే ఉండిపోయాడు. రాధ ఒక్కసారి బయటికి వచ్చి తనని పలకరించనైనా పలకరించలేదు. అంత అపరాధం తనేం చేశాడు ? ఎప్పుడూ పెంకెతనమేనా ? అబ్బ ! ఈ స్త్రీజాతి ! — అందరు స్త్రీల సంగతి తన కెందుకు ? ఈ ఒక్క వ్యక్తి తనని మొదటినుంచీ ఇలాగే ఏడిపిస్తోంది. —— నారీ హృదయమే అంత... వాళ్ళ మనస్సులు ఎంత సున్నితమైనవో అంత కఠినమైనవి కూడాను... ఈవిడ హృదయంలో కఠినత్వం పాలే తనకి ఎక్కువ ఛవి చూపించింది. అసలు సున్నితత్వం ఉందో లేదో— ఉండకపోతే తనకి రాధని గురించి ఇంత ఆవేదన దేనికి !

• • •

సాయంకాలం పెరట్లో మల్లె పందిరి దగ్గర పూలు కోస్తూ- గోపీకి ఒంటరిగా దొరికింది రాధ. ఉదయం నుంచే ఈ తరుణం కోసమే వేచి ఉన్న గోపీ చివాలున కుర్చీలోంచి లేచి నిశ్శబ్దంగా రాధని సమీపించాడు.

"రాధా !" ఉత్సాహంగా పలకరించాడు. రాధ పలక లేదు. తనవేపయినా తిరిగి చూడలేదు. తను అక్కడికి వస్తాడని ఆమెకి ముందే తెలుసుకాబోలు. అందుకే పరాకు నటిస్తోంది. అబ్బ ! ఎంతనిర్లక్ష్యం ! అక్కడికీ తను సహనం తెచ్చిపెట్టుకున్నాడు.

"రాధా !" మరింత చేరువగా వెళ్ళి మనసారా పిలిచాడు. ఈసారి సమాధానం వచ్చింది, కాని అది నిజానికి సమాధానంకాదు- ప్రశ్న !

"నా ఉత్తరాలేవీ ?"

"నేనే వచ్చానుగా ! ఇంకా నీకు ఉత్తరాలెందుకు ?"

"నాకు అవి కావాలన్నానుగా- ఎందుకివ్వకూడదూ ?"

"ఒరి ఉడుకుమోతుపిల్లవి రాధా ! ఎన్నాళ్ళు గడిచినా పెంకెతనం పోలేదు."

"అందుకే తమరు సంపాదించుకున్నారుగా పట్నంలో ఒక సరసురాలయిన సత్యభామాదేవిగార్ని - ఇహ రాధ తోనూ, రాధ ఉత్తరాలతోను తమరికేం పనీ ?— అందుకే నా ఉత్తరాలు నాకు ఇచ్చెయ్యమన్నాను."

"ఓహో !.... అదా నీకోపకారణం ! చెప్పవేం రాణీ !" అంటూ రాధని దగ్గరకి తీసుకోబోయాడు గోపీ. అతన్ని విదిలించుకుని దూరంగా నిలుచుని అన్నది రాధ-

"నా మొహంలా ఉంది ! ఏమిటా సమాధానం ?"

"అవును. నామాటలెప్పుడూ నీ మొహంలాగే ఉంటాయి— అంటే— అంత అందంగా చిలిపిగా ముద్దులు మూటకడుతూ ఉంటాయన్నమాట. అవునా రాధా ?" అంటూ రాధ ముఖాన్ని రెండు చేతులతోనూ పట్టుకుని కళ్ళల్లోకి చిలిపిగా చూశాడు. కాని రాధ కోపం చల్లార లేదు. అతన్ని దూరంగా తోసేసింది.

"ఏమిటి రాధా ఈ అధర్మ యుద్ధం ?.... నేరం చిన్న దయినా ఇంత పెద్ద శిక్ష విధించటం నీకు తగునా రాధా దేవీ !" బుజ్జగించి అడిగాడు గోపీ. ఉహుఁ ! రాధగుండె కరగలేదు.

"కలతపీడు చెలియ ! నీవలపుదక్క వేరుతెలియ !

రాధికాప్రియుండె, యీ మాధవుడని విశ్వమెరుగు !"

అని కూని రాగం తీస్తూ ఆ చిన్ని గడ్డం పుణికి బ్రతిమాలాడు గోపీ. ఊహుఁ ! రాధ పూర్తిగా మౌనంతాల్చింది. ఇదంతా తనకేమీ పట్టనట్టు మరొక వేపుకి తిరిగి పూలు కోస్తోంది. గోపీకి ఆ ప్రవర్తన మరింత దుస్సహంగా ఉంది- ఇక జాలి తలిస్తే లాభం లేదనుకున్నాడు. రాధని మొదటినుంచీ అదుపులో పెట్టకపోవటం తనదే పొరపాటనుకున్నాడు ఆడదానికి అంత అహంకారం కూడదనుకున్నాడు—— అంతే- సహనాన్ని కోల్పోయాడు. దగ్గరగా వెళ్ళి రాధ చేతిలో ఉన్న పూల పళ్లెం పందిరిమీదికి విసిరేసి రాధని బలాత్కారంగా తన కౌగిట్లో బంధించేశాడు....

"రాధా !"

"గోపీ !" అప్రయత్నంగా పిలిచింది రాధ కంఠం.

# రాగోదయం

రాధ హృదయంలో అనురాగం అవధులు దాటి ప్రవహించింది.

"గోపీ!.... ఇంకెప్పుడూ నన్ను విడిచి దూరంగా వెళ్ళిపోకు గోపీ!"

"రాధా! నీకు నాపట్ల అంత అనురాగం ఉందారాధా!"

"అవును గోపీ!.... నువ్వులేని నా జీవితం చిన్నబోయింది గోపీ!— ఇన్నాళ్ళూ అదేమిటో నాకు తెలియలేదు— ఇంకెప్పుడూ నన్ను విడిచి అలా దూరంగా వెళ్ళిపోకేం!"

"లేదు రాధా.... నిన్ను విడిచి నేనుమాత్రం ఉండగలనా!.... నువ్వులేని నా జీవితమూ శూన్యమే రాధా!"

"గోపీ!"

"రాధా!"

గోపీని ఏదో అడగాలనే అనుకుంది రాధ. - కాని మాటలు పెగిలిరావటంలేదు ..గోపీమీద కోపం తెచ్చుకోవాలనే అనుకుంది — కాని తృటిలో అన్నీ మరిచిపోయింది ...అసలు ఏం జరిగింది!— జరిగిందేమిటో తెలిసేసరికి గోపీ దూరంగా పడకకుర్చీలో కూర్చుని విజయగర్వంతో తనవేపుచూసి నవ్వుతున్నాడు రాధ సిగ్గుపడి తలవంచుకుంది - జరిగింది ఇది — మైమరపించి హాయినిచ్చిన తన గోపీ సాన్నిధ్యం ఉత్తరాల సంగతి మరిపించి తనని మాయలో పడేసింది - ఉత్తరాలేకాదు - ఆక్షణంలో తను ప్రపంచాన్నే మరిచిపోయింది.... అతని కౌగిట్లో తనకి జన్మాంతరాల స్వప్నాలేవో జ్ఞాపకం వచ్చాయి. ఎన్ని జన్మల నోముల ఫలమో ఈ 'గోపీ!'- అనుకుంది. గోపీమీద తనకి ఉన్న ప్రేమని ప్రదర్శించటానికి ఇన్నాళ్ళూ తన గర్వం అడ్డువచ్చింది. అందుకే తను మానసికంగా అంత ఆందోళనా అనుభవించింది.... ఇప్పుడు ఆగర్వం అంతా మంచులా కరిగిపోయింది ... తన హృదయవీణా తంత్రుల్ని క్షణంలో ఒక్కసారి మీటి వదిలేశాడు గోపీ. ఇక ఆ తంత్రీనాదం, ఆస్పందన జీవితాంతం శాశ్వతంగా ఉండిపోతాయి. అంతే - తనలో ఇన్నాళ్ళూ తనకే తెలియకుండా ఉన్న వింతశక్తి ఏదో ఒక్కసారిగా ఈ మధురక్షణంలో మేలుకుంది. తను ఇన్నాళ్ళూ అనుభవించిన బాధే ఆశక్తేమో! ఆబాధలో ఎంత మాధుర్యం ఉంది! ఎంత తీయనిబాధ అది!— ఆబాధే అతన్ని తనకి చేరువగా తెచ్చింది. ఆబాధే తనని అతనికి లొంగిపోయేటట్లు చేసింది. ఆబాధే తనకి అతని మీద అధికారం ఉందని ఋజువుచేసింది, ఆబాధే అతన్ని తనముందు మోకరిల్లేటట్టు చేసింది — ఆబాధని అర్థంచేసుకుని, ఆప్రేమని అనుభవించినప్పుడు గానీ అందులో ఉండే మాధుర్యం తనకి అర్థంకాలేదు ...తనకి నిజంగా కావలసింది ఉత్తరాలు కాదనే సంగతి ఆక్షణం వరకు తెలియలేదు వెర్రిపిల్ల రాధకి....చివరికి గోపీ చేతిలో తనే ఓడిపోయింది!

పందిరిమీద మల్లెలన్నీ రాధని చూసి ఫక్కున నవ్వాయి పళ్ళెంలో చెదిరి ఉన్న పువ్వులు మాత్రం జాలిగా రాధ వైపు చూశాయి.

---



# సంక్షేమం



" స్త్రీలకు పిల్లల ఆటబొమ్మలు తయారు చేయుట
ఆచరణ యోగ్యమైన ఉత్తమ గృహపరిశ్రమ."
—కమలాదేవి చటోపాధ్యాయ.

పూనాలోని కిలౌనా గృహపరిశ్రమాగారంలో తయారయింది - ఈసంగీత కళా కుటుంబం.

# శ్రీ శారదా మహిళా విజ్ఞాన సమితి, బాపట్ల

## కార్యకలాపాల సమీక్ష

"శ్రీ శారదా మహిళా విజ్ఞానసమితి, బాపట్ల" అను పేరుతో యీ స్త్రీల సంస్థ నాలుగు సంవత్సరముల క్రిందట వందమంది సభ్యురాండ్రతో స్థాపించబడి బాపట్ల పట్టణములోని స్త్రీలకు ప్రతిభావంతముగా సేవచేయు చున్నది. అది రాజకీయములతో సంబంధములేని విధముగా అన్ని తరగతుల, అన్నివర్గముల, అన్ని మతముల స్త్రీలకు, బాలికలకు విద్యా విజ్ఞాన రంగములలో అవిరళ సేవ చేయుట పరమావధిగా నెలకొల్పబడినది. 8-6-55వ తేదీన చతుర్థ వార్షికోత్సవమును విజయవంతముగా గుంటూరుజిల్లా కలెక్టరుగారి సతీమణి శ్రీమతి ప్రమీలా భగవాన్‌దాస్‌గారి అధ్యక్షతను జరుపుకొనియున్నాము.

స్త్రీలలో విద్య తక్కువ. చదువుకున్న స్త్రీలు ఎక్కువగా గృహనిర్వహణలోవుంటూ బయటికి వచ్చి పుస్తకములను తీసుకొనిపోయి చదువుకొనుట అరుదు. అందువల్ల పుస్తకములను వారివారి యిండ్లవద్దనే యిచ్చి చదివిన తరువాత తిరిగి వాపసు తీసుకొనేపద్ధతి వున్నచో కొంతవరకైనా స్త్రీలకు పుస్తక పరిచయము చేయుట కవకాశముండునని సమితియొక్క సౌఖరుద్వారా అట్టి పద్ధతి నవలంబించి యింతవరకు నడుపుచున్నాము. చాలామంది యీ పద్ధతి బాగున్నదని ప్రశంసించి యున్నారు. ప్రస్తుతము మా సమితి గ్రంథాలయమునకు సుమారు వెయ్యి పుస్తకములు మాత్రమే కలవు. పై పద్ధతిన మెంబర్లకు గ్రంథ పరిచయము యింకా యెక్కువ చేయవలెనన్నచో యింకా క్రొత్త పుస్తకములను ఎక్కువగా గ్రంథాలయమునకు చేర్చుచుండవలయునుగదా! అట్టివి వదాన్యుల పుస్తకముల విరాళములకుగాను, ప్రభుత్వ గ్రాంటులద్వారాను గ్రంథాలయమును వృద్ధిపరచ నుంకించుచున్నారు. ఇటీవలనే జిల్లా కలెక్టరుగారు రు 50 ల గ్రాంటును యీ విషయమై యిచ్చియున్నారు ఇదియును గాక కార్యదర్శిని జిల్లా లైబ్రరీ అధికారిణీ కమిటీలో మెంబరైయున్నందున ఆ సంస్థవారు బాపట్లలో నెలకొల్పిన గవర్నమెంటుగ్రంథాలయమునుంచి పుస్తకములు తీసుకుని మా సమితిద్వారా మెంబర్లకు అందజేయు పద్ధతి నొకదానిని ఏర్పాటు చేయదలచియున్నాము. అమెరికన్ ఎంబసీవారు గూడా మా లైబ్రరీకి నూరు పుస్తకములను ఉదారముతో పంపించియున్నారు.

మా సమితి యాజమాన్యమున బాలికలకు హిందీ క్లాసులను సమర్థులైన ఉపాధ్యాయులను నియమించి నడుపుచున్నాము 1952 సంవత్సరమునుండి జరుపగా పరీక్షలకు వెళ్ళినవారు అత్యుత్తమముగా పరీక్షలలో ఉత్తీర్ణలగుట చాల ఉత్సాహమును కలిగించుచున్నది. గోదావరి వరదబాధితులకై మా సమితి తరపున రు 260 రొక్కమును, గుడ్డలు, బియ్యమును వసూలు పరచి శ్రీరామకృష్ణామిషన్‌వారి ద్వారా వినియోగపరచి మా ఓపినంతవరకు బాధిత ప్రజలకు సహాయము చేసి యుంటిమి

సమితి సభ్యులకు ఆటలాడుకొనుటకు సమితి వసతి గృహములో అవకాశము ఏర్పాటుచేయబడినది. అందరూ కలుసుకొని విజ్ఞాన వినోదములలో పాల్గొను ఏర్పాట్లు చేయబడినవి. అందుకుగాను సమర్థులైనవారిచేత సభలు చేయించుట, పాటకచేరీలు ఏర్పాటుచేయుట మొదలగు పనులను చేయుచున్నాము.

ప్రస్తుతము బాలికలకు నృత్యము, సంగీతములలో తరగతులను నడుపుటకు ప్రారంభించి సమర్థులైన ఉపాధ్యాయులను నియమించియున్నాము.

మా సమితి స్త్రీ జనోద్యమవ్యాప్తిలో జరుపుచున్న యీ అవిరళ కృషిని తిలకించి కేంద్ర సంక్షేమ సలహా సంఘంవారు రు 1000 ల గ్రాంటును గత సంవత్సరం యిచ్చియుండిరి. మా సమితి కార్యక్రమములను గత డిసెంబరు మాసములో ఆంధ్ర స్టేటు బోర్డు అధ్యక్షులైన శ్రీమతి ఎ. సి. కృష్ణారావుగారు తిలకించి ఎంతయో మెచ్చుకొనిరి పైన వుదహరించిన గ్రాంటుతో రెండు కుట్టు మిషన్లు కొనబడి యిద్దరు ఉపాధ్యాయులు నియమించబడి బీదలగు స్త్రీలకు, బాలికలకు లేక కుట్టునేర్చు కొనదలచిన స్త్రీలకు, బాలికలకు కుట్టువిద్య నేర్పబడు చున్నది. ప్రస్తుతము 14 గురు విద్యార్థినులు తర్ఫీదు పొందుచుండిరి.

యింకా చాపలు, కేను, టైపు మిషను, నవారు ఇత్యాది వృత్తి విద్యలు పెట్టవలయునని ఉత్సాహముతో మా సభ్యురాండ్రు ఆలోచించుచుండిరి.

మా సమితికి స్వంతభవనము లేనికారణమున మేము నెరవేర్చదలచిన అనేక కార్యక్రమములు కుంటుపడుచున్నవి. త్వరలోనే మాకు స్వంతభవనము ఏర్పడునని ఆశించుచున్నాము.

కర్లపూడి కమలాదేవి,

కార్యదర్శిని.



అనాథబాలుని సంరక్షిస్తున్న మదర్ థెరెసా.

# అనాథసేవికలు

షర్లీ హిల్‌డ్రెత్.

ఇటీవల ఒక ఇంగ్లీషు పత్రికలో కలకత్తాలోని హౌరా బ్రిడ్జిని గురించిన బొమ్మలున్నూ ఒక చిన్న వ్యాసంకూడా వెలువడ్డాయి. అందులో "రోజూ ఆ వంతెనను పది లక్షలమంది జనులు దాటుతూవుంటారనీ,— వాస్తవంగా చెప్పవలసివస్తే— హౌరా బ్రిడ్జి ప్రపంచంలోకల్లా జన సమ్మర్దమైనదనిన్నీ ప్రకటించబడింది. నగరంలోని అన్ని భాగాలకి అది తలమానికంలా ఉంటూ నగరంలోనికి ప్రజలను ప్రవేశపరుస్తూ ఉంటుంది. కాని ప్రపంచంలో ఇంకెక్కడాలేని దారిద్ర్యం అక్కడ ఉందనే సమస్యను గురించి ఆవ్యాసం ఎత్తుకోలేదు. బస్తీప్రాంతాల జనుల బాధలు ఆప్రదేశాన్ని నిరంతరమూ మరకలు చేస్తూ దాని స్వరూపాన్ని కళంకితము చేస్తున్నాయనికూడా చెప్ప బడలేదు.

అప్పటి బస్తీలు అధికారరీత్యా ఇలా పేర్కొన బడ్డాయి:

ఒక్కటేగది— అందులోనే కుటుంబం యావత్తు నివసించడం. అందులోనే వంట, అక్కడే తినడం,

అందరూ కలిసి పండుకోవడం. చెమ్మ ఊరుతూ దిగబడుతూ ఉండేనేల. దానిమీద పరిచిన ఒక చింకిరిచాప. ఇదివారి పరుపు. లోపల మురికి అవతలకిపోదు. అవతల ఈగలుముసురుతూ నిలిచిపోయిన కుళ్ళునీటి కాలవలూ దానినిండా మురిగిన కుళ్ళున్నూ. సంసారంకోసం వాడుకోడానికి నీళ్ళు ప్రక్కనే ఉన్న పసరుతోనిండి జిడ్డుబారిన నిలవనీటి కుళ్ళుగుంటలలోనుంచి తెచ్చుకుంటారు. ఆరోగ్యం విషయంలో ప్రపంచ పట్టణాలలో కలకత్తా నల్లని మచ్చ అనుటలో ఆశ్చర్యంలేదు. ఈమచ్చ పోగొట్టుట ఒక బ్రహ్మాండమైన సమస్య అయిపోయింది. వేలాది జనులు ఈ నగరంలో రోజూ ప్రవేశించడంవల్ల రోజు రోజుకూ ఈ సమస్య ప్రవర్ధమానమవుతూంది. కొందరు అదృష్టవంతులు ఈ బ్రిడ్జి దాటి నగరం ప్రవేశించి రోజల్లా వారివారి పనులు చక్కపెట్టుకుని సాయంకాలం తిరిగి వెళ్ళిపోతారు. కాని ఇంకా కొందరువస్తారు. "కలకత్తా మహాపట్నంకదా. అపారంగా జనానికి వృత్తి కల్పిస్తుంది. మన జీవనోపాధికి తగిన సంపాదన కలగజెయ్యలేకపోతుందా" అని. ముసలివాళ్ళు. యువకులూ, ఉద్యోగాలకోసం, నిర్వాసులు తలదాచుకోడానికీ, రోగులు కిటకిటలాడుతున్న ఆసుపత్రులకూ,బీదవాళ్ళూ, యాచనయే వృత్తిగాగలవాళ్ళూ, అడుక్కునేవాళ్ళూ. కానీ కాని చొప్పున యాచించుకోడానికీ ఎన్నో ఆశలు మనస్సులో పెట్టుకుని రోజూ వేలాది వచ్చి పోతూ ఉంటారు. కాని వాళ్ళ ఆశలు నిరాశలైపోతాయి. వాళ్ళు కల్పించుకున్న భావ చిత్రాలు ఎండమావులైపోతాయి. ఇదివరకే నిరాశతో అల్లలాడుతూ జీవితం భగ్నం అయిపోయిన దౌర్భాగ్యులతో వెంటనే కలిసిపోతారు.

ఇంతగా వర్ణించవలసిన అవసరంలేదు. కలకత్తా నగరానికి ఈ దారిద్ర్యం ఒక ప్రత్యేక లక్షణమే అయిపోయింది. ఈ దౌర్భాగ్యులు చింకిరి గుడ్డలు వ్రేలాడుతూంటే రోడ్ల ప్రక్క పేవ్‌మెంటుమీదా, పాకలలోనూ ప్రాకులాడుతూ ఉంటారు తినడానికి ఏమైనా దొరుకుతుందేమోనని పెంటకుప్పలుతిరగదోస్తూఉంటారు. ఉదయానికో, లేకపోతే మధ్యాహ్నపుఎండకో, ఆకలి భరించలేకో, రోగంచేతో ఒకరికో ఇద్దరికో ప్రాణంపోతుంది దారినిపోయేవాళ్ళు మామూలుగానే ఈశవాలను చూస్తూనే పోతూఉంటారు అవి వారి దృష్టిని ఆకర్షించలేవు. ఈచావులకు కారణమేమని తెలుసుకోవాలనే శ్రద్ధ ఎవరికీ అక్కరలేదు.

ఈ సమస్య ఎంతో నిస్పృహ కలిగిస్తూ ఉంది. అందులో సామాన్యజనులు కలగజేసుకుని ఏదైనా సాయం చేయడానికి శక్తిహీనులైపోయారు. కాని నిజంగా కొందరున్నారు. వారికి అధైర్యంలేదు భయపడరు. అసహ్యించుకోరు. చూడరాని రోగాన్నీ, దుర్భరమైన దారిద్ర్యాన్నీ నిర్మూలించడానికి నిర్భయంగా ఎదుర్కొంటున్నవారు వాస్తవంగా కొందరున్నారు. ఇలాంటివాళ్ళ సమాజం ఒకటి ఉంది అందులోనివారు ధర్మ ప్రచారకులు అని పిలవబడుతూ ఉన్నారు. ఆ సేవక సమాజానికి ఒక ఎన్నదగిన వ్యక్తి నాయికత్వం వహిస్తూ ఉంది. ఆ వ్యక్తిని మీకు పరిచయంచేయడంవల్ల నేను ధన్యురాలను. ఆమెయే మదర్ తెరసా. ఆమె ఒక కేథలిక్కు మతసేవిక. ఆమె స్వదేశం ఆల్బేనియా ఒక చిన్న మనిషి. పొట్టీకాదు. పొడుగూకాదు. అంతగా లావుగా ఉండదు. కాని ఆమె సామర్థ్యాన్ని విరజిమ్ముతూ, నిస్వార్థంగా. ప్రతిఫలాపేక్షలేని శ్రమపడుతూ నిరంతరసేవా నిమగ్నయై కాలం గడుపుతూంది. ఎల్లప్పుడూ ఆమె చిరునగవులో ఆప్యాయత, కళ్ళల్లో కరుణరసం తొణికిసలాడుతూ ఉంటుంది.

మదర్ తెరసా భారతదేశాన్ని తనస్వదేశం చేసుకుంది. మొదట ఆమె 1929 వ సం॥లో ప్రఖ్యాతి చెందిన ఒక ఉపాధ్యాయ సంఘంతో వచ్చింది. తరువాత పందొమ్మిది సంవత్సరాలపాటు బెంగాలీబాలికలకు విద్యగరపుతూ ఉండేది. ఆ బాలికలందరూ చాలా బీదకుటుంబాలలోనుంచి వచ్చినవారే. అప్పటికప్పుడే చెప్పరాని దారిద్ర్యం అనుభవిస్తున్న పేదవాళ్ళ జీవిత చిత్రాలు ఆమె మనస్సును బాధపెడుతూ ఉన్నాయి. ఈ బీద విద్యార్థినుల అనుభవాలు దుస్సహం చేశాయి దరిద్రులకు సహాయపడవలెననే కోరిక మెల్లగా తల యెత్తింది ఆమెలో. తమవంటి బీదలకు సహాయ పడవలసిందని ఆపిల్లలు ఆమెను అర్థించారు ఈ బాలికలు ప్రోత్సహించారు. తనలో సహజంగాఉన్న ప్రేమ చివురించింది. ఆమె తన అధ్యాపక వృత్తిని విరమించి, అంతకంటె ముఖ్యమైన ఈ సేవావృత్తిని స్వీకరించడానికి పురికొల్పబడింది.

1948 వ సంవత్సరములో మదర్ తెరసా ఈ క్రొత్త పథాన్ని అనుసరించడానికి అనుమతి పొంది మొదట వైద్యం నేర్చుకొని సమర్థమైననర్సుగా తరిఫీదుపొందినది. సాహసికలైన కొందరు స్త్రీలు ఆమెను అనుసరించారు

1953 సంవత్సరానికి ఈ క్రొత్త పథంలో 29 గురు యువతులు తయారయారు. ఇవ్వాళ 44 గురు ఉన్నారు. అందులో ఇద్దరు ఇంగ్లీషు వనితలు. ముగ్గురు ఆంగ్లో ఇండియనులు. తక్కినవారు బెంగాల్ దేశానికీ, దక్షిణ దేశానికీ చెందిన మహిళలు.

వెంటనే అందరికీ తెలిసిపోయింది— పేదబెంగాలీ స్త్రీలు ధరించు తెల్లని ముతక చీరలు కట్టుకుని, ఆకు చెప్పులజోడు ధరించి, పేదవారి జీవితాన్నే గడుపుతూ ఉన్న ఈ కరుణ మూర్తులు రోగాలకీ, వ్యాధులకీ భయపడరనిన్నీ. ఎటువంటి కష్టతరమైన సహాయం చేయడానికైనా సిద్ధపడతారనిన్నీ అందరూ తెలుసుకున్నారు. అప్పుడు కలకత్తా కార్పొరేషనువారు మరణావస్థలోనున్న దరిద్రులను రక్షించే కార్యభారం వీరి మీద మోపారు. ఒకప్పుడు కలకత్తా వీధులలో దరిద్రుల శవాలు పరిపాటి. కార్పొరేషన్‌వారు మదర్ తెరెసాకు కాళీఘట్టంలో దేవాలయం దగ్గరగా ఒక ధర్మసత్రం ఇచ్చారు. వీధులలో మరణావస్థలో ఉన్నవారిని ఇక్కడకు చేర్చి తగిన పరిచర్యచేసి తిరిగి ప్రాణరక్ష ఇస్తారు లేకపోతే దిక్కుమాలినచావు చావలేక వేదనపడుతున్నవారికి అసరా ఉన్నదన్న సంతృప్తినైనా కలగజేస్తారు.

మదర్ తెరెసా తన అనుచర బృందంతో ఈ ఉద్యమాన్ని భయంకరమైన బస్తీ ప్రాంతాలలో మొదలుపెట్టారు. తమశ్రద్ధను కాబోవు భారతపౌరులైన బాలబాలికల మీద వినియోగించ నారంభించారు. ప్రస్తుతం ఈ సంస్థ ఆధ్వర్యంలో ఎనిమిది పాఠశాలలు ఉన్నాయి. ఒక ఇండస్ట్రియల్ స్కూలు ఉంది జాతిమత వివక్షత లేకుండా బిడ్డలందరికీ శిక్షణ ఇస్తారు. ఏడు ఆసుపత్రులు నడపబడుతున్నాయి. అక్కడ ఉచిత వైద్యము చేస్తూ ఉచితంగా మందులు ఇస్తారు. 1950 సం॥లో ఇక్కడ 11,000 మంది రోగులకు వైద్య సహాయం జరిగింది. 1953 వ సం॥లో ఈ సంఖ్య 41,134 కి పెరిగింది.

కాళీఘట్టమునందున్న వసతిగృహంలోని ప్రతిరోగి ఆహారవిషయికమైన జబ్బుతో బాధపడేవాడే. ఇంకా ఉన్న ఏదో ఏదో రోగాలవల్ల గడ్డుగా తయారయినవాడే. క్షయ, కేన్సరు, పాండు మొదలైన రోగాలతో ఎక్కువగా బాధపడుతూ ఉంటారు. ఇవి నివారించడానికి కొంత వ్యవధి పడుతుంది. ఖరీదైన మందులు కావాలి. ఈ అవసరాలను తీర్చడానికి కలకత్తా కార్పొరేషన్ వారిచ్చు గ్రాంటు నెలకి వెయ్యిరూపాయలు ఎంతమాత్రం చాలవు. తక్కిన అవసరాలకు విరాళాలు ధనరూపంగానూ, వస్తురూపంగాను సేకరించవలసివస్తూంది ఎంత చిన్న సహాయమైనా కృతజ్ఞతాపూర్వకంగా స్వీకరిస్తారు ఎందుచేతనంటే, ధనం లేకపోతే ఈసత్కార్యాచరణకు ఆటంకం ఏర్పడుతుంది. ప్రతి మానవునికి ప్రాథమికావసరాలైన మంచిగాలి, శుభ్రమైన ఇల్లూ, ఆహారము, మొదలైన మంచి జీవన పరిస్థితులు ఉండాలని న్యాయంగా తర్కించి ఆలోచింపు వారందరూ నమ్ముతారు. అప్పుడే

## ఐచ్ఛికసేవకు తోడ్పాటు

భారతదేశం మొత్తంమీద **1953-54** సం॥లో **632** స్వచ్ఛంద సంక్షేమసంస్థలకు గ్రాంటులు మంజూరు చేయబడ్డాయి. అందు **605** సంస్థలకు గ్రాంటులురొక్కం ఇవ్వబడింది. **27** సంస్థలు మాత్రం అనుకున్న షరతులు ఆచరణలో పెట్టలేకపోవడం వల్ల మంజూరయిన గ్రాంట్లు రద్దయిపోయాయి.

**1954-55** లో ఇంకొక **375** సంస్థలకు గ్రాంటులు మంజూరు అయాయి. **348** సంస్థలకు మాత్రం సొమ్ము రొక్కంముట్టింది. ఒప్పందం ప్రకారం నిర్వర్తించ లేకపోవడంవల్ల **27** సంస్థల గ్రాంటులు రద్దయాయి.

మానవుని శరీరం ఆరోగ్యంగా ఉండి దానితో అంతకంటె ముఖ్యమైన ఆరోగ్యకరమైన మనస్సు ఉండడానికి వీలు ఉంటుంది. ఒక కుటుంబంయొక్కగాని, ఒక రాజ్యం యొక్కగాని సంక్షేమ విషయమై, తల్లిదండ్రులుగాని ప్రభుత్వంగాని తమ విధులను సక్రమంగా నిర్వహిస్తున్నారంటే వారు ఈవిషయాలను ముఖ్యమైనవిగా గమనిస్తున్నారన్నమాట. ఇక్కడ కలకత్తాలో పరిస్థితుల అపారమును ప్రభుత్వం ఒక్కటే తనంతటతాను చక్కబెట్టగలగడం అసాధ్యం. వ్యక్తుల సహాయం, స్వార్థత్యాగం, వ్యక్తిగత ఆకాంక్ష ప్రభుత్వం అపేక్షిస్తూ ఉంది. వీటి అన్నిటికంటె అదనంగా ప్రజానమూహాలలో గొప్ప మానసిక పరిణామాన్ని కాంక్షిస్తూ ఉన్నది. తమ భోగాల కోసం విచ్చలవిడిగా ఖర్చుపెట్టే ధనికుల రాతి హృదయాలు, తమకూ తమ బిడ్డలకూ ఒక్కపూట అయినా చాలినంత తిండి పెట్టలేక ఆకలి మంటలచేత మరణానికి సమీపంగా చేరుతున్న దౌర్భాగ్యుల దుస్థితికి కరుగుతాయా? మహదారోగ్యంతో, సౌష్ఠవమైన శరీరావయవాలతో, సంసారసుఖంతో, అనేకబంధుమిత్రులస్నేహానుబంధాలతో హాయిగా సౌఖ్యం అనుభవిస్తున్న అదృష్ట వంతుల హృదయాలలో ఈనిర్భాగ్యులగూర్చి తలపు ఒక సారైనా కలుగుతుందా? దుస్సహమైన బాధలు అనుభవిస్తూ, వికలాంగములతో దిక్కుమాలి అటమటించే వారికై ఒక్క కరుణ బాష్పం వారి కంట రాలుతుందా?

---

# ఆచరణలో సంక్షేమం

1955 సంవత్సరం ఫిబ్రవరి 26 వ తేదీన మైసూరు రాష్ట్రంలో హసన్‌జిల్లా, హసన్ తాలూకాకు చెందిన శాంతిగ్రామంలో హఠాత్తుగా కలరా వ్యాధి వ్యాపించింది. హఠాత్తుగా సంభవించిన ఈ ఉపద్రవానికి గ్రామం అంతా విస్తుపోయింది. గ్రామంలో ఎటుచూసినా భయాందోళనలతో అట్టుడికిపోయింది. ఈ భయంకర వ్యాధినుంచి తప్పించుకొనడానికి కొందరు గ్రామాన్ని విడచి పారిపోయారు. కొందరు ఏమిచేయడానికీ పాలుపోక, ఉన్నచోటనే భయంతో వుండిపోయారు. తొలినాడే ఇద్దరు ఈవ్యాధికి బలికావడంతో ప్రజలలో మరింత ఆందోళన, నిస్పృహ వ్యాపించినాయి.

ఆవూరికి ఒకే ఒక్క డాక్టరువున్నాడు. అతనితో పని చేసే వ్యక్తి ఈ అంటువ్యాధి తనకికూడా సోకుతుందేమో ననే భయంతో చల్లగా ఆవూరు విడిచి వెళ్ళిపోయాడు. డాక్టరు తన శక్తివంచనలేకుండా కలరాని అరికట్టడానికి ప్రయత్నించాడు. కాని ఈ వ్యాధి నిరోధానికి పనికివచ్చే మందులు అతనిదగ్గర తగినంతగా లేకపోయాయి. అందుచేత వ్యాధి సోకినవారికి చికిత్స చేయడంకాని, వ్యాధి వ్యాపించకుండా అరికట్టడంకాని అతనికి తలకుమించిన పని అయిపోయింది డాక్టర్‌కి తోడుపడేవారు కాని, మందులు సరఫరా చేసేవారుకాని లేకపోయారు.

దీనికితోడు మహామారి దేవతకి ఆవూరివాళ్ళమీద కోపం వచ్చిందనీ, ఆకోపం నరబలితోకాని తగ్గదనీ, అందుచేతనే కలరా మహామారి రూపంలో మనుష్యుల్ని తీసుకుపోతూన్నదనీ, ప్రజలలో మూఢ నమ్మకం బాగా పాతుకుపోయింది. నరబలి కాకపోతే దానికి తగినంత కోడిరక్తాన్నిచ్చినా ఆ దేవత తృప్తిచెందుతుందకాని, వ్యాధిని అరికట్టడానికి ఏవేవో క్రొత్తపద్ధతులు మొదలుపెడితే ఆమె మరింత రెచ్చిపోతుందనీ, మరింత మంది జనం చచ్చిపోతారనీ ప్రజలలో గుసగుసలు బయలుదేరాయి!— అందుచేత ఆవూళ్ళో జనం నిస్సహాయంగా భారమంతా మహామారిదేవతమీద వేసి ఊరుకున్నారు!

సరిగా ఈసమయంలోనే శాంతిగ్రామ ప్రణాళికా నిర్వాహక సంఘంవారు రంగంలో కురికారు. ఈ అంటువ్యాధి తల ఎత్తిన రోజుకి ఒక నెల ముందు మైసూరు రాష్ట్ర సాంఘిక సంక్షేమ సలహా సంఘంవారు శాంతిగ్రామంలో ప్రణాళికా నిర్వహణ సంఘాన్ని స్థాపిం

చారు. ఈ సంఘంవారు కలరా వ్యాధి సోకిన వారికి చికిత్స చేస్తూ, ప్రజలలో ధైర్యంకలిగే టట్లు రాత్రింబవళ్ళు కష్టపడి పనిచేయసాగారు. సంఘసేవా రంగంలో క్రొత్తగా ప్రవేశించిన శ్రీమతి పద్మా శ్రీనివాసాచార్, మరి ముగ్గురు గ్రామసేవికల సహాయంతో ఆగ్రామ డాక్టర్‌కి సహాయంగా వెళ్ళి, ఏయే మందులు కావాలో తెలిసికొని, వ్యాధి నిరోధానికి పనికివచ్చే పది వందల సల్ఫోనలమైడ్ మాత్రలు, ఏభై ఎనౌటాగోన మైడ్ మాత్రలూ, తన స్వంతపైకంతో కొని డాక్టర్‌కి ఇచ్చింది. ఆడాక్టర్ ఆధ్వర్యాన, గ్రామసేవికలతో కలసి ఆమె వ్యాధి సోకినవారి ఇండ్లకు వెళ్ళి, స్వయంగా రోగులకి మందులు ఇచ్చారు. కలరావ్యాధి వ్యాపించ కుండా, ఆహారం విషయంలోనూ, త్రాగేనీటి విషయం లోనూ, నివసించే పరిసరాల విషయంలోనూ ఏవిధంగా నిరోధక చర్యలు తీసికోవాలో అందరికీ బోధించారు.

## గ్రామాభ్యుదయంకోసం ఏమిచేశాము?

భారతదేశం అన్ని రాష్ట్రాలలోను ఇప్పటికి 201 సంక్షేమ విస్తరణకార్యక్రమాలు ప్రారంభించబడ్డాయి. ఈ ప్రణాళికవల్ల ఇంతవరకు 3,165 గ్రామాలకు సహాయం సమకూరింది. 875 కేంద్రాలు పనిచేస్తున్నాయి. 40,52,319 మంది ప్రజలకు హితం జరుగుతూఉంది. 1707 గురు గ్రామీణప్రజలకు పనులుదొరికాయి.

1955-56 సం॥లో ఇంకొక 151 కార్యక్రమాలు ప్రారంభింప బడగలవు. సంక్షేమవిస్తరణకై రు. 1,50,00,000 లు ఖర్చగును.

అవూరి హెడ్మాష్టరుగారి సహాయంతో — ఆయన ఆమె భర్తే!— వీధి వీధికీ వెళ్ళి డి. డి. టి. తో క్రిములు చేరకుండా ఏవిధంగా చేయాలో స్వయంగా పరిశీలిస్తూ అందరికీ తోడ్పడింది పరిశుభ్రతవల్లా జాగ్రత వల్లా ఈ వ్యాధిని ఏవిధంగా అరికట్టవచ్చునో ప్రజలకు సులభంగా అర్థమయేటట్లు వీరు చేసి చూపించారు. స్త్రీలు ఈవిధంగా నడుంకట్టి ముందుకు రావడంచూసి ఆవూరి పెద్దలు తమంతటతామే తమ సహాయ సహకారాల్ని వ్వడానికి సిద్ధమయారు. డి. డి. టి మందు చల్లడానికి హెల్తు ఇన్‌స్పెక్టరు వచ్చినప్పుడు అభ్యంతరం చెప్పిన పెద్దలే సంఘనిర్వాహకులు వచ్చినప్పుడు ఏమీ అడ్డు చెప్పలేము సరికదా వాళ్ళకి తోడ్పడ్డారుకూడా!

ఈవిధంగా గ్రామం నలుమూలలనుంచీ సహాయ సహకారాలు హృదయపూర్వకంగా రావడంతో కలరా వ్యాప్తి అరికట్టబడింది. మరణించేవారి సంఖ్య కూడా తగ్గి పోయింది.

క్లిష్టసమయంలో స్థానిక అధికారులకు తోడ్పడటం లోనూ, ప్రజలకి సేవచేయడంలోనూ శ్రీమతి పద్మా రంగాచార్ చేసిన కృషి ఎంతో ప్రశంసనీయమైనది— భయాందోళనలు చెందిన ప్రజలకి ధైర్యంచెప్పి, వారిలో ఉత్సాహం కలిగించి, ముందుకు నడిపించినదీమె. ప్రణా ళికా నిర్వాహక సంఘం స్థాపింపబడిన కొద్ది రోజుల లోనే ఒక మహత్తరమైన క్లిష్టసమస్యని ఎదుర్కొన వలసివచ్చింది. శ్రీమతి పద్మారంగాచార్ ఆధ్వర్యాన జయప్రదంగా ఈసమస్యను పరిష్కరించ కలగడం ఎంతో ముదావహమైన విషయం. ఇది ఒక శుభ సూచన.

కేంద్రసంఘ సంక్షేమ సంస్థవారిచే ప్రజోపయోగ కరమైన పనులు చేయడానికి స్థాపింపబడిన ఈ అనుబంధ సంస్థ తమ సౌఖ్యానికీ, అభివృద్ధికీ చేసే కృషికి ప్రజలు ఎంతో భక్తి ప్రపత్తులతో కృతజ్ఞత తెల్పుతూంటారు.

# మాదిగరాముడు

జోళ్లుకుట్టే గంగారాముడు తన జీవితంలో అనామధేయత్వం తప్ప ఇంకేమీ ఎరగడు. ఉయ్యాలలో పసిబాలుడుగా ఉన్నప్పుడు ఏవిధంగా ప్రపంచంతో సంబంధం లేకుండా ఉన్నాడో తన అరవయ్యో యేట ఇప్పుడుకూడా అలానే ఉన్నాడు — అనామికుడైన తండ్రికి అనామికుడైన కొడుకు.

అతడు కప్పుకున్న చింకిరి కోటు ఘోరమైన తలపాగా అనామికత్వానికొక ప్రత్యేక వ్యక్తిత్వం కలిగిస్తున్నాయి. చిక్కి శల్యమై, 'కరిగిపోతాయా' అన్నట్టు ఉన్న అతని చేతి వ్రేళ్ళు ఎండిపోయి కణుపులు దేరిన పుడకల్లాగు ఉన్నాయి. ఎన్నో సంవత్సరాల అంతులేని ఆవేదన అతని ముఖంమీద ముడతలుగా తయారయాయి. కాని ఓటమి ఎరుగని వీరుని అచంచలమైన శక్తి అతని శరీరాంతరాంతరములలో నున్నట్లు అతని కన్నులనుండి అవ్యక్తంగా ప్రస్ఫుటితమవుతూ ఉంది. మాటలకంటె తీవ్రంగా చెపుతాయా కళ్లు. దారిద్ర్యంతో పోరాడే ఈ అవ్యక్తమైన శక్తియే పారంపర్యంగా తమ పూర్వీకులు సంక్రమింపజేసిన అమూల్య వారసత్వం.

గర్వకారణమైన ఈ అమూల్య వారసత్వాన్ని గురించి గంగారాముడికి ఏమీ తెలియుదు. దినదినమూ, ఎండలోనూ, వానలోనూ, అతని చిన్నవ్యాపారాన్ని సాగించడమే అతని పని. అతని దురదృష్టాన్ని ప్రశ్నిస్తూ, నిందిస్తూ నిర్విరామంగా పనిచేయడానికి సంకోచించడు. అతనికి తెలిసినది ఒక్కటే. జీవనాధారంకోసం పాటుపడడం. కృషి అతనికి వేదార్థం; అతని వేదాంత భావం. అతని భావిజీవిత స్వప్నం.

గంగారాముడు సద్గుణ సంపత్తికి ఆలవాలంకాడు. టక్కరి కూడాను. అత్యాశాపరుడున్నూ. అసూయ, అసహనం, అసత్యం అతనిలో ఆవరించి ఉన్నాయి. త్రాగుబోతేమోకూడా! ముక్కోపికూడా కావచ్చు. తన సంతానాన్ని బాధపెట్టేవాడున్నూ కావచ్చు. అయినా అతడు ఏకైక వీరుడు. కులం, విద్యగలవారి పొగడ్తలుగాని, గౌరవంగాని, సహాయంగాని అపేక్షింపడు. తన జీవితమంతా కష్టాలను ఎదుర్కొని పోరాడడమే! తనతోడివారికి తనకి వీలైనట్లు సహాయపడడమే.

చెట్టు నీడన్నా లేకుండా మండుటెండల్లో రోడ్డు ప్రక్కను కూర్చుని శల్యాలు పైకివచ్చిన వ్రేళ్ళతో చెప్పులు బాగుచేస్తూ ఉంటాడు. అతను బాగుచేసే చెప్పులు ఎన్ని రకాలో, అతనివద్దకు వచ్చేవాళ్ళుకూడా అన్నిరకాలవాళ్ళున్నూ. అతనికి ధనికులకు పేదలకు తారతమ్యం లేదు. కులభేదం, మతభేదం లేదతనికి. ఏళ్ళతరబడి వచ్చిన కృషిఫలితమైన నేర్పరితనాన్ని అందరికీ అందిస్తాడు. వృద్ధులు, యువకులు, రోగులు, వికలాంగులు అందరికీ మాట్లాడకుండా పనిచేయడమే అతని పని.

సజాతీయులైన లక్షలాది జనులవలెనే అతనుకూడ కీర్తి నపేక్షింపడు. అతని నైపుణ్యాన్ని ఎవరూ గుర్తించనక్కరలేదు. రోజూ వేలాది ప్రజలు అతనిని దాటుకుంటూనే పోతారు. వారి దృష్టిపథంలోకి ఇతను రానేరాడు.

లేమి విషరదనమైన భయంకర పన్నగంలాంటిది. కాని శిరసుననుండే రత్నం అవలోకించే అదృష్టవంతు డెవడో!

— సి. వి. రమణి.



గృహిణి విధులతో సంఘ సేవా కార్యక్రమములు సమన్వయము చేయ గలిగిన ఆదర్శమహిళ

# శాంతికబీర్



ఈరోజున శ్రీమతి శాంతికబీర్ యొక్క దర్శనం వల్ల, పరులను సహృదయంతో అర్థం చేసుకుంటూ ఎదటివారిని వశ్యంచేసుకునే శక్తివంతురాలైన ఒక గొప్ప వ్యక్తియొక్క పరిచయభాగ్యం లభించింది. ఆ సహృదయత్వం సాంఘిక బాధితుల నిరంతరసేవానుభవ ఫలితం. ఆమె మృదుమధుర సంభాషణా, సహజమైన చలోక్తులూ మోయరాని కార్యభారాన్ని తేలికపరుస్తాయి. ఆమె ఆకర్షణలో నిండుతనము, పరిపూర్ణత, మృదుత్వము ఇమిడియున్నవి.

కలకత్తాలో విద్యనభ్యసించిన శాంతికబీర్ విద్యార్థిదశ నుండీ మన జాతీయ పోరాటంతో సన్నిహిత సంబంధం కలిగిఉండేవారు. వారు స్థాపించిన దీపావళీ ఛత్రీసంఘ మనే మహిళా సంఘము ప్రధానంగా జాతీయోద్దేశాలు కలిగియున్నది. దీపావళీ శిక్షామండలి అనే బాలికోన్నత పాఠశాలను ఆమె సోదరితో కలిసి స్వగృహంలోనే స్థాపించారు. కేవలం ఆర్థిక ప్రయోజనాలకోసమేకాక, ఆశయదృష్ట్యా అంతకంటె ఉత్కృష్టమైన స్వాతంత్ర్యం, స్వశక్తి, స్వయంపోషణ భావిభారతరమణులకు అలవడు నట్లు తయారుచేయుట యందేవారు ప్రత్యేక శ్రద్ధవహించారు. వనితాలోకాన్ని ఉద్దేశించి కావించిన మహాత్ముని పిలుపు ఆమెను రాజకీయరంగంలోనికి రప్పించింది. 1930 సం॥లోనూ, 1932 సం॥లోనూ నారీ సత్యాగ్రహ సమితికి శాంతికబీర్ కార్యదర్శినిగా పనిచేశారు.

ఆమె కార్యకలాపాలు, బహుముఖమైనవి. ఎన్నో అడ్డంకులనెదుర్కొని, సాంఘికసంక్షేమ సేవకై అచంచల విశ్వాసంతో కట్టుబడి నిలిచిపోయారు. ఆమెకు, ముఖ్యంగా, బాలికలను, వనితలను పడుపు వృత్తినుండి రక్షించే ప్రయత్నాలయందెక్కువ ఆసక్తి. ఈదురాచారమును గూర్చి తెలిసికొనుటకు ఆమెకు నీచాతి నీచమైన మానవస్వభావం గలవారితో సంబంధం ఏర్పడింది. అయినప్పటికీ వారు చూచినంతవరకు, గ్రహించినంతవరకు, ఈనైతిక పతనముయొక్క మాలిన్యమును ఎడతెగని ప్రయత్నమువల్లను, సక్రమవిధానమువల్లను శుభ్రపరచవచ్చునని వారినమ్మకము. జినివాలోని అంతర్జాతీయ పడుపువృత్తి నిర్మూలక సంఘమునకు అనుబంధింపబడిన నైతిక సాంఘికారోగ్య సంఘమునకు శాంతికబీర్ కార్యదర్శినిగా పనిచేయుచున్నారు.

విద్యార్థుల విద్యావిధానము, సంఘజీవనముపట్ల, తల్లిదండ్రుల్లకునూ, ఉపాధ్యాయులకును సన్నిహిత సహ

శ్రీమతి అమ్ము కృష్ణస్వామి

కారముండవలెనని ఆమెకు స్పష్టముగా తెలియును. ఈ పరస్పర సహకారమువల్ల శైశవంలో దృఢమైన నైతిక దృక్పథం ఏర్పడగలదని వారి నమ్మకము, ఈనమ్మకము వారు అమెరికా పర్యటించి వచ్చిన తరువాత మరింత దృఢమైనది. శిశువుల విద్యాబోధన ఉపాధ్యాయులబాధ్యత మాత్రమే అనుకొనుట పొరపాటని వారి విశ్వాసము. బాలురలోని అవినీతి నరికట్టుటకు తల్లిదండ్రులయు, ఉపాధ్యాయులయు పరస్పర సహకారము చాల సహాయ పడునని వారి అభిప్రాయం. ఈమె ఢిల్లీ రాష్ట్రసాంస్కృతిక చిత్రపట సంఘమునకు అధ్యక్షతవహిస్తున్నారు. దీనివల్ల మన దేశమునగల బిడ్డల విద్యకు ఉపయోగపడు వినదగిన విశేషములూ చూడదగిన చిత్రములూ వీనినిగురించి తెలుసుకొనుటకవకాశమేర్పడినది.

శ్రీమతి కబీరు దేశంలోని బిడ్డలకూ యువకులకూ సంబంధించిన బహుముఖ సంక్షేమ కార్యకలాపాలలో అత్యుత్సాహం ప్రదర్శిస్తున్నారు. ఈమె భారత యువజన వసతి గృహసంఘమునకు అధ్యక్షురాలుగా పనిచేస్తూ, యువజన సంక్షేమమునకూ, విద్యాభివృద్ధికీగల అవకాశ ములను పరిశీలించుటలో మిక్కిలి సహాయపడుచున్నారు. యువజనులలో సహనశక్తీ, సహజీవనమూ అలవాటు చేయుటకు, సుశిక్షితలైన వసతిగృహాధ్యక్షుల బృందము చాల అవసరమని ఆమె దృఢవిశ్వాసము.

వీటినిమించి శ్రీమతి కబీరు ఢిల్లీరాష్ట్ర సాంఘిక సంక్షేమసలహాసంఘ సభ్యురాలుగా ఉండి, మెహ్రౌలీ లోని సంక్షేమ విస్తరణ ప్రణాళికోద్యమంలో నిరంతర కృషిచేయుచున్నారు.

ఆమె దినచర్య అంతేకాదు. గృహవిషయకమైన వివిధ కృత్యాలు ఆమెకెన్నోవున్నాయి. ఇతర కార్య కలాపాలలో మునిగివున్నప్పటికీ, గృహలక్ష్మిగా, మాతృమూర్తిగా ఆవిడవిధులు మరునాటికి వాయిదావేయ దగినవికావు. ఆమె నిర్వహించవలసిన విధు లన్నిటియెడ, ఆమె నిరాడంబరమైన సంభాషణల యెడ, ఆమె సాధించిన విజయములయెడ, ఆమెకుగల నిశ్చలనిమగ్నత నాకు ఆశ్చర్యమును కలుగజేసినదని ఒప్పుకొనకతప్పదు. ఇన్ని సంవత్సరముల సాంఘికసేవ వల్ల, చదువుకొన్న స్త్రీసంక్షేమసేవికల సమస్య అనగా గృహిణీ విధులతో సేవాకార్యక్రమ సమన్వ యము నెట్లు సాధించవలెనో ఆమెకు అనుభవ మైనది. కబీరు సతీమణికి ఇద్దరు బిడ్డలుకలరు. ఇటు వారి పోషణ, అటుసంఘసేవ - ఈరెంటినిసవ్యముగా నిర్వహించారు. తల్లి స్వయంగా దగ్గరవుండి పిల్లలవద్దనే ఎల్లప్పుడూ తనకాలమును వినియోగించవలసిన సమయ ములలోకూడా సాంఘికసంక్షేమ కృషియందు ఆసక్తిగల ప్రతిస్త్రీ ఆపనికై కొంతకాలము వినియోగించుట అవసర మని ఆమె నమ్మకము. ఆయాకార్యములకు కొంత కాలము వినియోగించుటకు వీలును కలుగజేసుకోవలెనని ఆమె యభిప్రాయము. మన పవిత్ర విశ్వాసములకు దోహము కలుగకుండా ఉండాలి అంటే సంఘసేవిక తన యిష్టంవచ్చినప్పుడు చేస్తూ, యిష్టం లేనప్పుడువదలి వేస్తూ ఉండుటకుతగిన పనికాదిది అని వారి నమ్మకం.

ఆమెతో ఒకగంటకు పైగా మాట్లాడిన తరువాత నేను మొదట చెప్పినట్లు ఆమె వ్యక్తిత్వమును సరిగావిశదీ కరించగలిగితినోలేదో ! నేను ఆమెవద్ద సెలవుతీసు కున్నాను. ఆమె మృదువైనదేకాక పరిపూర్ణత కలిగినదనీ అనుకున్నాను. తన జీవితావసరములకు కల్పించుకొన్న విధులను, వ్యక్తిగతమైన అభిరుచులయు సమ్మేళనమే ఆమెలో సంపూర్ణంగా ఐక్యమందినవి. ఆమె తలపెట్టిన కార్యం సవ్యంగా సాధించి, కృతకృత్యయై జీవితం సఫలం చేసుకున్నందుకు ఎంతో ఆనందం



ప్రఖ్యాత న్యాయవాది ....
ప్లానింగు కమిషనుకి స్వస్తి చెప్పింది.

# పదవికంటే మానవసేవే ముఖ్యం

సి. ఎలిజబెత్ హన్స్‌వర్త్
(క్రిస్టియన్ సైన్సు మోనిటర్, యు.ఎస్.ఏ.)

ఆటోమేటిక్ లిఫ్టుకోసం స్విచ్చి నొక్కి చూసి సమాధానం లేక పోవడంవల్ల సంతృప్తిగా.... "రండర్రా. మెట్లెక్కి వెడదాం" అంటూ దారితీసింది శ్రీమతి చింతామన్ దేశ్‌ముఖ్. సిలోన్ కొత్త గవర్నర్ జనరల్ సర్ ఆలివర్ గుణతిలక్ అతిధులుగా దేశ్‌ముఖ్ దంపతులు క్వీన్స్ హౌస్‌లో బసచేసిన సందర్భంలో జరిగిన సంఘటన యిది.



సిలోన్ బ్రిటన్ పాలనక్రింద వున్నరోజులలో.... యీ పాలరాతి మేడమెట్లమీదనుండి గాలిలో తేలి పోతూన్నట్లు బుట్టగౌనులతో అందాల సుందరాంగులు దిగేవారు. యీ వెడల్పాటి పాలరాతిమెట్లు వారికోసమే అలా కట్టబడ్డాయేమో ! ..నాముందు మెట్లెక్కుతున్న పుష్టిఅయిన విగ్రహాన్ని చూస్తూంటే యీసంగతులే జ్ఞాపకంవచ్చాయి. మోటయిన చేనేత నూలుచీర. నల్లటిజుట్టు చుట్టగా చుట్టినా. వదులయి జారిపోతూ వుంది.... నిండైన దినచర్య ముగిసిన తరువాత అలసిన శరీరంతో మెట్లెక్కుతున్నది — శ్రీమతి దుర్గాబాయి.

సిలోన్ స్వఛ్ఛందసేవా సంస్థల ప్రతినిధులతో యీమె మాట్లాడుతూంటే యింతకుముందే ఎంతో

# పదవికంటే మానవసేవే ముఖ్యం

ఆసక్తితో విన్నాను. గాంధీజీ స్వాతంత్ర్యోద్యమంతో తాను వహించిన పాత్రా, జీవితంలో ఒక శిఖరాగ్రాన్నందుకున్నట్లు — నేషనల్ ప్లానింగుకమిషన్ సభ్యత్వాన్ని వదలి సంక్షేమ సంస్థాధిపత్యానికి రావడం మొదలైనవాటిని గురించి చెప్పిందామె. ప్రభుత్వంచేతనే స్థాపింపబడ్డ యీ సంస్థ స్వచ్ఛందసేవాసంస్థ. దేశం మొత్తంమీదనున్న స్వచ్ఛంద సేవాసంస్థలను కూడకట్టి సంక్షేమ కార్యక్రమాలని దేశం మొత్తంమీద వ్యాపింపచేయడమే యీ సంస్థ ఆశయం.

సెప్టెంబరు మాసాంతంలో అమెరికాకు ప్రయాణమైన దుర్గాబాయికి, తాను చేస్తూన్నపని అమెరికన్ స్త్రీలకి నచ్చుతుందనీ, దేశాభివృద్ధికి స్వచ్ఛంద సంస్థలనుండి శక్తిని కూడగట్టి పనిచేయించడమన్నది — పైనుంచి ప్లాన్ చేసుకురావడంకంటె కష్టం అనీ, ముఖ్యం అనీ, దుర్గాబాయి నమ్మకం. అందుకే గౌరవనీయమైన స్థానం వదలి మళ్ళీ ప్రజలమధ్య తిరిగి పనిచేయడానికి వచ్చేసింది.

పార్లమెంటుసభ్యురాలుగా వున్నప్పుడుకూడా సాంఘిక జీవితానికి తనకెప్పుడూ ఎక్కువ అవకాశం లేకపోయిందని శ్రీమతి దేశ్‌ముఖ్ చెప్పింది. ఆరోజులు జ్ఞాపకం తెచ్చుకుంటూ, ఆరోజులలో జరిపిన ఒక సంఘటనను చెప్పిందామె. తాను స్పీకరు కుర్చీ ఆక్రమించుకొని కూర్చున్న సందర్భంలో ఒక సభ్యుడు "మిస్టర్ స్పీకర్, సర్" అని సంబోధించాడు. సభ్యులంతా నవ్వేశారు. దానిలో మొదటి సభ్యుడు చిన్నపుచ్చుకుని, ప్రస్తుతం స్పీకరును ఎలా సంబోధించాలో రూలింగు ఇమ్మన్నాడు. తక్షణం దుర్గాబాయి రూలింగు యిచ్చింది. "మీరు నన్ను కాక, స్పీకరు కుర్చీనికదా సంబోధించేది? అంచేత ప్రస్తుతం నన్ను సర్ అని పిలవచ్చు" అంది. మళ్ళీ సభ్యులంతా నవ్వుతుంటే, "ఆర్డర్, ఆర్డర్. కానివ్వండి" అందరికీ దుర్గాబాయి గొంతు వినిపించింది. అంతే.

కట్టుదిట్టమైన నడవడికా, అభ్యుదయమూ దుర్గాబాయి జీవితంలో బలవత్తరమైన ఆశయాలు. వీటికి తోడు అణగద్రొక్కబడ్డవారంటే అపరిమితమైన ఆదరణా అనురాగమూ వున్నాయి యీమెకి.

పదమూడేళ్ళ వయసులోనే గాంధీజీ ఆకర్షణలో పడింది. ఎల్లవేళలా తనకి సేవచేయడానికి సిద్ధంగావున్న యీబలమైన చిన్న పిల్లని చూస్తే గాంధీకి అభిమానం.

సివిల్ డిస్‌ఒబీడియన్సు ఆందోళనలో పాల్గొని జైలుకి వెళ్ళింది. ఆనాటి యీమె వయస్సు యిరవై. మొత్తం రెండున్నర సంవత్సరాల జైలు జీవితం చూసింది. చివరిసారి జైలులో వున్నప్పుడే వురితీసే గది ప్రక్క గదిలో వుండే భయంకర అవకాశమూ, ఉరిశిక్షకోసం వేచియున్న తల్లీకూతుళ్ళతో మాట్లాడే అవకాశమూకల్గాయి. ఆరాత్రినుండే ఒక దృఢ నిశ్చయం కల్గింది ఆమెలో. ఎలాగైనా చదువుకొని నిరక్షరాస్యులూ, నిరాడంబరులూ అయిన సామాన్యుల సేవలో జీవితం గడపాలని. మొట్టమొదట యింగ్లీషులో వ్రాయనూ చదువనూ నేర్చుకోవలసి వచ్చింది. అంతటితో తృప్తిపడక బి.ఏ., ఎం.ఏ., డిగ్రీలు సంపాదించింది. తుదకి బారిస్టరు పరీక్షలో నెగ్గింది. స్వయంశక్తివల్ల వన్నెకివచ్చిన మహిళ. 1942-52 దాకా మద్రాసులో చక్కటి ప్రాక్టీసు సమకూర్చుకొని మద్రాసులో ప్రముఖలాయరయింది.

1952 లో ప్లానింగుకమిషన్ సభ్యురాలుగా కేంద్ర ప్రభుత్వం యీమెను నియమించింది. ఈసందర్భంలో యీమె పని - చదువూ, ఆరోగ్యం, వెనుకబడ్డజాతుల సముద్ధరణా, నివాస, కార్మిక, పునరావాస రంగాలే కాకుండా, పబ్లికు కోఆపరేషను వరకూ వ్యాపించియుంది. ఈరోజు సాంఘికసంక్షేమసంస్థాధిపతిగా యీరంగాలలోనే పని అయినా ఒకతేడామటుకు వుంది: ఆరోజులలో ఉట్టి ప్లానింగే, కాని యీనాడు, ప్లానుచేసినది అమలులో రాణించేలా చూడడం.

చేనేత ముతక చీరలో ఆవ్యక్తి, బలంగా కన్పించే ఆచేతులు గమ్మత్తుగా కట్టుకుని - ఆమె ఎప్పుడూ కోరుకొనేటట్లే - దుర్గాబాయి ప్రజలమనిషిలాగే కన్పిస్తుంది. కాని గంభీరమైన ఆగొంతూ, వచ్చేమాటలూ వాక్యాలూ, వింటే — దేశ మహిళాభ్యున్నతికోసం సర్వశక్తులూ వినియోగించకలేదీ, నమ్మికయుంచదగినదీ అయిన మనిషి - యిదిగో యిక్కడవుంది అనిపిస్తుంది.

దేశ రాజకీయరంగంలో అత్యంత ఉత్సాహాన్నీ ఉద్రేకాన్నీ కల్గించిన విషయం — క్రితంలో దుర్గాబాయి చింతామన్ దేశ్‌ముఖ్‌ను వివాహం చేసుకొన్న సందర్భం. సర్ చింతామన్ దేశ్‌ముఖ్ పూర్వపు ICS. వ్యక్తి. ఆయన వయస్సు 57. ఆమె వయస్సు 46. వీరి అమెరికా ప్రయాణం అందరిక్కీ సంతోషదాయకం. ప్రఖ్యాత ఆర్థిక శాస్త్రవేత్తగా శ్రీ దేశ్‌ముఖ్, ఏస్త్రీజనం అయినా ఆదరించి గౌరవింపదగ్గ స్త్రీత్వం కలదిగా శ్రీమతి దుర్గాబాయి,.... అమెరికాస్త్రీలు వారిని గౌరవించడమే ఒక గౌరవంగా ఎంచుతారు.

# మహిళాసమాజము, నిడదవోలు

ఈసమాజము స్థాపించి యిప్పటికి ఐదు సంవత్సరములైనది. ఇది మొదట కొన్ని సంకుచితమైన ఆశయములతో ప్రారంభించబడినప్పటికిని, దాని ఆశయములు క్రమక్రమముగా విశాలము అగుటకు అవకాశము ఏర్పడుచున్నందుకు సంతోషము కలుగుచున్నది. ఇది యీ నాలుగు సంవత్సరములనుండి స్త్రీలయొక్క శారీరక, మానసిక ఉన్నతికి పాటుపడుచున్నది. ఈ 20 వ శతాబ్దములో ఆధునిక యంత్రములు అభివృద్ధిపొందిన యీ కాలములో పాఠశాలలు కాలేజీలు పెరిగిన యీ పరిస్థితులలో కూడ ప్రతి సంవత్సరము కొన్ని లక్షలమంది నిరుద్యోగులు ఉండు స్థితి తొలగుటలేదు దీనికి కేంద్రీయ పరిస్థితులే కారణమని గాంధీ మహాత్ముడు వికేంద్రీకరణ పద్ధతులద్వారా రాట్నము మొదలైన కుటీర పరిశ్రమలే ఆవశ్యకములని ఉద్ఘోషించెను. అందువలన స్వయంపోషణకు వీలుగా ఇందు చేతి పనులకు ప్రాధాన్యమీయబడినది. ఇందు సమాజ బాలికలు కాక ఇతర స్త్రీలు కూడా చేతి పనులు నేర్చుకొనుచున్నారు. ఈ సమాజ పక్షమున 40 రాట్నములు పనిచేయుచున్నవి. దీనికి శాఖగా తాడేపల్లిగూడెం గ్రామములో గూడ రాట్న పరిశ్రమ జరుగుచున్నది.

రాజమండ్రి ఖాదీ బోర్డు వారిచే నేయించబడిన వస్త్రములు, స్థానికముగా నేయించబడిన వస్త్రములు కలిపి మొత్తము 800 గజములబట్ట యీ సమాజముద్వారా తయారైనది. ఈ సమాజము చుట్టుపట్ల గ్రామములవారికి కూడ ఏకులు, రాట్నములు వారికి కావలసిన పరికరములు సప్లయి చేయుచున్నది. దీని ద్వారా ఒక గ్రంథాలయము, ఒక హిందీ పాఠశాల, వీలునుబట్టి బీదల కప్పుడప్పుడు అన్న వస్త్రముల నిచ్చుట మొదలగునవి జరుపబడుచున్నవి. ఇందు సుమారు 25 మంది బాలికలు నిత్యము వచ్చి ఏకులు చేయుట, నూలు తీయుట, కుట్టు మిషనుమీద దుస్తులు కుట్టుకొనుట, హిందీ నేర్చుకొనుట చేయుచున్నారు. దీనిలో తెలుగు, సంస్కృతము, సంగీతము మొదలగునవి కూడ నేర్పవలెనని ఉద్దేశము కలదు. కాని ధనాభావము చేతను, స్థలాభావముచేతను ఆపనులు జరుగుటలేదు. ఈ సంవత్సరము ప్రాథమిక పరీక్షలో 12 గురు, మధ్యమ పరీక్షలో 10 మంది, రాష్ట్రభాష పరీక్షలో 4 గురు ఉత్తీర్ణత నొందిరి. ఫిబ్రవరిలో ప్రాథమికకు ఇద్దరు, మధ్యమకు ఆరుగురు, రాష్ట్రభాషకు 4 గురు హాజరయిరి. వారి పరీక్షా ఫలితములింకను వెలుపడలేదు.

1954-55 సంవత్సరములలో ఈ సమాజమునకు స్థానికముగా ఒక వేయి రూపాయలు విరాళములుగా పోగుచేయు షరతుపైన కేంద్ర సంక్షేమ బోర్డువారు చేతిపనుల అభివృద్ధి నిమిత్తమై ఒక వేయి రూపాయలు విరాళమిచ్చిరి. ఈ సమాజమువారు స్థానికముగా ప్రోగు చేసిన వేయి రూపాయలతోను సమాజమునకు నివేశన స్థలము కొనవలసియున్నది. ప్రస్తుతము కొంత నివేశన స్థలము కొనబడినది. ఇంకను కొంత నివేశనస్థలము కొనుటకు ప్రయత్నము జరుగుచున్నది. ఇప్పుడు యీ సమాజ కార్యక్రమమంతయు నిడదవోలు పంచాయితీ గ్రంథాలయమునందు జరుగుచున్నది. ఈ సమాజము చేయు కార్యక్రమములకు అది సరిపోకపోవుటచేత సమాజమునకు ఒక భవనము నిర్మింపవలసిన అవసరము కలదు. అందుకుగాను యిదివరకు విరాళములిచ్చిన దాతలును, తదితరులును ఉదారముగా విరాళములిచ్చి తమ బాలికలను సమాజ పాఠశాలకు పంపి ఈ సమాజ కార్యక్రమములను జయప్రదమగుటకు తోడ్పడగోరుచున్నాము.

మహిళాసమాజము, నిడదవోలు.

---

# మహిళా సమాజము, సంగం జాగర్లమూడి

**ఆంధ్ర మహిళ 1955 జూన్ సంచిక 74 పేజీలో "భారతసేవక సమాజము (మహిళా శాఖ) సంగం జాగర్లమూడి" అన్న ప్రకటన పొరబాటునపడినది. శ్రీమతి కొత్త లక్ష్మీప్రసూనాంబగారు పంపిన సంగం జాగర్లమూడి మహిళా సమాజమును గూర్చిన రిపోర్టును యిందు ప్రచురిస్తున్నాము. జూన్ సంచికలో ప్రచురింపబడిన రిపోర్టు మాకు ఆంధ్రస్టేట్ సోషల్ వెల్ఫేరు అడ్వైజరీబోర్డువారి ద్వారా అందినది. —ఆం. సం.**

మా సమాజము సుమారు 10 సంవత్సరములనుండి గ్రామమునందలి స్త్రీల విద్యాభివృద్ధికై ప్రతిరోజు సాయంత్రం 2–5 గంటలకు మధ్య పత్రికలు చదివి వినిపించుట, పురాణ పఠనము జరుపుచున్నది.

మహిళా సమాజమును 1954 జూన్ నెలలో అప్పటి కున్న సభ్యులతో ఒక సంఘముగా ఏర్పరచి రిజిష్టరు చేయించడమైనది. అప్పటినుండి సభ్యులను చేర్పించుట చేత ఈనాటికి ఈ సమాజము 124 మంది సభ్యురాండ్రను కలిగియున్నది. మా సంఘములో జాతి, మత భేదములు లేకుండా స్త్రీలు అందరు సభ్యురాండ్రుగా చేరవచ్చును. సంవత్సరమునకు 0-8-0 చెల్లించిన ప్రతి స్త్రీ యిందు సభ్యురాలుగాచేరి తాము విజ్ఞానాభివృద్ధి పొందుచు, ఇతర స్త్రీల విజ్ఞానాభివృద్ధికై తోడ్పడుతూ ముఖ్యంగా హరిజన, హరిజనక్రైస్తవ ఇతర పేద బాలబాలికల క్షేమం కొరకు పనిచేయాలి.

1954 సంవత్సరము ఆగస్టు 15 నుండి ఈ సమాజము వారు స్త్రీల విద్యాభివృద్ధికై హిందీ తెలుగు భాషలలో పాఠశాలలు నడుపుతున్నారు. ఇందు విద్యాభ్యాసము చేయు వారికి ఉచితముగానే విద్య నేర్పబడుచున్నది. ప్రస్తుతము యీ పాఠశాలలో హిందీ 20 మందిన్ని, తెలుగు 20 మందిన్ని చదువుచున్నారు. మా మహిళా సమాజము 1954 ఆగస్టు 15 నుండి యీరోజువరకు కుట్టు, హిందీ, తెలుగు భాషలను బోధించుట, పత్రికా పురాణ పఠనము, నవారునేత మొదలగు ముఖ్య కార్యక్రమములతో నిర్వహింపబడుచున్నది.

కార్యదర్శిని.
కొత్త లక్ష్మీప్రసూనాంబ.

---

# శ్రీ కస్తూరిబాయి మహిళా సమాజము

నిడదవోలు, ప॥ గో॥ జిల్లా

ఈగ్రామములో 27-1-1950 సం॥లో ఈసమాజము స్థాపింపబడినది. దీనిలో స్త్రీల ఆర్థిక శారీరకమానసిక, ఆధ్యాత్మికోన్నతికొరకు చేతివృత్తులు, హిందీ పాఠశాల నడుపబడుచున్నవి. ఇందు ఒక సద్గ్రంథాలయముకలదు

ఈ సమాజమునకు సోషల్ వెల్ఫేరువారు ఒక వేయి రూపాయలు విరాళముగా యిచ్చిరి. ఈ సమాజమునకు స్వంత భవనములేదు అందుచేత ప్రస్తుతము సమాజ కార్యక్రమములు నడుపుకొనుటకు పంచాయితీవారు ఒక భవనమును యిచ్చిరి. స్వంతమైన భవనము కట్టుటకు ఒక స్థలముకొంటిమి. భవన నిర్మాణమునకు గ్రామాలలో ఒక వేయి రూపాయలు ప్రోగుచేసితిమి.

ఈ సమాజములో జరుగు కార్యక్రమములు. 1. ప్రత్తి పట్టుట, 2. ఏకులు చేయుట, 3. దారముతీయుట, 4. మిషనుకుట్టుట, 5. ఎంబ్రాయిడరీ, 6. ప్రాథమిక పరీక్ష నుండి విశారదవరకు హిందీ పాఠశాల, 7. ప్రతి శుక్ర వారము భజన, పురాణము, 8. అప్పుడప్పుడు వికలాంగులైన అనాథులకు అన్నదానము, వస్త్రదానము చేయుట.

ఈ సమాజము ద్వారా తాడేపల్లిగూడెంలో ఒక బ్రాంచి నడుపబడుచున్నది. ఆ బ్రాంచి సమాజములోకూడ ఈ పై కార్యక్రమములే నడుపబడుచున్నవి. దీని ద్వారా అఖిలభారత చరఖాసంఘమువారి ఒక ఖద్దరుకొట్టు నడుపబడుచున్నది.

దీనిలో రాట్నములు వడుకువారు 25 మంది. హిందీ నేర్చుకొనువారు 20మంది. మిషను కుట్టువారు 17 మంది. ఎంబ్రాయిడరీ కుట్టువారు 21 మంది.

దీని ద్వారా తయారగు నూలునేయుటకు ఒక నేత కుటుంబమునకు పూర్తిగా పని కల్పించగా ఇంకా కొంత నూలు మిగులుచున్నది. ఆ మిగిలిన నూలు అఖిలభారత చరఖాసంఘమునకు పంపి నేయించవలసి వచ్చుచున్నది. ఈసం॥లో ఈసమాజముద్వారా తయారైనబట్ట గ 600 లు.

ఇట్లు
మహిళా సమాజము, నిడదవోలు. 11-7-'55
మండవిల్లి జానికమ్మ, కార్యదర్శిని.

# ఇరకంలో మాతాశిశు కేంద్రము

కేంద్ర సాంఘికసంక్షేమ సంస్థవారి సంక్షేమవిస్తరణ ప్రణాళిక ప్రకారము సుళ్ళూరుపేట తాలూకాలోని పులికట్ సరస్సులోని (ఇరకం) అనే ద్వీపగ్రామములో జూలై 11 వ తేదీని గూడూరు డిప్యూటీ కలక్టరు శ్రీ పి. నారాయణమూర్తిగారిచే మాతా శిశు సంరక్షణాలయము యొక్క ప్రారంభోత్సవము జరుపబడెను. ఈ ఉత్సవమునకు ఆంధ్ర సంక్షేమసలహాసంఘ సభ్యులు శ్రీ న్యాయపతి రాఘవరావుగారు అధ్యక్షత వహించిరి. ఈ సంక్షేమ కేంద్రము ఆంధ్ర మహిళాసభ వెల్ఫేర్ ప్రాజెక్టు కమిటీవారిచే ఏర్పాటు చేయబడినది. ప్రాజెక్టు కన్వీనరు శ్రీమతి న్యాయపతి కామేశ్వరమ్మగారు ఈ సంక్షేమ కేంద్ర ప్రారంభోత్సవమునకు వచ్చిన పెద్దలను ఆహ్వానిస్తూ, ఈ ప్రాజెక్టు కమిటీవారు ఇదివరలో అప్పుడే సుళ్ళూరుపేట తాలూకాలో నాలుగు కేంద్రములు స్థాపించిరనియూ, ఇదివరలో తాము స్థాపించిన కేంద్రములన్నింటికన్నా, ఈద్వీపకేంద్రములో ఒక ప్రత్యేకత కలదని చెప్పిరి. పులికట్ సరస్సులో సుమారు 5 మైళ్ళ దూరము పడవలలో ప్రయాణముచేయనిదే చేరలేని ఈ ద్వీప గ్రామములో వందలకొలది సంవత్సములనుండి ఇక్కడ నివసించు స్త్రీలు ఎట్టి సదుపాయములు లేకయున్నారు. ముఖ్యముగా గర్భిణీ స్త్రీలకు ఎట్టి ప్రసూతి సౌకర్యములూలేవు. అట్టి ద్వీపగ్రామములో సంక్షేమ కేంద్రమును స్థాపించుట మిక్కిలి అవసరము. ఇరకం గ్రామస్థులుకూడా ఈ కేంద్ర స్థాపనకు వారివాటా ధనమును విరాళమునిచ్చుటయేగాక ఇతర ఏర్పాటులలో ఎంతో శ్రద్ధచూపుచున్నారు. ఒక వంక ప్రభుత్వోద్యోగులూ, ఒక వంక ప్రజలూ, ఒక వంక సాంఘిక సేవకులూకలసి ఇటువంటి గ్రామ సంక్షేమ ప్రణాళికలను నిర్వహించుట ముదావహము.

డిప్యూటీ కలక్టరు శ్రీ పి. నారాయణమూర్తిగారు కేంద్రమునకు ప్రారంభోత్సమును జరిపి ప్రసూతికేంద్రమును తెరిచారు. తడనుండి శ్రీ వేణుగోపాలరెడ్డిగారు, మదరాసునుండి చిల్డ్రిన్స్‌గార్డెన్ స్కూలు ప్రిన్సిపాల్ శ్రీ వి. ఎన్. శర్మగారు, సుళ్ళూరుపేట డిప్యూటీ తహసీల్దార్ శ్రీ ఎస్. నాగభూషణరావుగారు, ఇరకం గ్రామవాసులు శ్రీ జి. ఆర్. కన్నయ్యనాయుడుగారు, ఉమాపతిముదలి, కె. రాజముదలిగారలు ప్రసూతి కేంద్ర ఆవశ్యకతను గురించి మాట్లాడుతూ సంక్షేమ సంఘమువారు చేయుచున్న కృషిని ప్రశంసించారు. అధ్యక్షులు శ్రీ రాఘవరావుగారు ఈ ప్రసూతి కేంద్రమునకు తగిన వసతి గృహమును శ్రీ అహ్మద్ సాహెబుగారుత్వరలో కట్టించి ఇవ్వగలరనీ క్రమేపీ ఈ కేంద్రములో ఇంకా ఎన్నో ఎన్నో స్త్రీ సంక్షేమ, బాలసంక్షేమ ప్రణాళికలు జరుపబడుననియూ తాము ఆశించుచున్నామనిరి

ఆంధ్ర సంక్షేమ సలహా సంఘ అధ్యక్షురాలు శ్రీమతి ఏ. సి. కృష్ణరావుగారు పంపిన శుభాశీస్సులుచదువబడెను.

శ్రీమతి కస్తూరి రుక్మిణమ్మగారు వందనసమర్పణ చేసిరి. ఆంధ్ర బాలానంద సంఘ బాలలు వినోద కార్యక్రమమును వేలాది ప్రేక్షకుల ఎదుట ప్రదర్శించిరి.

---

సూళూరుపేటలో ఆంధ్ర మహిళా సభ ప్రాజెక్టు కమిటీవారు నిర్వహించుచున్న సంక్షేమ కేంద్రములు

మాతా శిశు సంరక్షణాలయము, మాంబట్టు
బాలవినోద విజ్ఞాన కేంద్రము, తడ
మాతా శిశు సంరక్షణాలయము, చేనిగుంట
మాతా శిశు సంరక్షణాలయము, ఇరకం
మాతా శిశు సంరక్షణాలయం, వాటంబేడు

విరాళములనిచ్చి యీ సేవా కేంద్రములను పోషించండి.

**ఇరకంలో** మాతా శిశుసంరక్షణాలయానికి ప్రారంభోత్సవము చేస్తున్న బాలలనేత రాఘవరావుగారు, **అధ్యక్షత** వహించిన డిప్యూటీ కలెక్టరు నారాయణమూర్తిగారు, అహమ్మద్‌గారు కూర్చునియున్నారు.





**ఇరకం** పులికాట్ సరస్సులోని ద్వీపం. దానిని చేరాలంటే బోటుమీద బండిమీద ప్రయాణం తప్పదు.

# బాలానందం

## విలువెరుగని బ్రతు
## కొరులకు సులువగు!

వి. ఎస్. ఆర్. నాయకమ్మ

కమలా విమలా
ఇరువురు గూడా
ఇరుగూ పొరుగూ
యాదవ కాంతలు !

పాలూ పెరుగూ
బోలుగ నమ్ముచు
వీలుగ పైకము
గడించు చుండిరి!

కమలతి పొదుపరి !
విమల దుబారా !

కమలకు గలదొక
బఱ్ఱయినా బహు
ళార్జన దీయుచు
నుండెను పొదుపుగ !

విమలకు మొదవులు
విరివిగ నున్నన్
మప్పిత మెరుగని
మగ నాలగుటను

కమలకు దీసిన
దనిపించు కొనెన్ !
కమలార్జన గని
కన్నుఁ గుట్టినా

విమలతి యీసున
కుములుచు నెదలో
చిక్కన ద్రొక్కన్
జూస్తూండెన్ మది !
సఖ్యత గుండిన
చిక్కను గదయని
తియ్యా పెట్టక
తిరుగుచు చుట్టును
బులిపుచ్చికముల
ప్రొద్దులు పుచ్చుచు
బదులని మానెడు
ఘృతమును గుంజీ
బిగుసుక పొయ్యేను
దొసగులు లేకనె !

పని పాటలతో
పరిశ్రమించెడు
పవిత్రాత్మలకు
పట్టవుగద పర
యూసు లవేవీ !
వింత ప్రవర్తన
విమలమ్మను గని
సుంతయు చలనం
బెదురుగ కమలా

కవ్విస్తున్ననుఁ
కలబడ దేమని
భగ్గు భగ్గు నను
మండుచు విమలా
"యగ్గిలొ గుగ్గిల"
మైనది చివరకు !

అటనట దెగడుచు
సూటీ పోటీ
మాట లాడినా
పోనీ లెమ్మని
తుడుచుకు దిరిగే
కమలమ్మను గని
కలబడె విమలా !

ఇంత జరిగినా
పంతం బెరుగక
బదులో సగిన-నెయి
తానై యడుగక
నమ్మె లక్కలతో
నడిగించిందా
పొదుపరి కమలా !
అమ్మె లక్కలా
బాకీ నడుగన్
అఘ మేఘముల

## విలువెరుగని బ్రతు కొరులకు సులువగు !

కంటెను విమలా !
పోతే పోయ్యేను
లెమ్మని కమలతి
పోంకము గుండిన ;
చుట్టు పట్టులా
కమలను బట్టి
రచ్చ కీడ్చిరీ
విమలా దేవిని !

అభియోగంబిది
ఆకళించు కొన
తీర్పరి రామన
విమలమ్మాళ యిది
యేమని యడుగన్ !

పాడె బట్టలూ
పదిగల దానను ;
బక్క బట్ట గల
పేదరాలి కడ
అప్పు గొందునా?
చెప్పం డయ్యా !
యనె విమలమ్మాళ

నీవే మందువు
కమలమ్మాళ యని
తీర్పరి బలుకన్ !

గొడ్డొక టైనా
గుట్టుగ నుందును !
మప్పితంబుగా
తిప్పలు బడుదును !

బదులిడు టెంతయు
వాస్తవ మయ్యా !
పరులకు మాత్రం
కమలమ్మాళిగా!
ప్రొద్దు బోయెనని
సద్దు మణిగెనని
సరి పుచ్చేరా
నాటికి కొలువును !
నాటి రేయికే
బాట ప్రమాణం
కూడిన మబ్బులు
కుండ పోతగా
గురిసెను వర్షం !
కొలువున కుదయం
బిలువ నంపగా
రొంపిని నెగదిగ
రొప్పుచు రోజుచు
చేరిరి మెల్లగ
కమలా విమలా !
న్యాయమూర్తి కడు
నేర్పున వారికి
చెరియొక లోటా
జలమును సమముగ
నిప్పించియు-నటు
తా గనుచుండెన్ !
కమలా నీటితో
గరచరణంబులు
శుభ్ర మొనర్చక
నిబ్బర ముండెన్
చరణం బొక్కటి
సాంతం బీవిధి
శుభ్రము గాదా
లోటా నీటికి
నావిమలమ్మాళకు !
కీలక మప్పుడు
అంతు బట్టగన్
న్యాయా ధీసుడు
"ఫిర్యా దెంతయు
పొదుపరి యగుటను
తాదిననూగల
దొరులకు బెట్టను
గలదని యంటూ
యెగదిగ బోసుక
తైతెక లాడెడి
ముద్దా యెంతయు
కలిగిన దైనను
ఇతరము కొరకెపు
డెదురు జూచునని
ఇబరా జబరా
విసిరే స్తుంటే

కొండలు కూడా
పిండుకు పోవును !
విమలమ్మాళ యని
నేరం బీవిధి

బుజువయె నంటూ
బదులు దీర్చుకొని
బ్రదుకును ముందిక
భద్రము గానని"
తీరుపు జెప్పెన్ !
తప్పని సరియై

అప్పును దీర్చి
"సామ్మాళ బోయీ
శని బట్టిందను"
సామెత నెరిగీ
చెంపలు గొట్టుక
చేరిం దింటికి
సిగ్గున గ్రుంగుచు
నా విమలమ్మాళ !
పత్తా తెలియదు !
ప్రభువుల చిత్తం !
ప్రజల యదృష్టం !
అబద్ధ మెరుగని
అంగన నంటూ
అనేక విధముల
అఘోరించె--నా



# ★ ముద్దు ★

శ్రీ సుబ్బారావు శాస్త్రి

చాలా మంది తల్లులు పిల్లలను ముద్దుగా చూచి చెడగొడుతూ వుంటారు. ముఖ్యంగా లేక లేక కలిగిన పిల్లాణ్ణి ,చాలా మంది పిల్లలు పుట్టిపోయిన తర్వాత చివరకు బ్రతికిన పిల్లను ముద్దుగా చూస్తూ వుంటారు. వీళ్లు మొద్దు లవడం కూడా కద్దు.

కొందరు ముద్దుకోసం పిల్లలకి తిట్లు నేర్పు తూవుంటూరు. పిల్లలువచ్చీ రాని మాటల్తో ఆ తిట్లని వాళ్లమీద ప్రయోగిస్తారు, లేకుంటే ఎదుటి వాళ్లమీద ప్రయోగిస్తారు. అప్పుడు సంతోషిస్తూ వుంటూరు.

" అదో ! బూచాడు వస్తున్నాడు"అంటూరు పిల్లాడు మారంచేస్తోవుంటే. అదే భయంగల పిల్లాడయితే భయపడి జ్వరంపెట్టు కుంటాడు. ఇలా అనగానే పిల్లాడు ఏడుపు మానేయడం ఆపిల్లాడి కంటే పెద్దవాడుచూస్తాడుఎప్పుడన్నా వాడికి ఆడిచంమని యిస్తారు . అప్పుడుగనక ఏడ్చాడో 'బూచాడు,'అంటాడు. వినడనుకోండి దోవను బోయే ముష్టివాడి దగ్గరగా తీసుకు పోగానే భయపడి జ్వరం పెట్టు కుంటాడు కుర్రాడు. ఇక అక్కణ్ణుంచి తాయీనులు , నల్ల 'తాళ్లు' మంత్రాలూ !

కొందగు పిల్లలు తల్లిని నాన్నాఅని తండ్రిని 'అమ్మా'అని పిలుస్తూవుంటూరు. ఈ అలవాటును మాన్పించడానికి యెంత మాత్రం ప్రయత్నించరు. ఇవే పెద్దచిక్కుల్లో పడేస్తాయి.

ఇలానే లేక లేక ఒకడికి ఒకపిల్లాడుపుట్టాడు. వాడు తల్లిని నాన్నా అని ;నాన్నని అమ్మా అని పిలుస్తూవుండేవాడు. తల్లితండ్రులుఏవీ అనేవారుగాదు. ఏమంటే ముద్దూ! —ఒక్కరోజు ఆ అబ్బాయి అమ్మమ్మవచ్చింది వూరునుంచి.వీధి వరండాలో సామానులు పెట్టుకు,అక్కడే ఆడు కుంటున్న కుర్రాడితో "అమ్మయేదిరా? " అని అడిగింది. "క్షవరం చేసుకుంటోంది: ! " అని సమాధానం చెప్పాడు. అవిడకుబలే ఆశ్చర్యం వేసింది. తన కూతురుక్షవరంచేసుకోవడ మేవిటని !

"నాన్నేడీ...? అం దావిడ మళ్ళీ".

"పోయాడు" అన్నాడు కుర్రాడు "అయ్యో... దేవుడా...! ఎంతపని చేశావురా ?" అంటూ

## చల్ చల్ గుల్లామ్



చిరంజీవి కట్టా బాలాత్రిపురసుందరి.

(శ్రీ కట్టా సత్యనారాయణమూర్తి గారి కుమార్తె)

రాగాలారంభించింది. ఈ రాగాలువిని ఇరుగూ పొరుగూ, యింట్లోనుంచి తండ్రీ వచ్చారు.

అల్లుణ్ణి చూసి నిలువునానీరయి పోయింది బోడెమ్మ. ఆకుర్రాడు మామూలుగానే, తల్లిపీధిలోకి పొరుగింటికి వెళ్ళిందిగాబట్టి "పోయింద"ని చెప్పాడు. తండ్రి క్షవరంచేసు కుంటున్నాడని చెప్పాడుగడ్డంగీకుకుంటూ వుంటే. అంతాఇది విని విరగబడి నవ్వారు.

తర్వాత ముద్దుకి "ముక్కుకోసేస్తా" నంటూ వుంటారు. దానికి కూడజరిగిన సంగతి నే చెబుతావినండి - వాళ్లమ్మ పిల్లాడితో అల్లరిచేస్తున్నప్పుడు "ముక్కుకోసేస్తా" నంటూవుండేది.

కొంచెం జ్ఞానంవచ్చిన వాడు ఒకసారింజనిగానే కుర్రాడి అంటే తమ్ముడి ముక్కు కోసేశాడు. పిల్లాడు ఏడుస్తోవుంటే వూరుకున్నా.

"అమ్మా తమ్ముడు అల్లరి చేస్తే ముక్కుకోచేచా!" అన్నాడు పెద్దఘనకార్యంచేసినవాడల్లె కుర్రాడు. ఇప్పుడా కుర్రాణ్ణి ఏంచేస్తుందో. చెప్పండి!.

ఇలా పిల్లల్ని ముద్దుగా అంటేమితి మీరిన ముద్దుగాచూస్తే ప్రమాదాలు ఇలా నేవస్తాయి




స్థాపితం: 1923

# ఆంధ్ర బ్యాంకు లిమిటెడ్

హెడ్డాఫీసు: మచిలీపట్టణము.

(షెడ్యూల్డు బ్యాంకు)

చెల్లింపబడిన మూలధనము, రిజర్వులు రు. 4564, 950
డిపాజిట్లు ,, రు. 7, 50, 00, 000-/ మించినవి
అమలులోనున్న వ్యాపారము రు. 8, 50, 00, 000/- మించినవి.

కర్నూలు ఆఫీసులు:

1/9 మెయిన్ బజారు, పేట,
లెజిస్లేచరు సెక్రటేరియట్ భవనము (ఈ పై ఆఫీసు అసెంబ్లీ సెషన్సు జరుగుచున్నంతకాలము తెరచియుంచబడును)

మద్రాసులోని శాఖలు:

6, లింగిచెట్టి వీధి, మద్రాసు 1. 77, కచ్చేరి రోడు, మైలాపూరు, మద్రాసు 4.
87, పాండిబజారు, త్యాగరాయనగర్, మద్రాసు 17.

ఇతర బ్రాంచీలు, సబ్ ఆఫీసులు:

అమలాపురం, అనకాపల్లి, బాపట్ల, భీమవరం, చీరాల, ఏలూరు, గుడివాడ, గూడూరు (నెల్లూరు జిల్లా,) గుంటూరు, అరండల్ పేట (గుంటూరు). కాకినాడ, రామారావుపేట (కాకినాడ), మచిలీపట్టణము, నరసారావుపేట, నెల్లూరు, ఒంగోలు, పాలకొల్లు, రాజమండ్రి, శ్రీకాకుళం, తెనాలి, కొత్తపేట. (తెనాలి), తుని, విజయవాడ, గవర్నరుపేట, విజయవాడ), గాంధీనగర్ (విజయవాడ). విశాఖపట్టణము, మహారాణీపేట (విశాఖపట్టణము), విజయనగరం సిటి, ఆముదాలవలస, (శ్రీకాకుళం జిల్లా), అనంతపురం, భట్టిప్రోలు (గుంటూరు జిల్లా). బళ్లారి, బొబ్బిలి (శ్రీకాకుళం జిల్లా) చల్లపల్లి (కృష్ణా జిల్లా), చోడవరం (విశాఖ జిల్లా), కడప, దుగ్గిరాల, గొల్లప్రోలు, ఇచ్ఛాపురం (శ్రీకాకుళం జిల్లా) జగ్గయ్యపేట, (కృష్ణా జిల్లా), కొవ్వూరు (ప.గో.జిల్లా). నరసన్నపేట (శ్రీకాకుళం జిల్లా), నిడదవోలు, పామర్రు (కృష్ణాజిల్లా), పార్వతీపురం. పెడన (కృష్ణా జిల్లా). పెద్దాపురం, పెనుగొండ (ప.గో. జిల్లా), పిఠాపురం, సాలూరు, సామర్లకోట, తణుకు,(ప. గోదావరిజిల్లా). తిరుపతి, వినుకొండ. వుయ్యూరు. (కృష్ణాజిల్లా)

ఆకర్షణీయమైన వడ్డీరేట్లకు డిపాజిట్లు అంగీకరించబడును.
సెక్యూరిటీలు, బంగారు నగలు, బులియను మరియు తదితర సరకుల మీదను అప్పులు యివ్వబడును.
వివరములు బ్యాంకు యొక్క ఏ ఆఫీసులోనైనను తెలిసికొనవచ్చును.

తాడేపల్లి శ్రీరాములు, మేనేజింగ్ డైరెక్టర్.
ఏలేశ్వరపు రామచంద్రమూర్తి, యం.ఏ., సి.ఏ.ఐ.ఐ.బి., జనరల్ మేనేజర్.

# లాభసాటి బేరం 

శ్రీమతి చక్రవర్తి శకుంతల
(దర్బను, దక్షిణాఫ్రికా)

నల్లని ముఖమల్ పట్టుపెట్టెలో అమర్చిన ముత్యాల హారం అద్దపు బీరువాలోనుంచి తన కాంతిని విరజిమ్ముతూ ఉంది. కన్నయ్యశెట్టి, దానికే ఎదురుగా కొంచెంసేపు నిలుచుండి, దాని అందాన్ని గొప్పతనాన్ని నిదానించి చూస్తూ ఉన్నాడు.

దానిని ఇరవైవేల రూపాయీలకు తక్కువ అమ్మకూడదు అని అతనితలంపు. అయితే, నిజానికి శెట్టి దానిని చాలా తక్కువ వెలకుకొన్నాడు. ఒక మార్వాడీ దివాలాతీసి అతని సామానంతా వేలంవేస్తూంటే దానిలో కన్నయ్యశెట్టి ఈ హారాన్ని కొన్నాడు. మంచిముత్యాలు ఆసైజులో ఉండి, పరీక్షకు నిలిచేట్టయితే, ఆవెలకు ఎవరైనా సందేహంలేకుండా కొనితీసుకుపోతారు. శెట్టికి దానిలోని లోపాలుతెలుసును. భూతద్దంతో సమర్థులైన వాళ్ళు చూస్తే, దానిలో తప్పుజీరలూ, నొక్కులూ కనిపెట్టగలరు, కాని సాధారణంగా కనబడవు. ఎవరైనా "కొత్త ధనికులు" దొరక్కపోతారా అని ఎదురు చూస్తున్నాడు.

ఇంతలో పల్లెటూరు రైతువలె కనబడుతూన్న ఒక ఆసామీ అంగడిలోకి వచ్చి ఆ హారంవంకనే చూస్తున్నాడు. శెట్టికి కొంచెం సంతోషం కలిగింది.

"మంచిముత్యాల హారం అనుకుంటాను" అన్నాడు ఆ ఆసామీ.

"ఆం. మంచిజాతికి చెందిన ముత్యాలు; ఇది వెంకటగిరి సంస్థానం జవాహరీలోంచి వచ్చింది" అని శెట్టి దాని గొప్పతనాన్ని ఉద్ఘాటించాడు.

"వెలకూడా సరసంగానే ఉండవచ్చును" అని రైతు నెమ్మదిగా గొణుగుకున్నాడు.

"ఆం. మీలెక్కనుబట్టి సరసమే; మరి ఇతరులకైతే ఎలాగుంటుందో చెప్పలేం" అని కొంచెం ముఖస్తుతి మేళవించి శెట్టి రైతుకి ఉత్సాహం కూర్చాడు. "అయితే, బాబూ, మన దేఊరు?" అని ప్రశ్నించాడు.

"మాది పశ్చిమ గోదావరిజిల్లా, కొవ్వూరు. కొంచెం పనుండివచ్చాను. మంచిముత్యాల హారం మంచిది దొరికితే తీసుకురమ్మని అమ్మాయి చెప్పింది. చూస్తే అది యిక్కడే నాకెదురువచ్చింది."

"ఓహో, పొగాకు రైతులా బాబూ, మీవల్ల కాకపోతే ఇంకెవరు కొనగలరు ఇల్లాంటివి? బాబూ, మీ పేరేమిటి?" అని శెట్టి యింకా ఉత్సాహం యినుమడింపజేశాడు రైతుకి.

"నాపేరు ముళ్ళపూడి చెలమయ్య, మా పొగాకు ఇప్పుడు జపానుకు ఎగుమతి చేస్తున్నాం."

"అయితే, హారం చూస్తారా? బయటికి తియ్యమంటారా?"

"చూసేదేమిటి? వెలయెంత? మంచిముత్యాలే కదూ?" అని చెలమయ్య తన ఉదారత్వాన్ని వెలిబుచ్చాడు.

కన్నయ్యశెట్టి, ఇలాంటి ఛాన్సు దొరికినప్పుడు పోగొట్టుకోడం ఎందుకు; అని ఏంవెల చెప్పుదునా అని మనస్సులోనే ఆలోచిస్తున్నాడు.

"నిన్నంతా కావలసిన గుడ్డలూ, నగలూ మొత్తం మూడులక్షలయాభై వేలకు తీసుకున్నాను" అని చెలమయ్య మళ్ళీ ఆత్మసమ్మానాన్ని పెంచుకున్నాడు.

"ఈ హారం యొక్క చరిత్ర, దీని పురాతన ఘనత, ఇవన్నీ ఆలోచించితే నేను చెప్పబోయే వెల ఇంకా తక్కువే అన్నట్టుగా ఉంటుంది" అని ఉపోద్ఘాతం ఎత్తుకున్నాడు కన్నయ్యశెట్టి.

"డబ్బు; డబ్బుకు లక్ష్యంలేదు" అంటూ కోటు లోపలి జేబులోంచి పెద్దకట్ట నూరురూపాయలనోట్లు ఈవలకు లాగుతూ, "అది కావలసినంత ఉంది; మంచి జాతైన ముత్యాలహారం ఉంటే, డబ్బుకు లెక్కలేదు."

"వెల నిజంగా చాలా తక్కువ అని చెప్పవచ్చు" అంటూ శెట్టి ముందు అనుకున్న ఇరవైవేలకి ఇంకో రెండువేలు - కాదు - అయిదువేలు - జోడించి "దీనివెల

ఇరవై అయిదువేల రూపాయలు మాత్రమే" అని తేల్చాడు.

"అయితే ఇప్పుడు గట్టి చిక్కువచ్చింది" అంటూ పోగాకు రైతు ఆనోట్ల కట్టి మళ్ళీ జేబులోపెట్టుకున్నాడు.

పాపం! శెట్టి తాను ఆలోచన తక్కువగా, దురాశ చూపించినందుకు తనలో తన్ను నిందించుకున్నాడు. "ఏం? వెల ఎక్కువఅయిపోయిందనుకుంటున్నారా? కావలిస్తే ఆవిషయం మనం తరిచి చూసుకోవచ్చును; ఇంకా. ......"

"అబ్బే, వెలలో ఏమీ తప్పులేదు. నాకుపచ్చిన సమస్య ఇంకొకటి. ఈహారం మా అమ్మాయికి కొన్నట్టయితే అలాంటిదే - అచ్చంగా అలాంటిదే - మా కోడలికికూడా కొనియియ్యవలసి ఉంటుంది. సరే, దీనికి ఇరవై అయిదువేలూ వెల నిర్ణయం అయిపోయింది; ఇచ్చేస్తాను" అని చెలమయ్య చెప్పినమాటలు కన్నయ్య శెట్టికి కొంచెం మనశ్శాంతీ, ధైర్యము కలిగించాయి.

ఇలాంటిదే ఇంకొకటి దొరకటం కష్టం అని అతను మనస్సులో ఎఱిగిఉన్నా "ఇంకా ఇలాంటివి రేండేరెండు ఈప్రపంచంలో ఉన్నాయి. ఒకటి నూజవీడు సంస్థానంలో ఉంది; ఇంకోటి విజయనగరం కోటలోంచి పరారి అయింది. అది ఎక్కడ ఉందో ఎవరికీ తెలియదు. మనం పెద్ద వెల ఇస్తామని ఆశ చూపితే బయటికి వచ్చు నేమో అని ఆలోచిస్తున్నాను'' అని కన్నయ్యశెట్టి కొంచెం కథకట్టాడు

"ఇంకొకటి యిలాంటిది తెచ్చి నాకు ఇచ్చి నీయిష్టం వచ్చిన వెల అడుగు ఇస్తాను'' అంటూ చెలమయ్య చెక్కుబుక్కు జేబులోంచి చేత తీసుకున్నాడు'' అందాక, దీన్ని యిప్పుడు తీసుకొనిపోతాను. దీని వెల యెంత అయింది?"

"ఇరవై అయిదువేలు" అని కన్నయ్య కొంచెం చిన్న గొంతుకతో చెప్పాడు.

చెలమయ్య ఇరవై అయిదు వేలకు చెక్కువ్రాసియిచ్చి, "ఇది ఆంధ్ర బ్యాంకులో సరిచూసుకో; ఇది సరియే అని ఇవేళ నీకు తెలిస్తే రేపువచ్చి ఈహారం తీసుకొని పోతాను; నేనిలా అన్నందుకు సందేహం కలిగించేట్టుగా వర్తించానని, నామీద ఏమీ అనుకోవద్దు. ఇదేం చిన్న మొత్తంకాదు. జాగ్రత్తగా ఉండటం మంచిది'' అని చెలమయ్య అతనికి ధైర్యం కలిగించాడు.

"అయ్యో, మీరలాగ అనకూడదు; మీవంటి ప్రభువులకు ఇదోలెక్కకాదు. అయితే, మరొకటి అచ్చంగా ఇలాంటిదే దొరకటం కొంచెం కష్టం. టైము పట్టుతుంది అని శెట్టి సర్దుబాటుగా సమాధానం చెప్పాడు.

"ఏ వెలయినా సరే యిస్తాను. కావలిస్తే దీనికి మూడురెట్లు, - డెబ్బైఅయిదువేలు-కావాలె అంటేకూడా యిస్తాను. అయితే అచ్చంగా ఇలాంటిదే కావాలె. నే నింకా పదిరోజులు పట్నంలోనే ఉంటాను. వుడ్ల్యాం డ్సులో బసచేసిఉన్నాను. దొరికినట్టయితే నాకు కబురు చెయ్యి, లేకపోతే అనవసరంగా శ్రమపడనక్కరలేదు. నాకూ తీరికలేకుండా లక్షపనులుంటాయి.''

"కన్నయ్యశెట్టి మానవ మనస్తత్వం ఊహించడంలో చాలా నిశితమైన బుద్ధిగలవాడు. చెక్కులో ఏమన్నా మోసం ఉంటుందన్న సందేహమే అతనికి కలగలేదు. ఆ మధ్యాహ్నమే ఆంధ్రబ్యాంకులో వాకబుచేసి అంతా సరిచేసుకున్నాడు. ఈబేరంలో మొత్తం ఇరవై రెండువేల రూపాయిలు లాభంకొట్టాడు.

ఇంకోటి ఇలాంటిది దొరకటం కష్టమే. ఈబేరంలో మంచిలాభమే దొరికింది దీంతో తృప్తిచెంది ఊరు కుందునా అనికూడా శెట్టికి తలంపుకలిగింది. "డెబ్బై అయిదువేలు" అయినాసరే ఇస్తానన్నాడు పొగాకు ఆసామీ; అది ఎందుకు పోనివ్వాలె అన్న ఆశ ప్రోత్సహించింది.

తన శాయశక్తులా ప్రయత్నించాడు. దీనికై కొంచెం ఖర్చుపెట్టినాకూడా నష్టంలేదని కన్నయ్యశెట్టి నిశ్చయం చేసుకున్నాడు. అన్ని పత్రికలలోనూ పూర్తివివరాలు ఇస్తూ అలాంటి హారం "కావలెను" అని ప్రకటనలు చేయించాడు. ఏమీ బదులురాలేదు.

చివరకు ఇంక రెండు రోజులకు చెలమయ్య పట్నం విడిచిపోతున్నాడనగా శెట్టికి ఒక టెలిఫోను వచ్చింది. నాగప్ప అని ఒక బళ్ళారి ఆసామీ కన్నెమరా హోటేలులో ఉన్నాననీ, తాను అప్పుడే సిలోను ప్రయాణం నుంచి తిరిగి వచ్చినట్టూ, తనదగ్గిర ఈవర్ణనకు సరిపడిన ఒక హారం ఉన్నట్టూ చెప్పాడు. కన్నయ్యశెట్టి కాల

హరణం చెయ్యకుండా, అప్పుడే కారులో కన్నెమరా హోటేలుకు పోయినాడు.

నాగప్ప బసచేసిన రూము తెలుసుకొనిపోయి తలుపు తట్టగానే, అతని నౌకరు తలుపుతెరిచాడు; లోపల కూచోమని చెప్పాడు. నాగప్ప అప్పుడే స్నానపు గది లోనికిపోయి ఉన్నాడని చెప్పి ఒక గ్లాసులో పానీయం నింపి ముందుపెట్టాడు

ఇంకో పావుగంటసేపటికి నాగప్ప పెద్ద తువాలు చుట్టుకోని, ఇంకోతువాలుతో తల తుడుచుకుంటూ నేవచ్చి "అయితే, మీరు నా హారం కొందామని వచ్చారా ?" అంటూ మందహాసాలతోనూ క్షమాపణలతోనూ. నిజ మైన పెద్దమనిషి తరహాను వెల్రిగక్కే మొహంతోనూ కన్నయ్యశెట్టికి కరగ్రహణం చేశాడు.

"నేను కోరిన వర్ణనకు సరిపడేట్టుగావుంటే ఇప్పుడే చెక్కురాసియిస్తాను. అందులో ఏమీ సందేహంలేదు "

"ఏమో ; నిజంగా నేను దానిని అమ్ముతానని చెప్ప లేను. నాకు అమ్మవలెనన్న అవసరంలేదు. మీరు ఇచ్చే వెల నాకు సంతృప్తికరంగావుంటే పరవాలేదు. చూదాం", అంటూ తన నౌకరునుచూసి "పెద్ద ట్రంకులో పైననే పెట్టిఉన్న చిన్ననగల పెట్టెను తీసుకొనిరమ్మ"ని చెప్పాడు నాగప్ప.

నౌకరు వెంటనే వెనుక గదిలోనికి పోయి ఆ నగల పెట్టెతెచ్చి టేబిలుమీద పెట్టాడు. కన్నయ్యశెట్టి ఆత్రంగా అందుకుని తెరిచి పరిశీలిస్తున్నాడు. ఇంతలో నాగప్ప వెనుక గదిలోకిపోయి బట్టలు వేసుకొనివచ్చి "అయ్యా మీరు ఏం వెల యివ్వగలరో తేల్చలేమ" అనిఅడిగాడు.

"గలగటంకాదు దీనివెల ఇరవై అయిదువేలు తాళ వచ్చును ; అని నాకు తోస్తూంది అంతకుపైన తాళదు" అని జాగ్రత్తగా తూలుబాటులేకుండా శెట్టి చెప్పాడు.

"మీరూ నాకూరూడా కాలం వ్యర్థ పుచ్చుతున్నారు" ఎట్టువాటిన మొహంతో పెట్టెచేత పట్టుకొని నిలబడ్డాడు నాగప్ప.

"అదికాదు ; దానివెల అంత తాళదు అని అన్నాను గాని, మీకు ఏం కావలెనో చెబితే నేను ఆవెల ఇస్తాను" అని బేరం బెసికిపోకుండా చురుకుగా అందుకున్నాడు శెట్టి.

"ఎందుకు ఇన్నిమాటలు ? కిందికిపైకి లాగకుండా ఒకటేవెల చెపుతాను. ఊరికే మీతో బేరాలాడటం నాకు ఇష్టంలేదు. నావెల యాభైవేల రూపాయలు. ఇదేఆఖరు మాట. ఇష్టమయితే తీసుకోండి ; లేకపోతే వదలిపెట్టి పోండి."

శెట్టికి ముచ్చెమటలు పోసినై. జేబురుమాలుతీసి మొహం తుడుచుకుంటున్నాడు.

"మరేమంటారు శెట్టిగారూ ?"

"నేననుకున్న దానికంటే చాలా............సరే. తీసుకుంటాను."

"మంచిది. ఇందులో ఇంకా మీకు చాలాలాభంవుంది. నేను కొన్నదే నలభైవేలుపైచిలుకు. అదైనా సిలోనులో."

కన్నయ్యశెట్టి యాభైవేలకు వెంటనే చెక్కువ్రాసి యిచ్చి ముత్యాల హారం లోపలిజేబులో భద్రంగా పెట్టు కొని హోటేలు విడిచిపోయినాడు. చెలమయ్య సమ్మ తించిన వెలప్రకారం తనకు ఇంకా పాతికవేలు ఛాన్సు ఉంది అని అంచనావేసుకున్నాడు.

అంగడికి చేరడంతోనే ఈ శుభవార్త చెలమయ్యకు తెలియచెయ్యాలె అని పుడ్ల్యాండ్సుకు టెలిఫోను చేశాడు.

"ఎవరు ? కొవ్వూరు చెలమయ్యగారా ?" అని ఆశ్చర్యంతో అడిగాడు హోటేలు టెలిఫోనుఎక్స్చేంజిలో పనిచేసే పిల్లవాడు.

"అవును ముళ్ళపూడి చెలమయ్యగారు ; ఆయన ఇంకా రెండు రోజులకు మీ హోటేలు విడిచి పోబోతున్నారు" అని కన్నయ్యశెట్టి వివరాలతోసహితం చెప్పాడు.

"ఇక్కడ ఎవరూ ముళ్ళపూడి చెలమయ్యగారులేరు"

"ఏమిటి ? సరిగాచూసి చెబుతున్నావా ?" అని కన్నయ్యశెట్టి కంగారుతో అడిగాడు.

"మా హోటేలుకి ఆపేరుతో కొవ్వూరునుంచి కాదు; ఏ దేశాన్నించీ, ఎన్నడూ, ఎవ్వరూ రాలేదండి" అని స్పష్టంగా వివరించాడు

"నిజంగానా ?" అని హీనస్వరంతో శెట్టి పలుకు తూనే టెలిఫోను క్రిందపెట్టేసి, చేతులు వణుకుతూ జేబులోంచి ముత్యాల హారంతీసి, డ్రాయరులోంచి భూతద్దంతీసి జాగ్రత్తగా పరీక్షించి చూశాడు. ఈ ముత్యాల హారం అచ్చంగా తాను అమ్మింతే. అయితే ఇది ఎట్టుముఖమల్ పట్టుపెట్టెలో అమర్చిఉంది. ★

అన్ని నొప్పులకు

# అమృతాంజనము

**60**

సంవత్సరముల
సేవచే
పేరొందినది!




అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు
బొంబాయి
కలకత్తా

# "సంఘం"

శ్రీ సోమంచి రామం

"నువ్వీరోజు మొదలుకొని పూజలు పునస్కారాలు మానెయ్యాలి! శాంతా!" అంటూ ఆఫీసునుంచి వచ్చి యింట్లోకి ప్రవేశించాడు విశ్వం.

"ఏమండీ? ఏం వచ్చిందిప్పుడు? నేను పూజలు చేస్తే మీకేం అడ్డంవచ్చింది?" అంటూ అమాయకంగా అర్థం కాని స్వరంతో అనుమానంగా అడిగింది ఆతని అర్థాంగి శాంత!

"నాకేం అడ్డం వచ్చిందో నీకెలా తెలుస్తుంది? పోనీ చెప్దామన్నా, ఊరంతా చెప్పుకునేది నీకు తెలియటంలేదు కాని నేను చెప్పేది తెలుస్తుందా?........శాంతా!........ ఇలా చూడు! ఫలానా ఆఫీసరుగారి భార్య ఈరోజుల్లో యింకా పతివ్రతలా పూజలుచేస్తూ కూర్చుందంటే ఎవరికేనా అవమానంకాదూ!...." అంటూ తనకు జరుగుతున్న అవమానానికి ఆమెయే కారణం అన్నట్లు నిర్ధారణగా చెప్పాడు విశ్వం.

"అంటే పూజలు చేయడమేగా నేచేసినతప్పు.." అంటూ కంట తడిప్రారంభించిందా అబల!

"అంతేకాదు! పూర్వకాలపు స్త్రీలవలె పురాణాలకు హరికథలకు వెళ్ళకూడదు. నవీనకాలపు యువతివలె మీటింగులకు సభలకు రావాలి! వచ్చి లెక్చర్లుయివ్వాలి...." అంటూ ఆ అమాయకురాలికి యేదో క్రొత్త మందు నూరిపోస్తున్నాడు విశ్వం!

"బాగానే ఉంది మీరు చెప్పేది! భక్తిమార్గం వదిలి బజారులో మీటింగులకు సభలకు రావాలంటారా?" అంటూ తిరిగి ప్రశ్నించింది పాపం శాంత!

ఆ అమాయకురాలి హృదయంలో సనాతనధర్మాలు. పతివ్రతాలక్షణాలు కరడుగట్టిపోయి కదలకుండాఉన్నాయి. భారత భాగవత రామాయణాది మహాపురాణ కావ్యాలు ఆమె సన్నిహిత స్నేహితులు. భగవద్గీత ఆమెకు కంఠోపాఠము. అలాటి పతివ్రతా స్త్రీనిచూచి యీలోకం, యీ కల్పితసంఘం, యీకాలంలో ఓర్వలేకపోయింది! చూచి అవహేళన చేయసాగింది. వట్టి ఆచారం తప్ప మరే విధమైన సంస్కారంకాని ఆమె దగ్గరలేవని సంఘం దుమ్మెత్తిపోసింది. ఆ పలుకులన్నీ విశ్వానికి ములుకుల్లా గుచ్చుకున్నట్టయి సంఘాన్ని చేసే దేమీలేక అర్థాంగిపై తన అహంకారాన్నంతా చూపించసాగాడు. తత్ఫలితమె యీ సంభాషణ—

"రావాలంటారా!....'' అంటూ యింకా మెల్లిగ అడుగుతున్నావా?....బాగానే ఉంది! మొన్నను జరిగిన మీటింగుకు అందరు తమ మిసెస్‌లతో వస్తే నువ్వు రాకపోయేసరికి నాకు నలుగురిలో తలవంపులయింది. నిన్నమట్టుకు నిన్న; సినిమాకు రాకపోయేసరికి నలుగురు నానామాటలు అన్నారు. తెలిసిందా! అందుకని యిక యివ్వాళనుంచి యీ పూజలు పునస్కారాలు మానెయ్యి! సాయంకాలము నేను ఆఫీసునుంచి యింటికి రాపడంతోనే నాకు కాస్త కాఫీయిచ్చి నువ్వు ముస్తాబవాలి! అపుడు ఇద్దరంకలిసి అలా జాలీగా పార్కుకుపోదాం! ఆంతే కాని!....ఎప్పుడూ యింట్లో కూర్చుని గీతాపారాయణాలు-పతివ్రతలకథలు చదవడం మానెయ్యాలి!—దినపత్రికలూ. వారపత్రికలూ చదవాలి!- కనీసం చదువుతూన్నట్టయినా పట్టుకోవాలి! తెల్సిందా!" అంటూ ఆమె చేయవలసిన కార్యక్రమాన్నంతా సూక్ష్మంగా చెప్పేశాడు విశ్వం.

శాంత కిదంతా అయోమయంగా ఉంది. ఏమీ అర్థం కావడంలేదు. అయినా భర్తమాటకెదురు చెప్పడంయిష్టం లేక కిమ్మనక ఊరుకొన్నది.

"సరే! యీ గొడవకేం గాని ముందులేచి కాళ్ళు కడుక్కోండి!'' అంటూ నీళ్ళు అందించింది.

"విశ్వం! ఇంకా బయలుదేరలా!" అంటూ ఆతని మిత్రుడు శివం యింతలోనే అక్కడికి హాజరయాడు.

"అరె! మర్చిపోయారా!— అయినా యెంతసేపు! బయలుదేరుతా!— శాంతా! అలా లోపలికి వెళ్ళిపోతావేం!- అరె! అదేం భయం! అతనూ మనలాటి మనిషే!-'' అంటూ లోపలికి వెళ్ళబోతున్న శాంతను వెనక్కు పిలిచాడు విశ్వం!

"మనిషికాకపోతే మీ ఆవిడకు భయమేమిట్రా! విశ్వం!" అంటూ ఓ రిమార్కు పారేశాడు శివం!— అతను యీ సంఘంలో ఒక వ్యక్తే!—

"అదికాదురా! మా ఆవిడ వట్టి....ఏమనిచెప్పనురా! ఇవాళ నువ్వుకనక సరిపోయింది! రేపు యే ఆఫీసరువచ్చినా యింతేనా!— నలుగురిలోను నన్నల్లరి పెట్టడానికి కాకపోతే యేమిటీ సిగ్గుచెప్పు! కాస్త నల్గురితోను సోషల్‌గా ఉండొద్దూ!"— అంటూ తన బాధను మిత్రుడు శివానికి వెలిబుచ్చాడు విశ్వం!

మిత్రుని బాధను అర్థం చేసికొన్న శివం ఎలాగైనా శాంతకు కొంచెం ధైర్యం చెప్పి ఆమెలో కొంత నాగరికతను తీసికొని రావాలని తలచాడు. విశ్వానికి ధైర్యం చెప్పాడు. భర్తఆజ్ఞపై శాంత అక్కడకువచ్చినిలబడింది.

"భయపడకండమ్మా! నలుగురితోను కలిసిమెలిసి మెలగడం నేర్చుకోవాలి! మనదేశంలో యెంత మంది స్త్రీలు రాజకీయ రంగంలో పాల్గొంటున్నారో తెలుసా!- వీరంతాదేశానికి మణిపూసల్లాంటివారు అలాగేమీరుకూడ- మీరేకాదు ప్రతిభారత స్త్రీ - తయారుకావాలి! అందుకని మీరు ప్రతి మీటింగుకు హాజరయి అక్కడ జరిగే విషయాలన్ని ఆకళింపు చేసికోవాలి! ఆ తర్వాత మీటింగులలో ఉపన్యాసాలీయాలి! స్త్రీల హక్కులకోసం పోరాడాలి! అప్పుడే మీపేరు నల్గురూ చెప్పుకుంటారు. మీకు ఊరూరసన్మానాలు, స్వాగతాలు, ఆహ్వానాలు సమర్పిస్తారు. ఫలానావారి భార్య అని మావాడికి పేరొస్తుంది. అపుడు మీరు రాజకీయనాయకులలో జమ అవవచ్చును. పదవులు సంపాదించవచ్చును. అందుకోసం యివాళనుంచి నలుగురితోను సోషల్‌గాఅంటే కలిసిమెలసి మెలగడం నేర్చుకోవాలి!"- అని ఓ లెక్చరిచ్చి టైమ్‌కేసి చూసికొని- "అరె! యీగొడవలో టైమ్ మర్చిపోయానే! సినీమాకు టైము అయిపోతోంది! లేవండి!" అన్నాడు శివం!

"ఆ! అవునవును! మళ్ళీవచ్చి భోంచేద్దాంలే!" అంటూ విశ్వం భార్యనుకూడ సినీమాకు లేవతీశాడు. భర్త బలవంతంమీద శాంత యిష్టంలేకపోయినా ఆపూట సినీమాకు వెళ్ళింది—

• • •

విశ్వం ఓ చిన్న ఆఫీసరు. శాంత అమాయకురాలైన పల్లెటూరి యిల్లాలు. ఆతని భార్య. పతివ్రత. విశ్వం కొంచెంగా నాజూకైననవనాగరికతఅనుకునే ప్రపంచంలో పెనుగులాడుతున్న ఆఫీసరవడంచేత నాగరికత అనుకునే యీసంఘానికి జడిసి తనభార్యనుకూడ తనతో సోషల్‌గా మీటింగులకు, సినీమాలకు రావలసిందని బలవంతంచేసి ఒప్పిస్తాడు. అందులకు మిత్రుడు శివం తోడ్పడుతాడు. తత్ఫలితంగా శాంత యిష్టంలేకపోయినా కష్టంమీద నాగరిక ప్రపంచంలో అడుగుపెడుతూ తొలిసారి భర్తతోను, ఆతని మిత్రుడు శివంతోను కలిసి సినీమాకు వెడుతుంది.

• • •

కొద్దిరోజులతర్వాత ఒకనాడు శాంత భర్త చదవమని యిచ్చినపత్రికను తిరగేస్తూంటుంది. అర్థం కాకపోయినా భర్తకు జడిసి అటూయిటూ నాల్గుసార్లు తిరగేస్తూంటుంది. విశ్వం ఆఫీసుకు వెళ్ళిపోతాడు. ఇంతలో "విశ్వం"— అంటూ శివం లోపలికొస్తాడు -

శాంత సిగ్గుతోలేచి లోనికిపోబోతూ - "ఆయన లేరండి!" అని సమాధానం యిచ్చింది! శివం ఆ సమాధానాన్ని అందుకొని కొంచెం మంచినీళ్ళిమ్మంటాడు. శాంత అలాగే యిస్తుంది! శాంత కొంచెం భయపడుతున్నట్లు గ్రహించిన శివం-"మరేం భయపడకండమ్మా అలా కూర్చోండి! నేను మీకు సోదరుని వంటివాడిని!- ఏమిటా చదివేది ?- గుడ్ అలాగుండాలి! అలాంటి పుస్తకాలన్నీ చదవాలి!- ఇదిగో! చూశారా! ఈ ఊళ్ళో నాకున్నపలుకుబడి కొద్దీ మిమ్మల్ని యీఊరు మహిళామండలికి శెక్రటరీగ నియమింపచేశాను. మొన్న ఆమండలి సభ్యులంతా నాదగ్గరకువచ్చి శెక్రటరీని నియమించమంటే నేనే మీపేరుచెప్పి మిమ్మల్ని శెక్రటరీగ నియమింపచేశాను. అందుకని యికనుంచిమీరు వారందరి మాటలు విని మీయిష్టంవచ్చిన సలహా వారందరికి కష్టం కలగకుండ చెప్పాలి. దానికి లోకజ్ఞానం కావాలి! తెల్సిందామ్మా!"- అంటూ తనువచ్చిన పనిచెప్పాడు శివం. చెప్పినదంతా పొల్లుపోకుండా విన్నదిగాని అందులోఒక్క ముక్క మాత్రం అర్థంగాలేదు. తనకున్న సందేహాలన్ని తీర్చుకుందామను కుంటుండగానే శివం మళ్ళీ యిలా ప్రారంభించాడు.

"లోకజ్ఞానార్థం యిలాంటి పుస్తకాలు చదవండి! మహిళా మండలివారి తరపున మహిళల కోర్కెలు తీర్చండి! వారి ఆదర్శాలను పాటించండి! వారి కష్ట

సుఖాలను కనిపెట్టండి! అప్పుడు మీమాటంటే వారికి గాఢమైన విశ్వాసం కలుగుతుంది. ఆమండలివారి ఆదర్శాలు - ఆశయాలు - యివి - మహిళలకుగూడ మగవారితో సమానహక్కులు కావాలి! ఆడవారిలో అందరికి ఓటింగు హక్కు పూర్తిగ ఉండాలి! ఇలాంటి వెన్నో ఉంటాయి. వీటినన్నిటిని ప్రభుత్వానికి తెలియ పర్చి వారి కోర్కెలు తీర్చాలి!"- అన్నాడు శివం.

"అది నావల్ల కాదేమోనండి!" అంటూ సగం సందేహంతోను, సగం భయంతోను అంది శాంత!

"ఎందుకు కాదమ్మా! మానవుల కసాధ్యమైనదంటూ లేదు. వాళ్ళంతా మీకు సహాయంగా ఉంటారు. మీకేం అవసరమయినవారు మీకు తోడుగఉంటారు. వారి కోర్కెల్ని తీర్చారంటే మిమ్మల్ని వాళ్ళ నాయకురాలిగ ఎన్నుకొని ఎలక్షన్సులోనెగ్గిస్తారు. తెల్సిందా! మీరు యీ పదవిని జాగ్రత్తగా నిర్వహించి నాపరువు నిలబెట్టండి! విశ్వంతో నేనువచ్చి వెళ్ళానని చెప్పండి!"— అంటూ శెలవుతీసికొన్నాడు శివం.

అమ్మయ్య, అనుకుంది శాంత! శివం చెప్పినదాంట్లో కొంతకాకపోయినా కొంతయినా అర్థమయింది! కాని ఆ సంభాషణ అంతకూ ముఖ్యంగ అర్థమవనిమాట ఒక్కటే ఉన్నది - శెక్రెటరీ!- అంటే యేమిటో అర్థం గాక సతమతమవుతోంది శాంత!- అలాగే ఆలోచిస్తూ ఓ చిన్నకునుకు తీసింది!

గడియారం రెండుకొట్టింది. మెలకువ వచ్చింది! కాఫీకోసం ఆఫీసునుంచి భర్తవచ్చే పైమయిందని గబగబ కాఫీ ప్రయత్నం ప్రారంభించింది శాంత! కాని దృష్టి, ఆలోచన, మనస్సు అన్నీ అన్యథాపరుగులెత్తుతున్నాయి.- అర్థంకాని ఆమాటే శాంత చెవుల్లో పదేపదే గింగురు మంటోంది.— శెక్రటరీ అంటే యేమిటో - ఇలా ఆలోచిస్తూ అలా ఆలోచిస్తూనే పైకిఅనేసింది!- అప్పుడే గుమ్మంలో అడుగుపెట్టిన విశ్వానికి యీమాటలు చక్కగ వినిపించాయి. గబగబ లోపలికెళ్ళాడు. సంగతేమని సరసంతో ప్రశ్నించాడు. శాంత జరిగినదంతా చెప్పింది. ఆతని ఆనందానికి అంతులేకపోయింది.

"నిజంగా నాకంత అదృష్టమా! శాంతా!"- అంటూ ఉప్పొంగిపోయాడు విశ్వం!

"ఏం అంత ఉప్పొంగిపోతున్నారు ఊర్కోండి! ఎవరన్నాచూస్తే అప్రదిష్టకూడాను! అంది శాంత!

"అదికాదు శాంతా! ఇక నీపేరు నాల్గుదిశలా మారు మ్రోగుతుంది! నీకు ఊరూరా సన్మానాలు జరుగుతాయి!.... నువ్వు శెక్రటరీవయ్యావుకదూ! జాగ్రత! చాల మెలకువతో ప్రవర్తించాలి! సంఘానికి యెంతసేవచేస్తే అంత గౌరవం పలుకుబడివస్తుంది!"- అంటూ ఆనందంతో పొంగిపోతూ తన సందేశా న్నందించాడు విశ్వం. శాంత ఆతనికి కొంచెం కాఫీకాచి యిచ్చి ఆఫీసుకు పంపించింది.

• • •

ఈప్రకారం క్రమేపి శాంతలోని సిగ్గు భయం కొంచెం కొంచెం తొలగిపోయాయి! భర్త, మిత్రుల సహాయంతో మహిళా మండలి శెక్రటరీ పదవిని అతిచాకచక్యంతో నిర్వహిస్తోంది! మహిళల్లో పలుకుబడి సంపాదించింది! మీటింగుల్లో ఉపన్యాసాలిస్తోంది!— కాలచక్రం గిర్రున తిరిగింది. తాను శెక్రటరీ అయి అప్పుడే అర్నెల్లు అయింది!- ఈలోగా మహిళామండలి వార్షికోత్సవం వచ్చింది. శాంతకు యెడతెరపిలేకుండ పని తగిలింది. "నాకు తీరికలేదు. చూడండి! ఎంతపనుందో! మహిళా మండలి వార్షికోత్సవమువస్తోంది! దానికియెంత హంగామా చేయాలనుకున్నారు! పైవూళ్ళనుంచికూడ చాలమందిస్త్రీలు వస్తున్నారు. వాళ్ళందరికివసతులు ఏర్పాటుచేయాలి. అన్నిటికన్న ముందుగ చందాలువసూలుచేయాలి! మీకేం మీరు మంచంమీద పడుకుని ఆర్డర్లిస్తారు.-" అంటూ తన బాధ్యతను వ్యక్తపరచేది.

ఆమెలోవచ్చిన మార్పుకు ఆశ్చర్యపోయాడు విశ్వం! కాని సంఘం వూరుకుంటుందా? ఇలా శాంత నలుగురితోను కలిసిమెలసి రాత్రనక పగలనక తిరుగుతూంటే అనేక అపోహలకు దారితీసింది! సంఘం ఆమెను అనుమానించింది! కొందరు పెద్దమనుష్యులు ఆమెకు ఇతరులతో సంబంధం ఉందని పుకార్లు పుట్టించారు. విశ్వం చెవులకుముందుగా చేరాయి ఆపుకార్లు. భార్యపై అనుమానం అంకురించింది. అదుపాజ్ఞల్లో పెట్ట బోతాడు. విషయం తెలిసికొని శివం వస్తాడు. మందలించబోతాడు.

"చూశావా! నీభర్త దుస్థితి! నీకోసం బెంగపెట్టుకుని కుమిలిపోతున్నాడు. నీకోసం సర్వం త్యాగంచేశాడు.— నీభర్త దిగులుకు నీవేకారణం!- నీభర్త మనోవ్యాధికి

నీవేకారణం !- ప్రస్తుతపు నీ ప్రవర్తన ఫలితం యేమిటో ఆలోచించావా? నీభర్త సంపాదిస్తే నీవుఖర్చుచేస్తున్నావు! ఊళ్ళో యెంత పుకారుగ ఉందో విన్నావా?- అంటూ ఆవేశంలో అనేశాడు.

శాంత అన్యాయంగా తనమీద పడుతున్న యీ అపనిందను భరించలేకపోయింది. కాని ఒక్కసారి వెనక్కు జంకి పశ్చాత్తాపపడింది. తనకు చైతన్యం కల్పించి 'సంఘంలో స్థానం కల్పించినవాడేనా యీ శివం అని జాలిగా చూస్తూ భోరుమన్నది.

"నీమనస్సుమారితే అంతేచాలు ! కాస్త ఆలోచించు ! నువ్వు చేసినపని ! చేస్తున్నపని ! ముందు నీభర్త జాగ్రత చూసుకో !"- అంటూ బోధించాడు శివం.

"సంఘం అంటే జంకవను కున్నాను శివం ! నువ్వా యింతేనా? నే నపరాధినని నువ్వునమ్మితే మన్నించవూ" అని వేడుకొంది.

"మన్నించేది నేనుకాదు. మందలించడంవరకే నాపని. మన్నించేది నీభర్త. అడుగో చూడు నీకోసం యెలా పరితపిస్తున్నాడో! వెళ్ళు! వెళ్ళి ఆతన్ని వేడుకో క్షమాభిక్ష ! అంటూ శివం గబగబ వెళ్ళిపోయాడు.

"శాంతా ! కాఫీ!"- అంటూ అరిచాడు విశ్వం ! శాంత కళ్ళు తుడుచుకొని గబగబ కాఫీతెచ్చి "ఏమండి! ఇదిగో ! కాఫీ"- అంటూ అందివ్వబోయింది.

"ఛే ! దూరంగా నన్నుతాకకు ! నీవు అపవిత్రురాలివి ! సంఘంనిన్ను అపవిత్రురాలిగ నిర్ణయించింది. నన్నుముట్టుకుని నా పవిత్రతను చెడగొట్టకు." అని వాపోయాడు విశ్వం.

"ఏమండి ! మీరేనా మాట్లాడేది ! నేను యేపాపం యెఱుగనండి !- ఆడదాన్ని అర్థంచేసికోలేని యీగ్రుడ్డి సంఘం నన్నుపార్థంచేసికొని నాకేఅపవాదు అంటకట్టింది. నేనీనాడు పతితను కానన్నా నమ్మలేకుండా ఉన్నారా?- ఎలా నమ్మ గల్గుతారులెండి !- సంఘపిశాచి మీచెవిలో యిల్లుకట్టుకొని అహోరాత్రులు నాలాటి అమాయక అబలలమీద అపవాదులు అంటకట్టి నూరిపోస్తుంటే అన్నెము పున్నెము యెఱుగని నాలాటి ఆడదాని మాటలు మీరు నమ్ముతారా? నమ్మి నన్ను క్షమిస్తారా! ఏమండీ !-" అంటూ విలపించ సాగింది శాంత !-

"నేను క్షమించలేను. నేను క్షమించినా సంఘం క్షమించదు. సంఘదృష్టిలో నీవుపతితవు. కావున నిన్ను క్షమించి ప్రయోజనంలేదు.

"సంఘం - పాడు సంఘం - పాపిష్టి సంఘం - పదవి యిచ్చింది ఆసంఘమే !- అపవాదు వేసింది ఆసంఘమే - అసలు సంఘం ఎక్కడుంది?-

♦ ♦ ♦

అమర్నాడు పత్రికలనిండా యీవార్తలే !- పరమ సాధ్వీలలామ, పతివ్రత, మహిళామండలిశెక్రటరీ శాంత ....ఆమెకు మా జోహారులు - అపవాదు భరింప లేక తన అసువులను సంఘానికి బలిదానమిచ్చిన శాంతకు జోహారులు. పరమ పతివ్రత శాంత పవిత్రఆత్మకు దైవము శాంతిని చేకూర్చుగాక! ..." మొదలైనవెన్నిటినో ప్రజలంతా విచారాతిశయంతో చదువుతున్నారు. దూరానఉన్న రేడియోలు గింగురుమంటూ యిలా పాడుతున్నాయి !-

పరువనెడి పాపకూపమున బడి
బ్రతుకుతెరువె బరువైపోయెడి
దీనజనావళి కిక దిక్కేలేదా ॥
ఇదియేనా లోకపుపోకడ
ఇంతేనా మన మనుగడ ॥ఇ॥



# నవకవి జాషువా

శ్రీ దాసరి వెంకటకృష్ణయ్య.

"ఉడుకుసన్నెత్తురువంటి కారమును య
త్యుష్ణంబు లీలం భరిం
చెడు ఘూర్ణైన రసజ్ఞులున్న పెనుబ
స్తీలోన బంగారపుం
బిడికిళ్ళన్ మరియాదలందితిని గ
ర్వించెన్ గళాలక్ష్మి ధ
న్యుడనైతింగలవాడనైతి, సృజియిం
తున్ విశ్వసాహిత్యమున్.

(ఇవి జాషువా కవి మాటలే.)

ఢంకామీద దెబ్బకొట్టినట్లుగా "సృజియింతున్ విశ్వసాహిత్యమున్" అన్నాడు. మర్యాద లందింది ఎక్కడయ్యా అంటే "ఘూర్ణైన రసజ్ఞులున్న పెనుబస్తీలోన" బంగారు పిడికిళ్ళతో సత్కారములందుకొన్న కవీశ్వరుడు. నిజంగానే ఈ విశ్వకవి సాహిత్యాన్ని సృజిస్తూనే వస్తున్నారు. వీరి కొన్ని గ్రంథాలు—పిరదౌశి, గబ్బిలము, నేతాజి, ముంటాజమహలు, స్వయంవరము— ఒకటేమిటి ఆంధ్రదేశమంతటా పేరు మ్రోగిన "ఖండకావ్యములు" ఈయన బంగరు కలంనించి వెలువడినవే.

పారశీక కవులలో అగ్రగణ్యుడు పిరదౌశి. ఈకవిని గూర్చి "పిరదౌశి" అనే పేరుతో ఒక కావ్యం వ్రాసి ఆంధ్రావనికి అర్పించి అనన్యమైన కీర్తి సంపాదించుకొన్న అశేషశేముషీదురంధరుడీయన. ఆ గ్రంథంలో కవి అంటే సామాన్యుడుగాడు– గడచిపోయిన చరిత్రను మళ్ళా పుట్టించాలంటే కవే సమర్థుడంటాడు.

"క్షణము గడచినదాని వెన్కకుమఱల్ప
సాధ్యమే మానవున కీకాలచక్రమందు ని
దాటిపోయిన యుగములనాటి చరిత
మరలఁ బుట్టింపఁ గవియ సమర్థుడగును"

పిరదౌశి వ్రాసిన షానామా (రాజ చరిత్ర)ను గజనీమహమ్మదు అంకితం చేయించుకొని కవికి ఇవ్వవలసినడబ్బు యివ్వక అందులకు బదులుగా వెండి నాణెములు యిస్తే కవి నిరాకరించి రాజును నిందిస్తూ మరికొన్ని పద్యములు వ్రాయగా రాజు ఆగ్రహించి కవిని చంపించమని భటులను పంప పిరదౌశి సతీసుతా సమేతుడై గజనీ విడిచి బహుప్రయాసలంది ఎట్లో పారశీకము చేరి నివశిస్తుండగా— రాజు బుద్ధి మారి కవి ఋణము దీర్చుకొనదలచి అరువది వేల దీనారములు (బంగారు నాణెములు) ఒంటెలపై పంపించాడు కాని ఫలితం? ధనము తూర్పుదిక్కున వస్తే కవి శవము పడమటి దిక్కునుంచి శ్మశానముకు పోయింది. ఈ సందర్భములో తన కావ్యములో—

"సుకవి దేహంబు ప్రేతభూమికి లభింప
అర్థమపుడే శూన్య గేహమును జేరె,
నిమిష భేదంబునడుమ సంధింపఁబడిన
ఈ రహస్యంబుఁ గనుఁగొన నెవరితరము ?

ఇంత చిన్న విషయాన్ని ఎంత రమ్యతగా చెప్పాడో చూడండి. అంతేకాదు ఇంకా కవినిగూర్చి అంటాడు :

"కవినిఁగన్న తల్లి గర్భంబు ధన్యంబు ;
కృతినిఁజెందువాఁడు మృతుఁడుగాఁడు ;
పెరుగుఁదోటకూర విఖ్యాత పురుషులు
కవిని వ్యర్థజీవిఁగాఁ దలంత్రు."

"కలదేస్వర్గములాతివో ! కలుగనిక్కంబిద్దియే నీతి మంతుల విశ్రాంతి నికేతనం..........."

అనే సూక్తులు షాజెహాను తాజమహల్ ద్వారబంధాల మీద అరబ్బీ, పారసీ భాషలలో లిఖింపించాడు. భూలోక స్వర్గమనేది ఎక్కడైనా ఉన్నదంటే అది యిదే ! యిదే! యిదే! "ముంటాజ మహలు" కావ్యం గూడ చదవదగ్గదే. ముంతాజ్ మరణానంతరం షాజహాన్ వాపోవటం చూడండి—

"నీవువసించుచోట వసి
యింతువు నేనును దాచియుంపు మో
దేవి! యొకింత నేల చను
దంచెద రేపటి మాపటన్, నిరా
శావిషదహ్యమానమయి
సౌఖ్యపరాఙ్ముఖమైనయట్టి నా
జీవిత శేషమంకితము
చేసెద నీ కవివాహితుండనై."

"జీవరత్నంబవగు నిన్ను స్వీకరించి,
వట్టి రతనాలు నాయింట వదలినాడు

ఇచ్చి బులిపించి క్రమ్మర బుచ్చుకొనుట
యేటికలవాటు జేసెనో యీశ్వరుండు."

ఈ రకంగా "ముంటాజ మహలు" కావ్యం అంతా సాగిపోతుంది. ఈ చిన్న వ్యాసంలో ప్రతివాన్ని వ్యాఖ్యానించ వీలుపడదు.

అనన్య ప్రచారమందుకొన్న "గబ్బిలము" మహాకవి కాళిదాసు "మేఘసందేశము" నాధారము చేసుకొని వ్రాయబడ్డది. ఈ కావ్యమంతా కవి (జాషువా) తన స్వీయ చరిత్రనే విన్నవించుకొన్నాడు. మనకు ఒకరిద్దరు కాదు దేవతలు— ముప్పదిమూడు కోట్లమంది. ఇంతమంది యెగవడ్డమూలమున అందరికీ— ముఖ్యంగా బీదలకు పొట్టనిండా తిండిలేదు. ఈ కావ్యంలోనే ఒకచోట :—

"ప్రతిమల పెండ్లి సేయుటకు
వందలు వేలు వ్యయించుగాని దుః
ఖితమతులైన పేదల ప
కీరుల శూన్యములైన పాత్రలన్
మెతుకు విదల్పది భరత
మేదిని ముప్పదిమూడు కోట్లదే
వతలెగవడ్డ దేశమున
భాగ్యవిహీనుల క్షుత్తులారునే."

ఆరవనే చెప్పాలి. బొమ్మలపెళ్ళి చేయటానికైతే వందలూ వేలూ వస్తవి. బీదవాడికి మెతుకు విదల్పటానికిరాదు- అంటాడు కవి. నిజమే ఇంకా గబ్బిలముతోటే ఆ కథానాయకుడు (కవి) అంటాడు—

"ఆలయంబున నీవు వ్రేలాడు వేళ
శివుని చెవి నీకు గొంత చేరువగనుండు
మానిఖగరాజ్ఞి! పూజారి లేనివేళ
విన్నవింపుము నాదు జీవితచరిత్ర.

పూజారి గనక ఆలయంలో వుంటే చెప్పనివ్వడుసుమా! అని భావము. గుడికి మేం వెళ్ళటానికి వీల్లేదు. కాబట్టి నీవన్నాపోయి మా చరిత్ర ఆ పరమేశ్వరుని చెవిలో అలా ఊది రావమ్మా అని చెప్పుకొన్నాడు. "గబ్బిలముతోనే మరో చోట—

"పయిపై నవ్వులు పల్కరింపులు మృషా
బాంధవ్యముల్ సూపి యా
పయి శత్రుత్వము సేయునాగరక తా
భ్రష్ట స్వభావాధముల్
సయితానుల్ చరియింపనట్టిధర గో
ష్పాదంబు గన్పట్టినన్
దయతో నాకెరిగింపుమమ్మ యచటన్ నా
యిల్లు గట్టించెదన్.

ఈ పద్యంలో చెప్పినటువంటి స్థలం— చివరికి గోష్పాదమంతైనా సరే — ఎక్కడైనా కన్పిస్తే దయతో నాకు చెప్పాల్సింది గబ్బిలమా! అక్కడ నా యిల్లు కట్టిస్తాను అని అంటాడు నాయకుడు.

మనిషి బ్రతికి వుంటే ఒక్కడూ తలపడు; చస్తేగాని పేరు ప్రఖ్యాతులు బైటపడవంటాడు. నిజంగా అంతే గదండీ!

"బ్రతికియున్న సాయబాబె న్నడును గాడు
చావనున్న పట్టి సాయబయ్యె
తిరుమలేశుడైన తెలియడీ యర్థంబు
చావుబ్రతుకులోని సారమిదియె."

చస్తేగాని "సాయీబాబా" అనలేదు మనం! గబ్బిలానికి బంధుమిత్రులూ, శిష్యప్రశిష్యగణమూ అంతాగూడా హంపీ క్షేత్రములో వున్నారంటాడు.

"హంపీ క్షేత్రము జూచిపోవలయు న
మ్మా తెల్గురాజ్యంపు సై
లింప శ్రీల కొకానొకప్పుడదికే
లీరంగ మేతద్రమా
శంపావల్లరు లాటపోయినప్రదే
శంబందు నీ బందుగుల్
కొంపల్గట్టి నివాసముండెదరు నీ
కుంగూర్తు రానందమున్."

నిజంగానే యిప్పటికీ మనం హంపి పోయి చూచినట్లయితే లోపల గుడి భాగంలో గబ్బిలాలు గూళ్ళు కట్టుకొని నివాసముండటము మనం చూడగలము. ముఖ్యంగా వినాయకుడి గుడి ఈ గబ్బిలాల కంపుతో నిండి మనం లోనికి పోవటానికిగూడ వీల్లేకుండావుంది.

ఈ "గబ్బిలము" కావ్యం యింగ్లీషు భాషలోనికి తర్జుమా చేసినారని బొంబాయి సభలో పాడి వినిపించారని పేపర్లో వార్త చూచినాము.

ఆంధ్ర దేశమంతా అఖిలఖ్యాతిని పొందినవి వీరి "ఖండకావ్యములు". ఈనాటికిగూడ "సత్యహరిశ్చంద్ర" నాటకం ప్రదర్శిస్తే శ్మశానం సీనులో వీరి పద్యాలే

పాడ్తారు. అంటే బలిజేపల్లివారి పద్యాలు బాగుండవని కాదు— కాని వీరి పద్యాలు ఇంకా బాగుంటాయని నటకుల ఉద్దేశం. మచ్చుకు :—

"ఎన్నో యేండ్లు గతించిపోయినవి గా
నీ, యీ శ్మశానస్థలిన్
గన్నుల్ మోడ్చిన మందభాగ్యుఁ డొక
డైనన్ లేచిరాఁడక్కటా !
ఎన్నాళ్ళీ చలనంబులేని శయనం
బేతల్లు లల్లాడిరో !
కన్నీటంబడి క్రాగిపోయినవి, యీ
క్రూరంబగు పాషాణముల్.

"కవులకలాలు, గాయకుల
కమ్మని కంఠము, లీశ్మశానపుం
గవనుల ద్రొక్కి—చూచెడి నొ
కానొకనాఁడల కాళిదాస భా
రవుల, శరీరముల్, ప్రకృతి
గంగమునందిపుడెంత లేసి రే
ణువులయి, మృత్తికం గలిసె
నో కద ! కమ్మ రివానిసారెపై."

(ఖండకావ్యము 1 భాగం నుంచి)

ఇట్లాగే మఱికొన్ని పద్యాలు సాగిపోతాయి.

"అఖండగౌతమి" అనే శీర్షికలో (ఖండకావ్యము 2 భాగంనుంచి) గౌతమీ నదినిగూర్చి—

"పుట్టిగతించి పోయెదున్న
పుల్ ధరణీవిభవంబుఁగోరి, నీ
గట్టున నుగ్రసంగర
ముఖమ్మున నెందఱు క్రుంగినారొ ! నీ
పొట్టకు వారి యస్థికలు
భోజనమయ్యెఁ గదమ్మ ! చావులే
నట్టి, సుధాశరీరి మహి
మాన్విత ! వందనమమ్మ ! గౌతమీ !

అన్నాడు. ఇంతమనోహరమైన భావాన్ని పద్యరూపంలో పెట్టిన కవి ధన్యుడు. ఇప్పటికీ గౌతమీనది వడ్డునే శవాల్ని దహనం చేయటం. అస్థికలు నదిలోకలపటం అక్కడ ఆచారంగా వున్నదంటారు. దాన్నే మనసులో పెట్టుకొని కవి ఈ పద్యం వ్రాసియుంటాడనుకొంటాను. ఏదేమైనప్పటికీ పద్యం పోకడ చూస్తూంటే శ్రీనాథుడు వ్రాసిన "తల్లీ కన్నడరాజ్యలక్ష్మి" జ్ఞప్తికి రాకమానదు.

అక్షరజ్ఞానము అలవడినంతమాత్రాన విజ్ఞానం వెద జల్లలేరు అంటాడు "నాకథ" కావ్యంలో—

అక్షరజ్ఞాన మలవడ్డయంతమాత్ర
తేజరిల్లదు విజ్ఞాన దీపకళిక
భరతపురుషోత్తముని జంపి యురికిచన్న
గోడసేకూడ చదువుకొన్నాడు లెస్స."

గాంధీమహాత్ముని చంపి ఉరితీయబడ్డ గోడ్సేగూడ చదువుకున్నవాడే.

కొన్నాళ్ళు జాషువగారు పిచ్చయ్యశాస్త్రిగారితో జంట కవిత్వం చెప్తూ పేర్లు కలియక విడిపోయారు. అదే తన "నాకథలో" అంటాడు.

"నా పేరు ముందునిల్పం
బాపంబదియేమొ జాషువా పిచ్చులగున్.
నా పేరు చివర నిల్పిన
శాపం బిడినట్లు పిచ్చజాష్వాలయ్యెన్.

"నాకథ"లో జాషువగారి ధారణాశక్తి, బాల్యరుచులు, కొంతవరకు అతని కవితకు పునాదులైన వనవచ్చును. పేదరికమునబుట్టి "కీడెరుగని పోకిరుల జట్టుగురువై" "పేప బెత్తము నంటింపనితావు" లేని వీపుతో "నెత్తి కిన్ బొప్పుల భిక్షనందుకొనుచు" "కొంటె పనులకు" కొంత అవకాశమిస్తూ పెరిగి పెద్దయై "గబ్బిలము" ముఖమున తన జీవితచరిత్రను దైవానికీ, ప్రజానీకానికీ విన్నవించుకొన్నాడు.

"కవితా విశారద" "కవి కోకిల" "నవయుగ కవి చక్రవర్తి" "కవి దిగ్గజ" "మధుర శ్రీనాథ" "ఉభయ భాషాప్రవీణ" యిత్యాది బిరుదాంకితుడై విజయవాడలో కీ. శే. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారిచేత గండపెండేరము తొడిగించుకొని గజారోహణ మహోత్సవమునందారు. వీరికి 29—1—1953 తేదీన గుంటూరులో శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారి అధ్యక్షతన బ్రహ్మాండమైన సన్మానము జరిగింది ఆ సమయంలో గుంటూరు పౌరులు సుమారు 25 వేల రూపాయలు సమర్పించి కనకాభిషేకము చేసినారు. ఆంధ్ర దేశం నలుమూలల్నించీ కవులు పాల్గొన్నారు. ఇంతటి సన్మానం నాకెన్నడూ జరగలేదని కవిగారే అన్నారు.

"భానియెత్తున నుత్సవాల్ జరిపి
నాపాదాన రత్నాల పెం

# నవకవి జాషువా

డారంబుల్ గయిచేసి పంపినవ
దాన్యశ్రేష్ఠులున్ సుంత యా
ధారంబున్ దలపోయలేదనిన నేత
ద్గౌరవంబెల్ల గుం
టూరుం బౌరులకీయగాదలచి
రేమో యీశ్వరప్రేరణన్."

సాధారణంగా ప్రజల్లో జాషువా అంటే నల్లగా, పొడుగ్గా, సిల్కు కండువాలు, సిల్కు గుడ్డలతో వుంటాడనే నమ్మకమొకటుంది. ఆ సందేహంకూడా నివృత్తి చేశాడు.

"కలవారిచ్చిన పట్టువస్త్రములతో
గన్పట్టునన్ జూచి శ్రీ
గలవాడీతడటంచు నబ్బురన
నాకర్ణించి, నాకన్న కో
డుక్కలు జొట్టాలును డబ్బులేదనిన సం
కోచింతు రీనాటి క
న్యల మా కేల ? ప్రచారమందుబుతమున్
శుదావృతంబయ్యెడున్."

నిజంగా ఈ మహాకవినిగూర్చి చెప్పాలీ అంటే ఒక గ్రంథం అవుతుంది. వీరిని గురించి ఏ సభలోనైనా "అమరేంద్ర"గారు మాట్లాడటము తటస్థపడితే, తప్పకుండా యిట్లా చెప్తారు. "జాషువా కవిత్వం అంటే నాకు జావా జ్ఞాపకం వస్తుంది. ఎందుకంటే 'జావా'కు మధ్యలో ఒక్క అక్షరమే వుంది. జావా పంచదారకు ప్రసిద్ధి. అట్లాగే వీరి కవిత్వంగూడా జావాపంచదారలా గుంటుందంటారు.

నాటకాలు, కావ్యాలు, నవలలు, ఖండకావ్యాలు, యుద్ధగేయాలు మొదలైనవి దాదాపు 25 గ్రంథములకు కర్త ఈ కవిరాజు. ఈతని కలము అశృంఖలము. రమణీప్రియదూతిక విడెము తెచ్చి యిచ్చిందోలేదోగాని, కవితారమణీయతకు లోటులేదు. ఈ మహాకవిని కలకాలము బ్రతికించి, పోషించి ఆంధ్రభాషా సౌభాగ్యము నుద్ధరించుట ప్రతి ఆంధ్రునిమీదను వుందని వేరే చెప్పనక్కరలేదనుకొంటాను.

★

## ఎవరికైనాసరే

— .o. —

### కెమేరా కథ :

రకరకాల ఫొటోలు చూస్తున్నాం. ఇవి ఎలా తయారవుతున్నాయి ? కెమేరా ఎవరు కనిపెట్టేరు ? ఎలాంటి మార్పులు వచ్చాయి ?

దీనికి సంబంధించిన విజ్ఞానం శ్రీ వేమరాజు భానుమూర్తిగారు రచించిన కెమేరా కథ చదివితే వివరంగా తెలుస్తుంది.

### ఉరుములు - మెరుములు :

వీని రహస్యం ఏమిటి ? అవి ఇంద్రుని రథచక్ర ఘోషలా ? ఇంద్రచాపంయొక్క తళతళలా ? అవేవీకావు, అవి ఏమిటో మీకు తెలుసుకోవాలని ఉంటే, వాని హేతువును గురించిన విజ్ఞానం కావాలంటే, శ్రీ వేమరాజు భానుమూర్తిగారు రచించిన ఉరుములు - మెరుములు అను వ్యాసం చదివితే సులభంగా బోధపడుతుంది.

రెండణాల పోస్టు బిళ్ళ ఆంధ్రమహిళ మేనేజరుగారికి (మైలాపూరు, మద్రాసు) పంపిస్తే, ఆ ప్రతులు రెండూ మీకు అందుతాయి.

# శ్రీ భ్రమరాంబా నవరత్నములు

శ్రీమతి రావూరి వేంకటసుబ్బమ్మ

శ్రీశైలయాత్రలో అచటి దేవాలయాధినాథుడగు మల్లికార్జునుని యర్ధాంగియైన భ్రమరాంబను గాంచుటతోడనే గల్గిన భావోద్రేకములో వ్రాసిన పద్యములు.

కం॥ మాతా శ్రీభ్రమరాంబా
శీతాచలతనయ నిన్ను సేవించియునే
నాతతభక్తిని నీకిటు
చేతోముద మొదవ మనవి చేసెదనమ్మా॥

కం॥ పురుషులు కార్యభరంబున
తరుణుల కష్టంబులెఱుగ దలపరుగానన్।
దరుణీమణి వాటనునీ
కెఱిగింతును స్త్రీల వెతలనించుక దేవీ॥

సీ॥ పతిసేవ లెప్పుడు పదిలంబుగా జేసి
చుట్టాల నెనరుతో జూచుచుండి
శిశువుల బోషించి, పశువుల పాలించి
సంసారమును జాలజక్కబఱచి,
శాకపాకంబులు చవులూరగా జేసి,
విరివిగా వడ్డించి వేరు వేర
అల్లుళ్ళకూతుళ్ళ నాదరించుచు వేడ్క
కొడుకులకోడండ్ల కూర్మిజూచి।

గీ॥ రేపకడ లేచి యీనడు రేయిదాక
విశ్రమింపక కార్యంబు లశ్రమమున
ఇంపుతో చేసి యిలుదీర్చి యీశుగొల్చి
గేస్తురాలినిగను మమ్మ గిరితనూజ !॥

కం॥ పెనిమిటి బిడ్డలకొఱకై
తనయొడలిని దాచుకొనక తపితపమం
పడుచున్
కొనయూపిరి యున్నంతకు
ననవరతము సేవచేయునంటఱకెపుడున్॥

తే॥గీ॥ కలిమి లేములు కష్టముల్ గాపురముల
వెలదులందఱకుండును వివిధగతుల
మగనిమన్నన గాంచెడుమగువలకును
కలిమిలేములు కష్టముల్ గానబడవు॥

గీ॥ "విధివశంబున గొందఱు విభుల బాసి,
విభవముల కెల్ల వెలియౌచు పేదలగుచు
కన్నబిడ్డల బోషింప దెన్ను లేక
వివిధబాధలనొందెడు విధముకనుము.

గీ॥ "సాటిమగువవుకాన నేనాటికైన
భక్తి భజియించి శక్తినిబడయవచ్చు
ననెడు నాశను నినుగొల్తునహరహంబు
నెలమిపూజించు నీజాతినేలుమమ్మ !"

సీ॥ రాజకీయములందు రణరంగములయందు
గణితంబునందు సత్కళలయందు।
శాసనసభలందు సరకులమ్మటయందు
పరిశోధనములందు పదవులందు
పాఠశాలలయందు బహుసమాజములందు
కవితయందును నాట్యకళలయందు
విలువిద్యలందును పలువైద్యములయందు
వ్యవసాయమునఁ దపోబలమునందు

గీ॥ పురుషులనుమించు ప్రజ్ఞనుఁ బొందుపొలతి
నిపుణమతి తోడ కార్యముల్ నిర్వహింప
గలిగియుండుట నీకటాక్షమునగాదె
సర్వమంగళ భ్రమరాంబ, శ్యామలాంబ॥

కం॥ మనలో మన మాటలుగా
చనవుననీతో వచించు సంగతులెల్లన్
తనువిచ్చిన పతియైనను
వినుపింపకు మమ్మ నీదు విభునకునెపుడున్॥

---

# సంక్రాంతికోడె

కె. సభా

మైలవన్నెతో మెరుగులీనే భైరవుని సాక్షాత్ వృషభేశ్వరునిలాగా అలంకరించాడు చెంగయ్య. ఊదారంగు తోలు పట్టెడకు కుట్టిన వెండి మువ్వలు గలగలమని నవ్వుతున్నాయి. కొమ్ములకువేసిన బంగారుపూతలకుప్పెల కొనల్లో వంకాయ గజ్జెలు నృత్యంచేస్తున్నాయి. మెడలో పచ్చార్లు పూలసరాల్లా వ్రేలాడుతుంటే భైరవుడు ప్రయాణమయ్యాడు.

కోలాట చెంగయ్య క్రొత్తగా కుట్టించిన పట్టు కురతాను భైరవునికి తొడిగాడు. భార్య మంగమ్మ ఎఱ్ఱనీళ్ళు కలిపి ఒక బొగ్గుముక్కను, నాలుగు కూటి మెతుకులను అందులోవేసి తమలపాకుపై గడ్డకర్పూరంపెట్టి ముట్టించి భైరవునికి మంగళహారతిచ్చి దృష్టితీసి మెటికలువిరిచింది.

సన్నాయి డోలు నాగస్వరం మేళం ప్రారంభమైంది. నెమలికుచ్చుల పిల్లన గ్రోవు ఊదుతూ సుబ్బయ్య భజన ప్రారంభించాడు. పంబల రాజయ్య ప్రణవ నాదంతో కోలాట చెంగయ్యగారి భైరవుడు వీధిలోకి వచ్చి నిలబడ్డాడు. అడుగడుక్కి ఒకొక్కక్క కొబ్బరికాయ దిష్టితీసి శూరాకాయ కొడుతున్నారు. ఇంటింటి వద్దా మంగళహారతులే. భైరవుని శరీరం నిండుతూ మల్లెపువ్వులే, చేమంతి పూల తోరణాలే.

ఈ ఏడు గ్రామానికంతా అదొక్కటే కోడె పందానికి పోతున్నది. ప్రతి సంక్రాంతికీ నగరిలో బండనీడ్చే పందెం జరుగుతుంది. భైరవునిలాగే చాలా గ్రామాల నుండి నందీశ్వరులు వస్తారు. బలముంటే బండ నీడ్చి వచ్చు. ఈడ్చిన కోడెగల రైతుకు వెయ్యి రూపాయలు బహుమానం. ఈవెయ్యి రూపాయ లలాపుంచి వేలకొద్దీ జనంలో అ రైతుకెంత గౌరవం వస్తుందో చెప్పతరంకాదు.

ఊరుపొలిమేరకువచ్చిందే మేళతాళాలుఆగిపోయినై. "ఈసారి భైరవుడు గెలుస్తాడు" అంటూ ఊళ్ళో పెద్దలు దీవెనలు కురిపించారు. కోలాట చెంగయ్య మీసాలను తడుముకుంటూ చిరునవ్వు విసిరి తనతోపాటొక పాతిక మందిని పిలుచుకొని నగరికి బయలుదేరాడు,

నగరిలో అప్పుడే కలకలంగా వుంది. గాలి గోపురం నుండి నగరి సింహద్వారం వరకూ జనం క్రిక్కిరిసి పోయారు. మేడలూ మిద్దెలూ నిండి పోవడంతో పాటు చెట్లకొమ్మల నిండా మనుషులే. నగరి సింహద్వారం వద్ద నున్న బండను గుడిగోపురం ముందున్న ధ్వజ స్తంభం వరకూ లాగాలి. దాదాపు నలభై కోడెలు వచ్చి వున్నాయి. అన్నీ కండలు బలిసి గుండుదేలినై. వాటి గుండెల బలాన్ని చూపటానికి రుసరుసలాడుతూ ఖణేల్ ఖణేల్ మంటూ రంకెలు వేస్తున్నాయి.

రాహు కాలం గడచిన ఐదునిముషాలకల్లా పందెం ప్రారంభమైంది. నగరినుండి దొరవారువచ్చి సింహద్వారం వద్ద వేదికమీద కూచున్నారు. దివానుగారు బొజ్జనీడ్చుకుంటూవచ్చి ఆ ప్రక్కనే కూలబడ్డారు. ముందుకట్టిన ఏడెనిమిది కోడెలు అసలుబండనే కదిలించలేకపోయినై. ఆ వెనుక రెండు మూడు మాత్రం అంగుళం పాటు కదిలించాయి. ఒక కోడె నిలువునా నెత్తురు కక్కి పడిపోయింది.

ఒక్కకోడె గూడా బండను ఒక్క అడుగైనా కదిలించక పోవటంచూచి ఎవరో మంత్రవాది బండకు కట్టు కట్టాడని జనంలో గుసగుసలు గూడా బయలు దేరినై. ఈ స్థితిలో భైరవుడు ఖణేలుమని రంకెవేసి బండ ముందు నిల్చున్నాడు. జనమంతా కోడెవైపునకు చూపులను ప్రసరించారు.

కోలాట చెంగయ్య గొలుసులు బిగించి గోపురం లాంటి మూపురాన్ని దువ్వి గంగడోలును కదిలించి ముందడుగు వేశాడు.

ఒక్క ఊపుతో భైరవుడు ముందుకు దూకాడు. బండ బరబరామంటూ నేలమీద ప్రాకింది. నాలుగడుగులు కదిలింది. మళ్ళీ చెంగయ్య భైరవుని వీపుమీద మెత్తగా చేయిపెట్టి ఒత్తి నవ్వుతూ చక్కిలిగింత పెట్టాడు. ఈ మారు ఉల్లాసంతో భైరవుడు ఒక్కటే ఊపులో ఏడు గజాలు ముందుకువెళ్ళాడు. జనంలో కోలాహలం హెచ్చి చప్పట్లురెచ్చి పూలగుత్తులు వచ్చి పడ్డాయి.

# సంక్రాంతి కోడె

కోలాట చెంగయ్యా ఆనందాన్ని పట్టలేక మీసాలు మెలివేస్తూ భైరవుణ్ణి పలకరించి హుషారుగా మెడ పట్టెడను పట్టి ముందుకు లాగి విడిచాడు. ఈ దెబ్బతో ముందుకు వెళ్ళినకోడె రెండడుగుల్లోనే పట్టుదప్పి బోరగిలా పడ్డది. కాలు నొప్పి పట్టుకొన్నది. లేచి నిలబడలేక పోయింది. కోలాట చెంగయ్యా తల క్రిందికి వంగిపోయింది. పాళేగారి మనుషులు వచ్చి గొలుసులు విప్పారు. భైరవుడు కుంటుకుంటూ దెబ్బతిన్న యోధునిలాగా తలవాల్చుకొని ముందు నడిచి పోతుంటే ప్రజలు వెక్కిరిస్తూ చప్పట్లు కొట్టారు. ఎవరో "కోస కోస" అంటూ కేకలు వేస్తే ఉండబట్టలేక కోలాట చెంగయ్యా తలపైకెత్తి ఒక్కసారి జనంవైపు చూచి మీసాలకొనలపై వ్రేళ్ళను పోనిచ్చాడు. కుర్రకారు మరీ రెచ్చిపోయి గోల చేస్తుంటే చెంగయ్యా ఒక్క క్షణం ఆగలేక అవమానభారంతో ఆగుంపునుండి బయటపడ్డాడు.

ఎన్నికలలో నిలిచి ఓడిపోయిన అభ్యర్థి ముఖంలాగా చెంగయ్యా ముఖం మాడి పోయింది. భైరవుని వంక చూశాడు. పాపం! కళ్ళల్లో నీళ్లు గిర్రుమని తిరుగుతున్నై. చెంగయ్యా కోపం చల్లారి పోయింది దురదృష్టం చేత. కాలు పట్టుదప్పకుంటే ఈలాంటి బండలు వందైనా భైరవుని కొక్కలెక్కలోనివి కావని అతనికి తెలుసు.

తన్ను ఓదార్చడానికి వచ్చిన పరివారంతో ఎక్కువ మాట్లాడకుండా భైరవుని మెల్లగా నడిపించుకొని రాత్రి పదిగంటలకల్లా యిల్లుచేరాడు. భైరవుడు ఓడిపోయాడని ఊరంతా తెలిసి పోయింది. ఐనా కాలునొప్పి పట్టుకుంటే కథ వేరుగా వుండేదనిచెప్పుకొని ఒకరినొకరు ఊరడించుకొన్నారు.

ఆరోజునుండే కోలాటచెంగయ్యాకు పౌరుషంగుండెల్లో గూడుకట్టుకొన్నది. ఆకుపసరుపట్టువేసి ఉడుకునీళ్లుకాపడం యిచ్చి కాలునొప్పిని మాన్పాడు భైరవుడికి.

రోజూ భైరవుని ఆహారంలో ప్రత్యేకశ్రద్ధ తీసుకొన్నాడు. పత్తిగింజల పిండి,—వేరుశనగపిండి,-సంగటి, చెరుకుమోసులు ఎన్నిరకాలు-కోడిగుడ్లాకులు లెక్కలేనంత తెచ్చిపడేశాడు. అరటి పండ్లు రాగిపిండి కలిపి దగ్గరుండి తినిపించేవాడు.

భైరవుడింతగా తిని బలిసినాఒక్కరి జోలికీ పోయేవాడుకాడు. అంచేత పల్లెలో దోగాడే పసిపాపకూడా భైరవునికి తమకుదొరికిన దినుబండారాలిచ్చేది. భైరవు డందరికీ బంధువై పోయాడు. ప్రతి పడుచూ ఆదరంగా సద్ది సంగటి తినిపిస్తే గంగడోలు కదిలించు కుంటూ వస్తాదులాగా అందుకొనేవాడు. భైరవుడు వీధిలో నడిచి పోతుంటే చూచేవాడల్లా ఈసారిమనదేగెలుపు అనేవాడు.

అనుకుంటుండగానే ఏడాదిగడిచిపోయింది. సంక్రాంతి పందానికి అందరూ సరాదా పడుతూ భైరవుణ్ణిముందు కంటే ఎక్కువగా శృంగారించారు. కాళ్లకు పట్టు దప్పకుండాపనితనంవానిచేత గిట్టలకు నాడాలుకొట్టించారు. బిర్రబిగిసినకండబలంతో భైరవుడుసింహంలా గర్జించి తోకను పైకెత్తికొండనైనాకుమ్మి వేస్తానని నిలబడ్డాడు. గ్రామమంతా ఆఉత్సాహాన్ని చూచి ఉద్రూతలూగి పోయింది. కాని ఒక్కచెంగయ్యా మాత్రం లేవలేని స్థితిలో గడపవద్ద తలుపుకానుకొని నిలబడి నాలుగు ఆనందాశ్రువులు రాల్చాడు. అతనికి వీపులో జల్లెడకురుపు లేచి యమయాతన పడుతున్నాడు. మంగమ్మ దృష్టితీసి భైరవుని నొసటన కుంకుమ పెట్టింది. ప్రక్కనున్న గౌరమ్మ దిష్టి తగులు తుందని సన్ననినల్ల చుక్కనుగూడా పెట్టింది. ఈమారు నగరికి సద్దిమూటలతో బళ్ళు కట్టుకొని వందమందిబయలు దేరారు. భైరవుడు మహాసేనానిలాగాఠీవిగా ముందు వెడుతుంటే మేళ తాళాలు భాజా భజంత్రీలు కోలాటలు పిల్లనగ్రోవులు వెనక సాగినవి.

మంగమ్మ ఏడుకొండలవానికి మీదెత్తిసాంబ్రాణిపొగ వేసి ఉట్టికి కట్టింది. కోలాట చెంగయ్యా ఆదిక్కును చూస్తూ మీసాలను మెలివేసి "ఈసారి నవ్వనీ నా...." అనుంకుటూ లోపలికి వెళ్ళిమంచంమీద పడుకున్నాడు.

అతనికి నగరికిపోలేక పోయాననే బాధ కురుపుబాధ కంటే ఎక్కువై పోయింది. "నాకోడెగెలిచినపుడు, నేను మీసాలు మెలవేసినపుడు ఆనాడు నవ్వినవారంతా, చూడాలి నగరి దొర. సింహాసనం నుండీ దిగివచ్చి నామెడలో పూలహారం వేసి వెయ్యిరూపాయల పట్టుసంచి నివ్వాలి" ఇదీ అతనిస్వప్నం. ఆరైతు బిడ్డ కోరిక. అందుకే భైరవుని పెంచాడు. తయారుచేశాడు. కానీ ఆమహోత్సవాన్ని—ఆసంరంభాన్ని - ఆభిమబల ప్రదర్శనాన్ని చూచే అదృష్టం లేక పోయింది.

ఐనా నాభైరవుడు గెలుస్తాడనే మనో నిశ్చయంతో ఆరాత్రి పడుకున్నాడు. స్వప్నంలో భైరవుడు విజృంభించినట్టు, అతని వెనుక ఈశ్వరుడే నిల్చున్నట్టు కలగన్నాడు.

# సంక్రాంతి కోడె

నగరిలో ఈ ఏడు క్రొత్త ఏర్పాట్లు చేశారు. జనాలు ప్రక్కల్లో నిలబడటానికి వెదుళ్ళతో అడ్డు పెండెలు కట్టారు. కోడెలు ఆగడానికి కొట్టాలు వేయించారు. కోడెల తాలూకు మనుష్యుల విడిదికి ప్రత్యేకమైన వసతులు ఏర్పాటుచేశారు. గెలిచిన కోడెకగలరైతుకు వెయ్యి రూపాయలు బహుమతి యివ్వడమేగాక ఆ గ్రామానికొక ఆబోతును గూడా బహూకరిస్తానని జమీందారు ప్రకటించాడు.

గత సంవత్సరం లాగానే ఈసారి గూడా ముందు దాదాపు ఇరవైకోడెలు బండను కదిలించలేకపోయినై, ఒక్కటి రెండంగుళాలు కదిలించాయి. కొన్నిటికి బాగాలేత ఈతకల్లు పోశారు. అవి కైపెక్కి కళ్ళుదిరిగి క్రిందపడి విలవిలమంటూ తన్నుకొన్నాయి.

భైరవుడు వచ్చి నిలబడ్డాడు. "కోలాట చెంగయ్య కోడె కోలాట చెంగయ్య కోడె" ఈ వార్త జనంలో ప్రాకి పోయింది. చెంగయ్య కొడుకు గంగరాజు గొలుసులు బిగించాడు. గోపురంమీది నగారా ధనాధనామంటూ మ్రోగింది. కొమ్ములూ తుతార్లు చెవులను చిల్లులు పొడిచాయి. ఆధ్వనులను దూసుకొంటూ భైరవుడేసిన రంకె ప్రజలను గగ్గోలు పెట్టింది. నాలుగు నిమిషాల్లో ఇరవై గజాలు సాగిన బండ పటపటమంటూ గొలుసులు తెగిపోవటంతో నిలచిపోయింది. భైరవుడు మహోగ్రుడై కైలాసాన్ని పెకలించటానికి నిలబడ్డ నందీశ్వరునిలాగా కాలుదువ్వుతూ ఘనాఘన నినదంతో గర్జించాడు. ప్రజల్లో ఒక్కటే చప్పట్లు. వెంటనే చాటింపు విన్పించింది. పందెం పూర్తిగాలేదని దేవునిరథానికి కట్టే గొలుసులు తెచ్చి బిగించారు బండకు. భైరవుడు మళ్ళీ బుసలుగొడుతూ రుసరుసమంటూ వచ్చి నిల్చున్నాడు. గంగరాజు గొలుసులు బిగించాడు. ఒక్కటే ఊపు నేలమీద నుండి లేచిన దుమ్ము గగనాన్ని కప్పింది. ధ్వజస్తంభాని కవతల నిల్చిన భైరవుడు అంతతో ఆగక కోపంతో ఆస్తంభాన్ని మూడు చుట్లుచుట్టాడు.

గంగరాజు పరుగెత్తివెళ్ళి ముందు నిలిచాడు. మూపురాన్ని దువ్వుతూ శాంతివచనాలు పలికాడు. పాళెగాడు దిగివచ్చి గంగరాజు మెడలో పూలహారం వేశాడు. వెయ్యిరూపాయల పట్టుసంచి బహూకరించాడు. భైరవుడు ఆనందాన్ని పట్టలేక బిగ్గఱగా రంకె వేశాడు. మేళ తాళాలతో నగరి వీధిలో ఊరేగాడు భైరవుడు. భైరవుని ప్రక్కన కురుకురు మీసలను పురివేసుకుంటూ గంగరాజు కాలకంరునిలా నడిచాడు.

ఉత్సవం అయిపోయింది. భైరవునికి తోడుగా పాళెగాడు గ్రామస్తులకు బహూకరించిన ఆబోతును తోలుకొని యింటికి వచ్చాడు గంగరాజు.

చెంగయ్య స్థితివచ్చే పొయ్యే ప్రాణం లావున్నది. అతనికి నోటమాట పడిపోయింది. భైరవుడేమయ్యాడో నన్న బెంగ ఒకటి పీడిస్తూనే వుంది. గంగరాజు లోపలికి వెళ్ళాడు. భైరవుడు నాలుగు నిముషాలు బైటనే నిలుచున్నాడు. మంగమ్మ గంగడోలు కదిలించి కన్నీరుపెడుతుంటే అనుమానంవచ్చి నట్టుందివెంటనే చొరవచేసుకొని యింటిలోనికి చొరబడింది. కోడె లోపలికిపోతుంటే ఎవరూ అటకాయించలేక పోయారు. నట్టింట మంచం మీద పడుకున్న చెంగయ్య కళ్ళు తెరచి చూశాడు. భైరవుడు గంగడోలు నందిచ్చాడు. "గెలిచావా భైరవా!" అస్పష్టంగావిన్పించిన ఆమాటలకు భైరవునికర్థంతెలుసు. అవునన్నట్లు తలనూపాడు. గంగరాజు పట్టుసంచినిపైకెత్తి పట్టాడు. చెంగయ్య సంతృప్తితో కన్నుమూశాడు.





ఆనందదాయినియగు గృహిణి ఉంటే ఆనందమయమగు గృహము తథ్యము! పంచవర్ష ప్రణాళిక సాధించుటకు, భారతదేశ నిర్మాణ కార్యక్రమములు సఫలీకృతమగుటకు ధనము మిగుల్చు కొనవలయును - మహిళల 'పొదుపు' ఉద్యమము ద్వారా దానిని సాధించుటకు భారత సౌభాగ్య నిర్మాతలు సమాలోచిస్తున్నారు.

# మహిళల పొదుపు ఉద్యమం

జాతీయాభివృత్తి పథకముల నిర్వహణ ధనసంపత్తిని కూర్చుటయం దాధారపడియున్నది. ఈ సందర్భమున నేషనల్ సేవింగ్సు ఉద్యమం చాలప్రధానపాత్ర వహించ వలసి ఉన్నది. ఇందలిభాగమైన మహిళల పొదుపు ఉద్యమం జనులలో పొదుపరితనమును గూర్చిన సందేశమును వ్యాపింపజేయుచు, అమూల్యమైన కృషి చేయుచున్నది. అయినప్పటికి ఇంకా ఎంతోచేయవలసినది ఉన్నది. ఈ ఉద్యమమునకు సంబంధించిన వారందరు పట్టణప్రాంతములలోను పల్లెప్రాంతములలోను ఉన్న జనులను ఆదాయములనుకూడ బెట్టి ప్రభుత్వమునకు పెట్టుబడి పెట్టవలసినదని ఉద్బోధించి పాటుపడవలసి ఉన్నది. ప్రభుత్వము పంచవర్ష ప్రణాళికలోని కార్య క్రమమును జయప్రదంగా నిర్వహించుటకుగాను స్వల్ప ఆదాయ సర్టిఫికెట్లను ఎక్కువగా కొని పొదుపుపక్షోత్స వాలను జయప్రదంకావించవలసినదని ఆంధ్ర పౌరులను కోరుచున్నాను.

సి. డి. దేశ్‌ముఖ్,
భారత ప్రభుత్వ ఆర్థికమంత్రి.

మహిళల పొదుపు ఉద్యమం తిరిగి ఉత్సాహము నందుకొన్నది. గడచిన వత్సరాలలో ఇది జయ ప్రదంగా నడిచింది. మహిళల కృషి ఈ సంవత్సరము కూడ ఫలించకపోవుటకు కారణము కన్పించదు. బహుముఖముగా వ్యాపిస్తున్న స్వరాజ్యమును సుస్థిరం చేయుటకు సర్వవిధాలా ధనాన్ని సమకూర్చుటకై దేశంలోని పురోగమ శక్తులకు సమయమువచ్చినది. ప్రథమ పంచవర్ష ప్రణాళికకూ, రెండవదానికిన్నీ చాలా ధనము కావలసియున్నది. అది తేలికగాకూడ బెట్ట వచ్చును పెద్ద మొత్తములకంటె చిన్న చిన్న విరాళ ములు పోగుచేసి భర్తీచేయవచ్చును. నారీలోకమే ఈ ఉద్యమానికి పూనుకున్నప్పుడు, నిర్బంధ ఆదాయముల వల్ల తమకు తామున్నూ, ఈ ఆదాయములు సత్కార్య ములకు వినియోగింపబడుటచేత దేశమునకున్నూ, అపారమైన సేవ కావించినవారగుచున్నారు. ఈ కష్టతర కార్యభారము వహించుటకు పూనుకొనిన ఈ కార్య సంఘమును అభినందించుచున్నాను. గతవత్సరములకంటే ఘనమైనవిజయమును గాంచెదరని నమ్ముచున్నాను.

భో. పట్టాభిసీతారామయ్యా,
మధ్యప్రదేశ్ గవర్నరు.

---

30 వ సెప్టెంబరు 1954 తేదీతో అంతమయిన సంవత్సరములో లక్షక్షమించిన ధనమును సర్టిఫికెట్ల అమ్మకము ద్వారా సమకూర్చిన మహిళా సంస్థల వివరములు.

| | | |
|---|---|---|
| రాజస్థాన్ మహిళా సమితి, జయపూర్ | రు. | 10,06,230 |
| నేషనల్ కౌన్సిల్ ఆఫ్ విమెన్, బొంబాయి | | 6,76,895 |
| భారత్ స్కౌట్స్ అండ్ గైడ్స్, ఢిల్లీ | | 5,32,410 |
| భారత్ సేవక్‌సమాజ్ (స్త్రీలశాఖ), రాయపూర్ | | 4,88,970 |
| భారత్ సేవక్‌సమాజ్, నాగపూరు | | 4,63,955 |
| ఆలిండియా విమెన్స్ కాన్ఫరెన్సు, జలంధర్ | | 3,05,000 |
| బోయ్ స్కౌట్స్, ఢిల్లీ | | 2,40,000 |
| నేషనల్ కౌన్సిల్ ఆఫ్ విమెన్స్, జయపూర్ | | 2,30,500 |
| భారత్ స్కౌట్స్, ఉదయపూర్ | | 1,78,015 |
| ఆర్మీ విమెన్స్ సేవింగ్స్ కమిటీ, జబల్పూర్ | | 1,67,425 |
| మహిళామండలి, గొండాల్ | | 1,64,800 |
| మహిళామండలి, గ్వాలియర్ | | 1,61,200 |
| నేషనల్ కౌన్సిల్ ఆఫ్ విమెన్, లక్నో | | 1,40,205 |
| ఆంధ్ర యువతీమండలి, హైద్రాబాద్ | | 1,27,620 |
| భారత్ స్కౌట్స్, జోధ్‌పూర్ | | 1,15,615 |
| భారత సేవకసమాజ్, ఇండూర్ | | 1,07,110 |
| విమెన్స్ వెల్ఫేర్ సొసైటీ, బెల్గాం | | 1,05,685 |
| భాగినీసమాజ్, మంగళూరు. | | 1,03,205 |

30 వ సెప్టెంబరు 1954 తేదీతో అంతమయిన సంవత్సరములో మద్రాసు నగరములోని వివిధ మహిళా సంస్థలు నేషనల్ సేవింగ్స్ సర్టిఫికెట్ల అమ్మకం ద్వారా సమకూర్చినధనము.

| | | |
|---|---|---|
| విమెన్సు యిండియన్ ఎసోసియేషన్ | రు. | 37,310 |
| ఆంధ్ర మహిళా సభ | | 43,585 |
| అవ్వాయి హోమ్ | | 20,850 |

# సౌభాగ్య నిర్మాతలు స్త్రీలు

—— .o: ——

మహిళల పొదుపు ఉద్యమంయొక్క కేంద్ర సలహా సంఘములో ఆంధ్ర ప్రతినిధి అయిన శ్రీమతి టి. జి. హైమవతిగారు ఆంధ్ర దేశంలో యీ ఉద్యమం ఏవిధంగా నిర్వహింపబడుతూ ఉన్నదో విశదీకరించారు. ఇటీవల విశాఖ పట్టణంలో పక్షోత్సవాలను ప్రారంభిస్తూ ఈ క్రిందినివేదికను చదివారు.

మహిళల పొదుపు ఉద్యమం 1953 లో ఏ విధముగా ఏర్పాటయినదీ, అప్పటినుంచి ఆసంస్థ ఎట్టి కృషి కావించినదీ క్లుప్తంగా వివరిస్తాను. అప్పట్లో ఇండియా ప్లానింగు కమిషన్‌లో సభ్యురాలుగా ఉన్న శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్‌గారి సలహా ప్రకారం ఆర్థిక మంత్రిత్వశాఖ ఆధీనములోని నేషనల్ సేవింగ్సు సంస్థలు ఉన్న పెద్ద పెద్ద పట్టణాలలో 1953 సం॥ మార్చి నెలలో ఇండియా విమెన్స్ సేవింగ్సు వారోత్సవాలు జరిపాము. ఈ ఆదాయ కార్యక్రమంలో పదహారు రాష్ట్రాలు పాల్గొన్నాయి. సంక్షేమ సేవికల కోరికప్రకారం ఈ వారోత్సవాలు పక్షం వరకూ పొడిగించబడ్డాయి. మహిళల అఖండ కృషివల్ల దాదాపు 50 లక్షల రూ॥లు వసూలు అయాయి. పరిశీలనార్థంచేసిన ఈ ప్రయత్నంవల్ల పంచవర్ష ప్రణాళికకు సొమ్ము సేకరించడానికి మహిళా సంస్థల సహకారం అత్యవసరం అని రుజువు అయింది. ఈవిధానం ఆచరణలో పెట్టడానికి ఢిల్లీలో శ్రీమతి హన్నా సేన్ అధ్యక్షతను ఒక అనధికార కార్యవర్గం నిర్మింపబడ్డది. ఈ కార్యవర్గంలో వివిధ ప్రదేశాలకు ప్రతినిధులుగా సభ్యులు నియమింపబడ్డారు. ఆవిధంగా స్త్రీల పొదుపు ఉద్యమానికి కేంద్ర సలహా సంఘం ఏర్పాటయింది. మహిళల పొదుపు కార్యక్రమం ఆవిధంగా జాతీయ ఆదాయ కార్యక్రమం (National



మహిళల పొదుపు ఉద్యమ పక్షోత్సవాల సందర్భమున విశాఖపట్టణంలో జరిగిన సభలో శ్రీమతి కుసుమ్‌త్రివేదీ ఉపన్యసించుచున్నారు. వారి ఎడమవైపు కూర్చున్నవారు కేంద్ర సలహాసంఘ అధ్యక్షురాలు శ్రీమతి హన్నా సేన్, ఆంధ్రరాష్ట్ర ప్రతినిధి శ్రీమతి టి. జి. హైమవతి.

**Saving Scheme)** లో భాగం అయింది. అంతేకాని అది ప్రత్యేక సంస్థ కాదు. ఇప్పుడు ఇక్కడ మనకు అతిథులుగావచ్చిన గౌరవనీయులు శ్రీమతి హన్నా సేన్ అధ్యక్షురాలుగాను, శ్రీమతి లక్ష్మీముజుందారు ఉపాధ్యక్షురాలుగాను కేంద్ర సలహా సంఘంలో ఉన్నారు.

రిజిష్టరు కాబడ్డ మహిళా సంస్థలు, ఈ పొదుపు ఉద్యమానికి ఏజెంట్లుగా నియమింపబడుతున్నాయి. 12 సంవత్సరాలసర్టిఫికెట్లు అమ్మినందుకు ఈ సంస్థలకు నూటికి ఒక రూపాయి ఎనిమిదణాలు చొప్పున కమిషన్ ఇవ్వబడుతూఉంది. ఖర్చులుపోను మిగిలిన సొమ్ము ఏజెంట్లుగాఉన్న సంక్షేమ సంస్థలకే చెల్లుతుంది. ఈ కమిషన్ ఆకర్షణీయ మైన దనేకాక, ఈకార్యాచరణం ప్రధానంగా దేశక్షేమానికే అన్న సంగతి ముఖ్యంగా మనం గమనించాలి. ఈ సంస్థలను ఏజెన్సీ తీసుకోడానికి ప్రోత్సహిస్తున్నది లాభాలు సంపాదించడంకాదు. దీనికి దేశ క్షేమమే ముఖ్యోద్దేశం. మహిళల స్వల్పఆదాయపు ఉద్యమం స్త్రీలలో ఒక ఉత్సాహాన్ని పురికొల్పి జాతీయ ఆదాయోద్యమానికి ఒక పుష్టిని కలిగిస్తోంది. అందువల్ల ప్రజలలో, ముఖ్యంగా స్త్రీలలో, ప్రభుత్వం తలపెట్టిన గొప్పగొప్ప అభివృద్ధి పథకాలను గూర్చిన జ్ఞానం కలుగుతుంది. తద్వారా ప్రతి పురుషుడు, ప్రతి స్త్రీ, బాల బాలికలూ అందరూ జాతీయ విస్తరణకు తోడ్పడవలెననే అవసరంకలదని తెలుసుకుంటున్నారు. కాని స్త్రీలపొదుపు ఉద్యమం స్వల్పఆదాయాల విషయంలో ప్రధానపాత్ర వహిస్తున్నదని ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు. విదేశాల సహాయంకాని, హెచ్చుపన్నుల విధింపుగాని, ప్రజా బాహుళ్యంయొక్క ఐచ్ఛిక సహకారానికి సరిరావు.

సాంఘికసంక్షేమం కోసం ప్రథమ పంచవర్ష ప్రణాళిక నాలుగుకోట్లరూపాయలు ఏర్పాటుచేసింది. దేశం యావత్తు గల పట్టణాలలోనూ, పల్లెలలోనూ ఉన్న వేలాది సంక్షేమ సంస్థలు ఇందలి ప్రయోజనాలను అందుకున్నాయి. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఇంకా ఎక్కువ ధనం మంజూరు కానున్నది. నిజంగా నాలుగురెట్లు ఉండవచ్చును. గ్రాంటులు పొందదగిన సేవాసంస్థల నిర్వాహకులు ప్రభుత్వముయొక్క కోశాగారమును ఎట్లు భర్తీ చేయవలయునో తెలుసుకోవలెను. ఈవిషయములో మహిళలు తమ బాధ్యతను తెలుసుకున్నారు.

మహిళల పొదుపు ఉద్యమ విషయంలో ఏజెన్సీ పద్ధతి 1953సం॥ ఆగస్టులో ప్రారంభించబడ్డది. మొదట్లో, మహిళా సంస్థలు తేలికగా అనుసరించదగినట్టుగాలేక ఎన్నో ఆటంకాలు వచ్చాయి. ప్రారంభం మందంగా నడిచింది. ఏజెన్సీ తీసుకున్న నిర్వాహకులు పని ప్రారంభించడానికి కొంత ఆలస్యం అయింది ఏజెన్సీ పద్ధతియొక్క కార్యాచరణలో ఇటీవల మార్పులు చేయబడ్డాయి ఆచరణ విధానం తేలిక అయింది. నిర్వాహకులు ఇంక మంచి ఫలితాలు పొందగలరని నమ్ముతున్నారు. గడచిన సంవత్సరంలో కేంద్రసలహాసంఘంలో శ్రీమతి భారతీదేవి రంగా ఆంధ్ర ప్రాంతానికి ప్రతినిధిగా పనిచేశారు. అప్పుడు వారు అన్ని జిల్లాలలోను పర్యటించి చాలా శ్రమపడి నాలుగు నిర్వాహక వర్గాలను ఏర్పాటు చేయగలిగారు. కాని మొదటి సంవత్సరంలో అనగా 1954 డిశంబరుకు ఎక్కువ ఫలితాలను పొందలేకపోయాము. మొత్తం వసూళ్ళు రు 24.685. మాత్రం. కాని వసూలు చేయవలసిన అంచనా మొత్తం ఎనిమిది కోట్ల రూపాయలు. అందులో ఆంధ్ర ప్రాంతాలలో వసూలు చేయవలసినది 46 లక్షలు. మేము పూర్తి చెయ్యవలసిన సొమ్ము విపరీతంగా ఎక్కువ అయి ఉన్నదని గ్రహించాము. ముందుగా నేను విశదీకరించినట్లు కార్యవిధానంలో ఆలస్యం ఇక ఉండబోదు కనక మా వసూళ్ళు వేగంగా జరుగగలవని ఆశిస్తున్నాము. ఈ ఉద్యమం తీవ్రంగా జరపడానికి శాయశక్తులా ప్రయత్నిస్తున్నాము.

1954 డిసెంబరులో ఆంధ్ర ప్రాంతీయ సభ్యత్వమును నేను స్వీకరించిన తరువాత రాష్ట్ర మహిళా సంఘము స్థాపింపబడ్డది. ఈ రాష్ట్ర మహిళా సంఘానికి శ్రీమతి కుసుమ్ త్రివేది అధ్యక్షురాలుగా ఉండుటకు అంగీకరించి ఈ పొదుపు ఉద్యమాన్ని సౌష్ఠవం కావిస్తున్నందులకు ఎంతో కృతజ్ఞత తెలుపవలసి ఉన్నది— ముఖ్యంగా నేను. సమర్థురాలైన అధ్యక్షురాలున్నూ సాంఘికసంక్షేమ కృషిలో ఆరితేరిన గౌరవనీయులైన సభ్యురాండ్రున్ను ఈ కార్యక్రమం నడిపిస్తూఉంటే ఆంధ్ర దేశంలో ఈ ఉద్యమం అత్యంత విజయవంతం కాగలదని నమ్ముతున్నాను.

ప్రథమంలో ఏజెన్సీ తీసుకున్న నాలుగు వర్గాలేకాక ఇంకొక ఆరు సంస్థలు ఏజన్సీ తీసుకున్నవి. త్వరలోనే ఇంకొక రెండు సంస్థలకు కూడ అధికారం లభించగలదు.

ఈ ఏజెన్సీలన్నీ క్రొత్తగా నిర్మింపబడినవే. నా సోదరీ మణులందరూ వారి శక్తినంతా వినియోగించి ఈ స్త్రీల ఆదాయపు ఉద్యమాన్ని ఆంధ్ర దేశంలో వృద్ధిచేస్తారని నమ్ముతున్నాను. ఆంధ్రరాష్ట్రంలో పనిచేస్తున్న ఏజెన్సీలు ఈదిగువ ఉదహరింపబడినవి.

| | | |
|---|---|---|
| భారతీయ స్త్రీసమాజము | .... | విశాఖపట్టణం |
| విమెన్స్ ఇండియన్ అసోసియేషన్ | | .. |
| కృష్ణా డిస్ట్రిక్టు విమెన్స్ అసోసియేషన్ | | విజయవాడ |
| గిల్డ్ ఆఫ్ సర్వీస్ | .... | అనంతపురం |
| గిల్డ్ ఆఫ్ సర్వీస్ | ... | కర్నూలు |
| ఇండియన్ రెడ్‌క్రాస్ | .... | కర్నూలు |
| మహిళాసమాజ్ | .... | కడప |
| లేడీస్ రిక్రియేషన్ క్లబ్ | ... | నెల్లూరు |
| మహిళా సేవామండలి | .. | మచిలీపట్టణము |
| గిల్డ్ ఆఫ్ సర్వీస్ | . . | శ్రీకాకుళం |

ఆమోదమును పొందిన తక్కిన రెండు ఏజెన్సీలున్నూ, విజయనగరం కర్నూలు పట్టణాలకు చెందినవి. త్వరలోనే వానికి గూడ అధికారమివ్వబడును.

మహిళల పొదుపు ఆదాయ పక్షోత్సవాలు 1955 సం॥ జూన్ 24 తేదీనుండి జూలై 8 వ తేదీవరకు జరుపుతున్నాము. ఆంధ్ర గవర్నరు శ్రీ త్రివేదీ రేడియో ప్రసారంద్వారా ప్రారంభం చేశారు. యావదాంధ్ర దేశంలోనూ జరుపుతున్న ఈ ఉత్సవాలవల్ల గొప్ప విజయం చేకూరగలదని ఆశిస్తున్నాం. ఈవారంలో అనేక సమావేశాలు జరిపాము. అందు శ్రీమతి కుసుమ్‌త్రివేదీ. శ్రీమతి హన్నాసేన్, శ్రీమతి లక్ష్మీముజుమ్‌దార్‌లు పాల్గొనినందులకు గర్విస్తున్నాను. ఈలాంటి సమావేశాలే విజయవాడలోను, కర్నూలులోను, మహిళా ఏజెన్సీలు పనిచేయుచున్న ఇతర పట్టణాలలోను జరుగుతాయి. ఈ పక్షంలో స్త్రీ ఏజంట్లున్నూ ఇతర సభ్యులున్నూ ప్రత్యేకంగా అధికారులను, అనధికారులను కలుసుకుంటున్నారు. ప్రజలు మేము చెప్పునది ఉత్సాహంతో వింటున్నారు. ప్రస్తుతం కొద్దిమంది మాత్రమే వసూలు ఇచ్చినప్పటికీ ఎక్కువమంది పెద్ద సహాయం చేయడానికి వాగ్దానాలు చేశారు. ఓరిమియొక్క రూపమే స్త్రీ. అట్టి స్త్రీ ఓరిమితో ఎడతెగక కృషిచేస్తే వృధాకాదనే దృఢ విశ్వాసంతో సత్ఫలితాలకై ఎదురుచూస్తున్నాం. 1955 సం॥రం॥ సెప్టెంబరు నెలవరకు ఈ ఉద్యమాన్ని పొడిగించినందువల్ల వ్యవధి ఎక్కువ అయి మా కృషిలో

## శ్రీమతి లక్ష్మీముజుందార్



ఆంధ్ర మహిళల ఏకైక పత్రికయగు 'ఆంధ్ర మహిళ' ద్వారా ఈ సందేశమును పంపుటకు నేనెంతో సంతోషించుచున్నాను. స్త్రీజనాభ్యుదయమునకై నిశ్చలమైన విశ్వాసంతో, నిరాడంబరమైన సేవాదీక్షతో ఈవరకే ఆంధ్ర మహిళలు సంఘసేవా రంగమున దృఢస్థానమలంకరించుకొన్నారు.

స్త్రీల పొదుపు ఉద్యమ విషయమున ఆంధ్ర మహిళా సేవికల అత్యుత్సాహమైన కృషినిగూర్చి స్వయముగా తెలుసుకొను భాగ్యం కలిగినందుకు ధన్యురాలను. దేశంయొక్క సత్వరార్థికాభివృద్ధికి తోడ్పడి తద్వారా ప్రజాసామాన్య జీవితపరిమాణమును హెచ్చుచేసి, వాగ్దానాలు మాట వరసకేకాక ఇతర రాష్ట్రాలకు హెచ్చరికగాను, ఆదర్శప్రాయంగాను ఉండునట్లు మీరందరు రెండవ పంచవర్ష ప్రణాళికకు రెట్టింపు ప్రయత్నం చేయవలసిందని ప్రార్థించే ఈ అవకాశమును తీసుకొనుచున్నాను.

లక్ష్మీ ముజుందార్,
స్త్రీలపొదుపు ఉద్యమ
కేంద్రసల్లహాసంఘ ఉపాధ్యక్షురాలు, న్యూఢిల్లీ.

తీవ్రత తగ్గుతుందేమో అని భయపడుచున్నాము. ఇంత వరకు వసూలైన మొత్తము అయిదు లక్షలు. వాగ్దానం చేయబడ్డ మొత్తము రెండు లక్షలు.

ఇంతవరకు సంపాదించిన పెట్టుబడులు అనుకున్నంత మెచ్చతగినట్టుగా లేవు. గత ప్రభుత్వం పడిపోవడం, వెంటనే ఎన్నికలు రావడం, ఆంధ్ర దేశాన్ని రాజకీయ వాతావరణంలో ముంచివేసి అటువంటి కృషికి శ్రద్ధ వహించడానికి వీలులేకండా చేశాయి. ఏజెన్సీలు నిర్మించుటకుగాని, పెట్టుబడులు సంపాదించుటకుగాని ఈ సమయంలో సరిగా వీలుచిక్కనదికాదు. ఎన్నికలుకాగానే బలం చేకూర్చుకుని, సాధన సంపత్తులను సమకూర్చుకుని, ఉద్యమాన్ని తీవ్రంగా సాగించి కొంతవరకు తృప్తికరమైన పెట్టుబడులను సంపాదించగలిగినాము. వసూలు చేయవలసిన అంచనా అంకెతో పోల్చిచూస్తే మేము సంపాదించిన వసూళ్ళు చాలా తక్కువ అయినప్పటికీ, దేశంలోని పరిస్థితులనుబట్టిన్నీ స్వల్పవ్యవధిలో మేము సాధించిన మొత్తాలను బట్టిన్నీ, ఆంధ్ర దేశంలోని స్త్రీ పురుషులు తమ సహకారాన్ని ఇవ్వడానికి అత్యుత్సాహంతో ఉన్నారనడానికి ఎంతమాత్రం సందేహంలేదు

ఈ సందర్భంలో నేను ఆంధ్ర ప్రభుత్వాన్ని కోరేదేమనగా, సివిలుకోర్టులు, తత్సంబంధమైన సంస్థలు, దేవస్థానాల ధర్మకర్తలు, డిస్ట్రిక్టు బోర్డులు, మునిసిపాలిటీలు వీనిలో పెట్టుబడి పెట్టడానికి వీలు ఉన్న సొమ్ములు నేషనల్ సేవింగ్సు ఆర్గనైజేషన్ యొక్క ప్రతినిధులద్వారా జరపమని ప్రభుత్వం వద్దనుంచి ఒక్క ఆదేశం పంపినచో మనకు గొప్ప సహాయం జరుగుతుందని నా నమ్మకం. యూనివర్సిటీల అధికారులను, గొప్ప వ్యాపార సంస్థల కార్యకర్తలను, ప్రావిడెంటుఫండు, ఇతర ధర్మాదాయములను నేషనల్ సేవింగ్సు నిధిలో స్త్రీల ఉద్యమం ద్వారా జాతీయ విస్తరణకై పెట్టుబడి పెట్టవలసినదని ప్రార్థిస్తున్నాను. స్వల్ప ఆదాయాల ఉద్యమమే మహిళల పొదుపు ఉద్యమానికి ప్రధానమైనదైనప్పటికీ, అంచనా మొత్తం చాలా ఎక్కువగా నుండుటచే, పెద్ద మొత్తాలు సాధించవలసిఉన్నది. వాస్తవంగా పెద్ద ఆదాయాలు లేకండా చిన్నఆదాయాలకు దారిచూపలేము. మేము చేస్తున్న ఈ కష్టసాధ్యమైన ఈ ప్రయత్నంలో మీరు అంతా వ్యక్తిగతంగానూ, సామాజికంగానూ మీమీ సర్వశక్తులూ వినియోగించి సహాయము చేయవలసినదిగా ప్రార్థిస్తున్నాను— మనం దారిద్ర్యాన్ని నిర్మూలించడానికి నిరుద్యోగాన్ని పారదోలడానికి, అజ్ఞానాన్ని అణచివేయడానికీ అత్యవసరమైన పరిస్థితులలో నిమగ్నులమై యున్నాము. మనలో ప్రతి ఒక్కరు పొదుపరితనం నేర్చుకుని, మన ఆదాయాలను స్వల్పముకానీ, గొప్పవికానీ, జాతీయావసరములకువినియోగించి ఉద్యమాన్ని ఫలప్రదం చేయుదురు గాక!

నేను ముగించడానికి ముందు తమ సంపూర్ణ సహకారాన్ని ఇస్తూ, మాకు అనేక విధాల తోడ్పడుతూన్న రీజనల్ నేషనల్ సేవింగ్సు ఆఫీసరు గారైన జగన్నాధాచార్యులవారియొక్కయు ఇతర ఉద్యోగుల యొక్కయు కృషినిగూర్చిముచ్చటించకపోయినచో నావిధిని నెరవేర్చినదాననుకాను. కలిసిఉన్న రాష్ట్రంలోనుంచి ఇటీవలనే వేరుచేయబడిన ఆంధ్రరాష్ట్ర ఆఫీసుకర్నూలుకు త్వరలోనే మార్చబడును. అప్పుడు ఇంకా ఎక్కువసహాయం మాకు లభించగలదు. మహిళా మండలులద్వారా జాతీయ ఆదాయ సర్టిఫికెట్లనుకొని, జాతీయ ఆదాయ ప్రణాళికకు పెట్టుబడి పెట్టి తోడ్పడిన వారందరికీ నా ధన్యవాదములు అర్పిస్తూ, ముమ్ముందు వారి సంపూర్ణ సహకారమును ఇతోధికంగా ఆశిస్తూ ఇంతటితో విరమించుచున్నాను.



ఆంధ్ర దేశంలో ఏజెన్సీ తీసుకున్న మహిళా సంస్థల ద్వారా ఈక్రింది మొత్తములు వసూలు చేయబడినవి.

| | | |
|---|---|---|
| గిల్డు ఆఫ్ సర్వీస్, అనంతపురం | రు. | 79,905 |
| ఇండియన్ రెడ్‌క్రాస్, కర్నూలు | | 25,400 |
| గిల్డు ఆఫ్ సర్వీస్, కర్నూలు | | 1,000 |
| కృష్ణా విమెన్స్ అసోసియేషన్, విజయవాడ | | 5,000 |
| భారత స్త్రీసమాజం, విశాఖపట్టణం | | 45,000 |
| విమెన్స్ ఇండియన్ అసోసియేషన్, విశాఖపట్టణం | | 53,000 |
| మహిళా సమాజ్, కడప | | 5,000 |
| లేడీస్ రిక్రియేషన్ క్లబ్, నెల్లూరు | | 1,000 |
| మొత్తం | | 2,12,305 |

మహిళల పొదుపు ఉద్యమ సంస్థ ద్వారా ఈక్రింద ఉదహరించిన మొత్తములు ఆంధ్రదేశమున వసూలు చేయబడినవి.

| | | |
|---|---|---|
| శ్రీకాకుళం | రు. | 36,400 |
| విశాఖపట్టణం | | 20,000 |
| తూర్పుగోదావరి | | 55,040 |
| కృష్ణా (విజయవాడ తాలూకా) | | 34,000 |
| మచిలీపట్నం | | 29,800 |
| గుంటూరు | | 40,430 |
| నెల్లూరు | | 76,130 |
| కర్నూలు | | 1,073 |
| చిత్తూరు | | 2,000 |
| తిరుపతి | | 35,006 |
| | | 3,43,875 |

# ప్రారంభోపన్యాసం

**ఆంధ్రా గవర్నరు శ్రీ చందూలాల్ త్రివేది 1955 జూన్ 23 తేదీని విజయవాడ రేడియో కేంద్రంనుంచి మహిళల పొదుపు ఉద్యమ పక్షోత్సవాలను ప్రారంభిస్తూ కావించిన ప్రసంగము.**

మనరాష్ట్రంలో మహిళల పొదుపు పక్షోత్సవాలను ప్రారంభించే భాగ్యం నాకు కలిగింది నేను చాలా సంతోషిస్తున్నాను. వారివారి శక్తి కొలదీ సేవింగ్సు సర్టిఫికెట్ల ద్వారా పెట్టుబడి పెట్టుటవలన, పక్షోత్సవాలనూ, పొదుపు ఉద్యమాన్నీ విజయవంతము కావించి ప్రథమ పంచవర్ష ప్రణాళికను ఆచరణ యోగ్యంగా చేయుటకు సహాయపడతారనే సంపూర్ణ విశ్వాసంలో ఆంధ్ర స్త్రీలోకాన్ని నేను కోరుతున్నాను.

• • •

ప్రథమ పంచవర్ష ప్రణాళికను గూర్చి ఎక్కువగా చెప్పనక్కరలేదు. మీ కందరికీ తెలిసిన విషయమే.

మన దేశంలో అత్యంత స్వల్పంగా ఉన్న జీవనభృతి ప్రమాణాలను హెచ్చించుటకు ముఖ్యావసరములైన వ్యావసాయక పారిశ్రామికఉత్పత్తులనూ, తద్వారా రాబడినీ వృద్ధి చేయుటయే ఈ పథకంయొక్క ముఖ్యోద్దేశం. విద్య, ఆరోగ్యం, సంఘాభివృద్ధి, సాంఘికసంక్షేమం మొదలైన మహిళల అభిమానవిషయములిందు పొందుపరచబడినవి. ఇప్పుడు మనం పంచవర్ష ప్రణాళికచివరి సంవత్సరములో ఉన్నాం. అధికోత్పత్తి విషయంలోనేకాక ప్రజానీకంలో స్వయం సహాయమూ, పరస్పర సహాయమూ, మొదలైన భావములు కలగజేసి, ఇతోధికమైన అభివృద్ధిని పొందవలెననే కోరిక రేకెత్తించి, ఘనవిజయము సాధించాము.

• • •

రెండవ పంచవర్ష ప్రణాళికలో మొదటి ప్రణాళికకంటే విద్యావ్యాప్తికి వైద్య ఆరోగ్య విషయిక సౌకర్యములకు అన్ని విధములైన స్త్రీ శిశు సంక్షేమములకు ఎక్కువ శ్రద్ధ తీసుకొనబడవచ్చు. నిరుద్యోగం నిర్మూలనం చేయడానికి స్వల్ప ఎత్తు గ్రామ గృహ పరిశ్రమలకు గొప్పస్థానం ఇవ్వబడును. ఆంధ్రదేశంలో ప్రస్తుతం కృషి చేస్తున్న 17 సంక్షేమ విస్తరణ కేంద్రములే కాక ఇంకా చాలా ఎక్కువ కేంద్రములు ఏర్పాటు చేయబడును. దేశంలో సంక్షేమ సేవాసమాజములకు సాంఘికసంక్షేమ సంస్థ ఇతోధికమైనవిరాళాలిస్తూ సహాయంచేస్తుంది. నిజానికి ఎన్నో మహిళాసంస్థలు ఈ విరాళాల వల్ల ప్రయోజనాన్ని పొందాయి.

ప్రస్తుతం ఉన్న అనేకరకాల సేవింగ్సు సర్టిఫికెట్లలో ఒకటిగాని ఎక్కువగానికొని సెప్టెంబరు 30వ తేదీలోగా ఆంధ్రలో వసూలు కావలసిన 47 లక్షలరూపాయల పెట్టుబడిపూర్తిచేసి జీవితభృతి ప్రమాణాన్ని హెచ్చుచేసి, గృహములను సుఖతరంగానూ ఆనందదాయకంగానూ చేస్తారని ప్రార్థిస్తున్నాను.

భారతదేశం భాగ్యవంతమైనది కాదు. ఒకవ్యక్తి యొక్క సగటు ఆదాయం రు 300 ల కంటె ఎక్కువ లేదు. సామాన్య సంసారుల మాట అటుంచి ఎక్కువ వేతనాలు సంపాదించి ఖర్చులుపోను మిగుల్చుకుందేవారిని గూర్చి ముఖ్యంగా నేను అర్థిస్తున్నాను. వారు ఈ విధంగా మిగిల్చిన నిలవలు సేవింగ్సు సర్టిఫికెట్ల రూపమున పెట్టుబడి పెట్ట వలసినదిగా కోరుచున్నాను వారేకాక, వారివారి భర్తలను, సోదరీ సోదరులను కూడ ప్రోత్సహించవలసినదిగా కోరుచున్నాను.

వైభవాలకీ, భోగాలకీ ఖర్చు పెట్టునప్పుడు, ముఖ్యంగా వివాహ సందర్భాలలోనూ, విందులలోనూ, కొంత ఖర్చు తగ్గించుట అవసరము. ఇప్పుడు శ్రేయోరాజ్య స్థాపన మన ఆశయము. అందు ఎక్కువ అంతరభేదములు ఉండుట ఎన్నడూ ఉచితముకాదు. ఇకముందు అసలే ఉండకూడదు. ఆంధ్రదేశంలో ప్రతి సంవత్సరమూ అయిదు కోట్ల యాభైలక్షల రూపాయల విలువగల బంగారమూ వస్తువులూ ఖరీదుచేయబడుతున్నాయి. ఇందులో కొంత భాగం, సేవింగ్సు సర్టిఫికెట్లు కొనుటకు ప్రత్యేకించవలసినదిగా నా ప్రార్థన వివాహ సంబంధమైన కానుకలు, కట్నాలుకూడా సేవింగ్సు సర్టిఫికెట్ల రూపంలో ఉండాలని నాకోరిక

• • •

పెట్టెల్లో ధనం దాచుకోవడంవల్ల ఏమీ ప్రయోజనం లేదు. ఆ సొమ్ము సర్టిఫికెట్లద్వారా పెట్టుబడి పెట్టినచో పెట్టినవారికీ, దేశానికీ ఎంతోలాభం. సేవింగ్సుసర్టిఫికెట్లు కొనినసొమ్ముకు ఏమీపోటీ ఉండదనీ, అతి భద్రంగా ఉంటుందనీ, దానికి వడ్డీరేటుకూడా ఆకర్షణీయంగానే ఉన్నదనీ, నిర్ణీతకాలానికి ముందుగానేకూడా వాపసు తీసుకోవచ్చుననీ నేను ప్రత్యేకంగాచెప్పనక్కరలేదు. జైహింద్!

# కచేరీ చావడి

—— ·ం ——

ఆంధ్ర మహిళలో మగవారికోసము కచేరీ చావడి యుండగలదు.

కచేరీ చావడి కబుర్లు ప్రత్యేకంగా పురుషులకే—

**వారి అలవాట్లు! వారి పాట్లు!!**

**వారి సమస్యలు! వారికి సలహాలు!!**

**వారి హక్కులు! వారి ధర్మములు!!**

రాజకీయ వేత్తల గుసగుసలు. — సంఘ సంస్కర్తల సమస్యలు.

పట్టణ వాసపువారి పోకళ్ళు. — గ్రామస్థుల గ్రహపాట్లు.

(ఈ శీర్షికకు తమతమ రచనలను పంపగోరుచున్నాము)

# గమనిక

'ఆంధ్ర మహిళ' స్త్రీల సచిత్ర మాస పత్రిక. ఆంధ్ర లోకంతో సన్నిహితానుబంధం ఏర్పరచుకొని, మహిళా సంఘంలో నూతన ప్రబోధం కలిగించే ఆశయంతో ఆంధ్ర మహిళా సభ తరపున "ఆంధ్ర మహిళ" పత్రిక 11 సం॥ముల నుండి ప్రకాశితమగుచున్నది.

దీనియందు స్త్రీల మనోవికాసానికి తోడ్పడే వ్యాసములు, కథలు, నాటికలు, పిల్లలకు బాలానందం మొదలగు గద్య పద్యాత్మకములైన పలురకముల రచనలున్నవి. సాంఘిక రాజకీయ విషయములు, ప్రభుత్వము వారు దేశాభివృద్ధికై జరుపుచున్న సంక్షేమ కార్యక్రమాలు, స్త్రీలకుపయుక్తమైన గృహ పరిశ్రమలు మున్నగు వానిని గూర్చి మాసమాసము ఇందు ప్రకటింపబడును.

వార్షిక సంచిక, తపాలా ఖర్చులతోసహా

## సంవత్సర చందా 6-0-0

సేవాసంస్థలకు, గ్రంథాలయములకు, కళాశాల, పాఠశాలలకు,

**సంవత్సర చందా రూ. 3-0-0 మాత్రమే.**

"ఇదివరలో రు 4—8—0 యిచ్చియున్న వారికి వారికాతాను రు 1—8—0 జమకట్టబడును"

వివరములకు :

మేనేజరు
'ఆంధ్ర మహిళ'

ఆంధ్ర మహిళా సభ,
24-ఎ. లజ్ చర్చిరోడ్డు, మైలాపూర్, మద్రాసు.



"To train women workers and harness their services in the building up of the future of our Nation and Womanhood"

## ఆగస్టు 1955

| ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|
| • | 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 |
| 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 |
| 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 |
| 28 | 29 | 30 | 31 | • | • | • |

10. స్మార్తమధ్వ శ్రీకృష్ణజన్మాష్టమి. 15. స్వతంత్ర దినం. 19, గురుమాధ్యత్యాగం. 20. మొహరం.

## ANDHRA MAHILA SABHA

MYLAPORE : MADRAS 4.

Edited by Mrs. A Bhaskaramma,
Printed & Published by Mrs. A. C. Krishna Rao, M.A., L.T.,
at the Andhra Mahila Press. Mylapore, Madras 4